# శ్రీ గోవింద రామాయణము





## సుందర రాముడు



ప్రతికర్త
— "కళాప్రపూర్ణ"
రి గోవిందాచార్యులు

1976

# శ్రీ గోవింద రామాయణము





## సుందర రామయము





ప్రతికర్త

— “కళాప్రపూర్ణ”

...రి గోవిందాచార్యులు

1976

# గోవింద రామాయణము

## సుందరకాండము

రచన

కళాప్రపూర్ణ

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు


వెల రు 15-00

Publisher

M/S. N. V. SWAMY & CO.,

35, జవహర్‌నగర్

1-8-76, PRENDERGHAST ROAD,

SECUNDERABAD-3.

# గోవింద రామాయణము — అభిప్రాయములు.

## శతావధాని - శ్రీ వేలూరి శివరామ శాస్త్రి

ఈ గోవింద రామాయణం చదివిన తరువాత వేరు వేరు రామాయణాలు చదువనక్కరలేదు. అలాగే వేరు వేరు వ్యాఖ్యలు పరికించే పనిలేదు.

## శ్రీ బూర్గుల రామకృష్ణ రావు

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులవారు భారత స్వాతంత్ర్య సమర యోధులలో అగ్రశ్రేణికి చెందినవారు. త్యాగమయ జీవితమును గడిపిన మాన ధనులు. అనాసక్తియోగము నవలంబించిన కర్మయోగులు.

## కవి సమ్రాట్ - శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఆచార్యులవారి శైలి ప్రసన్నమై మధురమై సర్వజన సుబోధకముగా నున్నది

## కళాప్రపూర్ణ శ్రీ నిడుదవోలు వేంకటరావు

"అందరూ ఒక యెత్తు! అగస్త్యు డొక్కడు ఒక యెత్తు"—అన్నట్లుగా తెలుగు భాషలో నింతవరకు వెలువడిన రామాయణము లొక యెత్తు - గోవింద రామాయణమొక యెత్తు—అని ఘంటాపథముగా చెప్పవచ్చును.

## శ్రీ అయ్యదేవర కాళేశ్వర రావు

శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యుల వారు సుప్రసిద్ధ ఆంధ్రనాయకులు. అనన్య ప్రతిభాశాలి. అఖండ త్యాగధనుడు. ప్రాణము కోల్పోవుట కైనను సిద్ధపడి స్వాతంత్ర్యపోరాటములో పెక్కుసార్లు కారాగృహమునకు చని వచ్చినవారు. ఇప్పుడు గోవింద రామాయణము వ్రాసి ఆంధ్రభాషకు అఖండ సేవ చేసినారు.

## మాడపాటి హనుమంత రావు

పద్యములు సులభశైలిలో రసపరిప్లుతములు

## శ్రీ కాటూరి వేంకటేశ్వర రావు

సరళ సుందరమైన వాల్మీకి రచనమందలి సౌలభ్యాన్ని పుణికి పుచ్చుకున్నది గోవింద రామాయణం.

# అంకితము

శ్రీ

సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత
శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః

ఉ. శ్రీరఘురామచంద్రహృది౯
జేరిచినీదుపదాబ్జసీమ, సా
ధారణచైత్రశుద్ధమున
ధాత్రిని, బుట్టిననాటికాన్కగా
గౌరవమొప్పషట్కృతిని
గైకొనుమంకితమీవ, గౌతమీ
తీరనివాసభద్రగిరి
దేవ? కృపాపర జానకీవరా!

# తొలిపలుకు.

ఆచార్య

శ్రీ డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు

ఎమ్. ఎ. పి. హెచ్.డి

ఆంధ్ర శాఖాధ్యక్షులు: ఉస్మానియా విశ్వవిద్యాలయం

శ్రీమద్రామాయణ తారహారమునఁ దరళ స్ఫూర్తి విడంబించునది సుందర కాండము. ఇది యాది నుండి తుదిదాఁక హనుమంతుని వీర విక్రమ విహార సౌందర్యమును బ్రదర్శించును. సుందరుఁడైన హనుమంతుఁడు నాయకుఁడుగా నొప్పిన కాండమగుటచే దీనికీ పేరు కలిగినది. అతఁడు సముద్రమును దాఁటి యశోకవనమున సీతను గాంచి యామె శోకమును, సీతా క్షేమవార్తను నెఱింగించి రాముని శోకమును దొలఁగించిన వృత్తాంతమును వర్ణించున దగుటచేఁ గూడ దీనికీ నామము సార్థకమగుచున్నది. గాయత్రీ మంత్ర బీజాక్షర సమన్వితమైన శ్రీమద్రామాయణమున మంత్ర మధ్య మాక్షరము త్రిజటాస్వప్న వృత్తాంతమునఁ బడినదనియు. దత్స్వప్న దృష్ట విశేషములకును గాయత్రీ మంత్రార్థమునకును సన్నిహిత సంబంధమున్నదనియు నభిజ్ఞులు చెప్పుదురు. అదియును వాల్మీకి కవితా సమధిక రామణీయకమును గూడ నీ కాండముయొక్క సౌందర్యమునకు కారణములై యుండవచ్చును.

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యుల వారింత వఱకైదు కాండములను మహాకవిత్వ దీక్ష విధినొంది సరస ప్రసన్నమైన శైలిలో సంతరించి యుండిరి. వారి హృదయమున శ్రీరామచంద్రుని పాదార విందములపై గాటముగా నాటుకొని యున్న భక్తియే అనారోగ్య స్థితిలోఁ గూడ వారిచే నీ మహాకార్యమును జేయించినది. "భక్తిః కిం న కరోతి" యనికదా యాచార్య స్వాములవారి వాక్యము! ఈ రచనలో ప్రతి సన్నివేశము నందును శ్రీమదాచార్యులవారి నిర్మల భక్తి సంపద ప్రత్యక్షమగుచుండును. అందును ఆశ్వాసాంతములందు వారాత్మాశ్రయ ప్రధానములుగా వ్రాయుచుండు పద్యము లనవద్యమైన వారి భక్తికి నిధానములై అత్యంత హృద్యములుగా నుండును.

లోకమున శ్రీమత్సుందరకాండ పారాయణము చేయువారు తొలుత గావించుచుండు హనుమత్స్తోత్రములో గోచరించు విశేషణము లన్నిటికిని లక్ష్యభూతమైనది, సుందరకాండమే. అతఁడు గోష్పదీకృత వారాశి, మశకీకృత రాక్షసుఁడు, రామాయణ మహామాలా రత్నము, అనిలాత్మజుఁడు, మనోజవసమ మారుత తుల్య వేగుఁడు, జితేంద్రియుఁడు, బుద్ధిమద్వరిష్ఠుఁడు, వానర యూథ ముఖ్యుఁడు, శ్రీరామదూత, జానకీ శోక నాశనుఁడు, అక్షహంత, లంకా భయంకరుఁడు, ఈ విశేషణముల నొక్కొక్క దానినే ప్రపంచించుకొని పోయినచో సుందరకాండము నందలి కథావస్తువును వివరించినట్లగును. శ్రీమాన్ ఆచార్యుల వారు వాల్మీకి మహాకవి వలెనే యీ కాండమున నాయా ఘట్టములందు హనుమంతుని గుణగణములను, స్వరూపస్వభావములను జక్కఁగా వివరించి యున్నారు.

శ్రీమాన్ ఆచార్యుల వారీ కాండమును తరణము, ప్రయత్నము, దర్శనము, ఉపదేశము, ప్రమదము అను సార్థకములైన నామములతోఁ గూడిన యైదాశ్వాసములుగా విభజించి యున్నారు. వీనిలో నడిమిదైన దర్శనాశ్వాసము పెద్దదైనదే కాక ప్రధానమైనది కూడను. సుందరకాండమున కది ఆయువుపట్టు. సీతా సందర్శనము, సీతా రావణుల సంభాషణము, త్రిజటాస్వప్నము, రామాయణ కథా కథనము, రామగుణాభి వర్ణనము, చూడామణి గ్రహణము మున్నగు భాగములను శ్రీమాన్ ఆచార్యుల వారిందు కవితా పారవశ్యముతో రచించి యున్నారు. ఉపదేశాశ్వాసమునందలి విభీషణుని ఉపదేశమును, ప్రమదాశ్వాసము నందలి మధువన సీతా దర్శన కథన వృత్తాంతములను, ప్రయత్నాశ్వాసము నందలి అన్వేషణ వృత్తాంతమును వారు రచించిన తీరు కడుంగడు ప్రశంసార్హమై యొప్పారుచున్నది.

హనుమంతుడు సీతతో రాముని గూర్చి చెప్పునప్పుడు 'కింకరిష్య సిరామేణ' ఇత్యాది శ్లోకముల కెంతర్థములు స్ఫురించునట్లుగా వాల్మీకి వ్రాసియుండెను. శ్రీమాన్ ఆచార్యులవారుకూడ నీ సందర్భమున 'రూపసి? శుభుఁడ' అను పద్యము వ్రాసి అద్భుతముమును ప్రకటించి యుండిరి. ఇట్లే "సర్వలోక మనోహరం. రామాయణము" (65—96) అను పద్యమునఁ గూడ వారు మూలము నందలి సాభిప్రాయ పదములను విడువకుండ ప్రవేశపెట్టి యున్నారు. ప్రయత్నా

శ్వాస మందలి కర్కటి రాక సందర్భమున వారు బ్రహ్మదేవుఁడు హనుమంతుని యిరువదేడు నామములను వినిపించినట్లు వర్ణించియుండిరి. ఈ నామములు పరాశర సంహిత నుండి గ్రహింపఁబడినట్లు సూచింపఁబడినది. లంకాదహనమును గావించి రావణుఁడు సంతాపమొందిన వృత్తాంతమును వారు యాజ్ఞవల్క్య రామాయణము నుండి గ్రహించిరి. రామాయణమును రచించు సందర్భమున వారు వాల్మీకి రామాయణమునే కాక మఱెన్ని గ్రంథములను బరిశీలించి యుండిరో వీనివలనఁ దెలియనగును.

ఈ సుందరకాండమును జదువఁగా వయసుతోఁ గూడ శ్రీమాన్ ఆచార్యులవారి హృదయ మందలి భక్తియు, కవితా శక్తియుఁ గూడ నుత్తరోత్తర పరిపక్వ తరములై యలరారినవని నాకుఁదోఁచినది. ఇందలి పద్యములలో నెక్కడను ధారాశుద్ధి కుంటువడి యుండలేదు: భావములు బలహీనములు కాలేదు; వ్యక్తీకరణము శక్తిని గోల్పోయియుండలేదు. శైలి నివాతస్థిమిత కాసారోపరితలము వలె నిర్మలమును, సర్వప్రసన్నమును, సరసమును, మనోహరమునై యొప్పారుచున్నది. వారి జీవితమున వలెనే యిందలి రచనలోఁ గూడ నెక్కడను ఆడంబరము కాని, వక్రత కాని, క్లిష్టత కాని గోచరింపదు, ఇందలి పద్యములను సత్వరముగా చదువుకొని పోవుచుండ మకరంద ప్రవాహమున నోలలాడినట్లు, మలయ మారుతమున విహరించిన భంగి, మధుర మంజుల వంశీగానము నాలకించినరీతి హృదయమున నాహ్లాదమావహిల్లినది. అందుకాచార్యులవారి రచనయందలి సారళ్య సౌందర్యములవలెనే హనుమద్దేవుని వృత్తాంతము నందలి చారుత్వోదాత్త్యములును సమానముగా కారణములు. శ్రీమాన్ ఆచార్యుల వారిందు సామాన్య వృత్తములను జాత్యుప జాతులను మాత్రమే కాక యెడ నెడ మానిని, దోదకము, సుగంధి మున్నగు వింత వృత్తములను గూడ వాడి యుండిరి. ఇతర కాండములందు వలె నిందును కథాకథనమునకు ద్విపదలను బ్రయోగించియుండిరి, ప్రమదాశ్వాసమున హనుమంతుఁడు జాంబవదాదులకుఁ దాను లంకకుఁ బోయి వచ్చిన వృత్తాంత మెఱింగించు సందర్భమున దీర్ఘమైన దండకము వ్రాయఁబడినది. నిజమున కిందలి విషయమంతయు వర్ణితపూర్వమైనట్టిదే అందుచే పౌనరుక్త్య శ్రవణము వలనఁ గలుగు విసువును దొలగించుట కై ద్రుతగతియైన యీ దండకముపయోగపడుచున్నది. దండకములు సాధారణముగా స్తుతిభక్తి ప్రధానములై యుండును. ఇటీవల

నెవరో రామాయణము నంతను దండక రామాయణ మను పేరుతో బృహత్తర మైన దండకముగా రచించియుండిరి. దాని వలెనే యీ సుందరకాండము నందలి యందమైన దండకమును గథా కథనముతోఁ గూడి యెంతో రమణీయముగా నున్నది.

శ్రీమాన్ ఆచార్యులవారు సంకల్పసిద్ధులు. సంకల్ప బలమే వారిచే రామాయణమును రచింపఁజేసినది. వారి యుద్ధకాండము కూడ నచిరకాలముననే ప్రకటింపఁబడ నున్నదని వింటిని. శ్రీమద్రామాయణమును రచించిన వారెవ్వరును యశస్సం పన్నులు కాకుండఁబోలేదు. ఆ మహత్త్వము రామాయణ కథ యందున్నది. మహాకవులు రామాయణమును వ్రాయఁగోరుదురు. రామాయణము రచయితలను మహాకవి పుంగవులుగా నొనరించును. శ్రీమాన్ ఆచార్యులవారు రామాయణమును నిష్కామబుద్ధితో రచించిరి. వారి కొక్కటే కామ మనిపించు కోవి కోరిక యున్నది. సీతారాములకు స్వయముగా పట్టాభిషేకము చేసి లోక మోహన మూర్తులైన యాజాయాపతులను కవగానుండఁ జూడవలెనని, వారి కుపాస్యదేవతయైన శ్రీ త్రిపురసుందరి వారి కా సౌ భా గ్య ము ను తప్పక కలిగించుగాక.

హైదరాబాదు
7–6–71

దివాకర్ల వేంకటావధాని



# సమీక్ష

పరిశోధనా పరమేశ్వర-విద్యారత్న
ఆచార్య శ్రీ నిడదవోలు వెంకటరావుగారు ఎమ్. ఎ.
ఆంధ్ర శాఖా మాజీ అధ్యక్షులు: మదరాసు విశ్వవిద్యాలయము

"రాశబ్దోచ్చారణో జాతే వక్త్రాత్ పాపంవిగచ్ఛతి
మకారశ్రవణేజాతే భస్మభావంగమిష్యతి
(ఉమాసంహిత)

రాయను నక్షరంబు ముఖరంగ తటిన్నటి యించినంతనే
పాయునఘంబు మాయన కవాట గతింజొరనీ దభేద్యమై
ఆయఘహారి తారక మహత్తర మంత్రము సంస్మరించిరా
మాయనమో యటంచుఁగు సుమాంజలిఁ గూర్చియుప క్రమించెదన్.

శ్రీమద్రామాయణమును ననవద్య పద్యహృద్యమగు రీతిని నాంధ్ర భాషలో రచియింప బ్రారంభించి, శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులవారు, స్వనామాంకితముగ నిప్పటికైదు కాండములను బ్రకటించి యున్నారు.

'ధార్మిక రాముఁడు' అను పేరబరగుచున్న కిష్కింధా కాండాంతమున ఆచార్యులవారిట్లు సుందరకాండమును గూర్చి వ్రాసియున్నారు.

"సుందర యుద్ధకాండములు సొంపుగ వ్రాయఁగఁజేయు మింక నా
నందకరమ్ముగా బుధజనంబులు మెచ్చఁగ నీకృపాకణం
బందిలయింప జన్మలిక భాసుర దివ్యగుణ ప్రదీప్తమౌ
విందొనఁగూడి భక్తతతి పెంపెసలారఁగ నీదుసంస్మృతిన్"

బాలాత్రిపుర సుందరీ కృపాకటాక్షము చేతను, శ్రీరామానుగ్రహము వలనను, నేడు సుందర కాండమును సుందరరాముఁడు[1] అనుపేర సంపూర్తి

---

1. గోవింద రామాయణమున-కాండములకు ప్రత్యేక నామములుగలవు. 1. ఉత్తరకాండము. 2. సీతారామము (బాలకాండము) 3. పాదుకాపట్టాభిషేకము (అయోధ్యా కాండము) 4. రక్షకరాముఁడు (అరణ్య కాండము) ధార్మిక రాముఁడు (కిష్కింధా కాండము)

గావించి ఆచార్యుల వారాంధ్రలోకమున కందిచ్చినారు. వారు సుందర కాండ వ్రాయవలెనన్న కోర్కె సఫలమగుటయే గాక, మనకు సుందరకాండ రచనలలో నొక "సుందరతమమగు సుందరకాండ" లభించినది. వారీ కృత్యాదిలో నీసుందర కాండ నిట్లు సుందరముగా రచింతునని ప్రారంభించినారు.

సుందరుఁడా రఘూద్వహుఁడు-సుందరి భూమిజ ఆంజనేయుఁడున్
సుందరుఁడాది కావ్యమున సుందరకాండము సుందరంబు నా
నందకరంబు నిత్యపఠనంబునఁ గామితదాయకంబునున్
సుందరి వీవు భక్తుఁగృపఁజూచుము వ్రాయఁగ సుందరంబుగన్ (2ప)

అందుసిద్ధహస్తులైనారు.

రామాయణములో సుందర కాండకు తక్కిన కాండలకన్న నధిక ప్రాముఖ్యము గలదు. అది పారాయణ గ్రంథము. ఆపత్సమయము లందును, శరీరము, రోగపీడితమగు నప్పుడును, సుందరకాండ పారాయణము చేసినను లేక పారాయణము చేయుచుండ వినినను, వారి కాయాపత్తులు తొలగి, యారోగ్యవంతులై యుందురు.[1] ఇది యీనాటి వారికి కొంత విడ్డూరముగా తోచవచ్చును. కాని యిది వాస్తవము. దీనికి ప్రత్యక్ష ప్రమాణము మన గోవిందాచార్యులవారే.

వారీ సుందర కాండముత్సాహముతో వ్రాయప్రారంభింపగా నడుమ వారికి 'ఉద్దండముగ రోగము' వచ్చినది. కాని రామ కృపవలన నాగండము తప్పి కాండము పూర్తియైనది. వారేదీనినిట్లు కాండాంతమున దెలిపినారు.

ఉ. అండగఁజూచి రామవిభునాతని దాసుని రోగి నయ్యునీ
కాండము వ్రాయఁబూనితి నఖండ ముదంబునఁగాని మధ్యను
ద్దండగతిన్ రుజంగసితి దాఁటగ గండము ప్రేమమీఱ రా
ముండెధరాత్మజా ప్రియుఁడె పూర్తిగ వ్రాయఁగఁజేసె సత్కృపన్.

---

1. ఈ హేతువుచేతనే చాలకాలము నుండి రామాయణమున సుందర కాండ వేఱుపఱుపబడి, ముద్రితమై వ్యాప్తిలో నున్నది. పారాయణానుకూలముగనే గాక, అర్థము తెలిసికొనుట కనువుగ తెలుగు తాత్పర్యముతో, సంస్కృత మూలముతో ముద్రితమైనది.

కేవలము పారాయణచేతనే యారోగ్యముగలిగి కోరికలు సిద్ధించునపుడు సుందరకాండను స్వంతముగా, కవితలో కూర్చినపుడు ఆచార్యులవారి కారోగ్య మబ్బుటలో నాశ్చర్యములేదు ఆసుందరకాండ మహిమ యట్టిది. శ్రీరామ చంద్రుని నిరవధిక కృపా విశేషముచే నాచార్యుల వారాయుష్మంతులై, యుద్ధ కాండమును గూడ పూర్తిచేసి తమజన్మ సార్థకముచేసి కొందురు గాక! ఈ కాండాంతమునవారు.

"నాకనారోగ్యముం బాపి సాకుమీవ
నీకుపట్టాభిషేకంబునే నొనర్చ
సీతకవఁగూడి పట్టాభిషక్తురాము
కనుల విందుగ నిను(జూడ గలుగనిమ్ము"

అని శ్రీరాముని ప్రార్థించినారు. శ్రీరామ కటాక్షమువలన, శ్రీరామ పట్టాభిషేకమునే–గాక–ఆచార్యులవారి కవితా పట్టాభిషేకమును, ఆంధ్రలోక మవలోకించును గాక.

'సుందర రాముఁడు'

సుందర కాండమునకీ పేరెంతయు సార్థకమై యున్నది. సుందర కాండమున–కథానాయకుడు హనుమంతుడు–ఈ కాండముననే–సుందర హనుమన్మంత్రము–దాని శక్తి విశేషములు–బ్రహ్మచే, నుపదేశింపబడినవి. ఇందువలననే నీకాండమునకు సుందర కాండయని పేరు వచ్చినది.

ఈ సుందర హనుమన్మంత్ర కథ యీ కృతియందుదక్క–యే యితర సుందర కాండములందునులేదు. అందుచే మొదట దానిని తెలుపుచున్నాను.

హనుమంతుడు లంక ప్రవేశించి, సింహద్వారమున లంకిణిని జయించిన వెనుక, ఆమె సోదరి కర్కటి విషూచి భయంకర రూపముతో నొక వక్రదండము ధరించి, యాతని కడ్డెను. ఆంజనేయుడు వెంటనే, నామె దండమును లాగి, దానితో నామెను మోది భూమిపై త్రెళ్ళనేసెను–అంత.

"అదికని బ్రహ్మదేవుఁడట కప్పుడవచ్చి సమీర సూతికిన్
విదితమొనర్చె వాయుజుఁ బవిత్ర మహోత్తమమంత్రరాజమి
య్యదికడు సుందరంబనుచుఁ బావని నామము లిర్వదేడునున్
హృదిఁదలఁపన్ విషూచి మొదలేరుజయుం గన రెవ్వరీభువిన్"

"అనుచును నిరువది యేడగు
హనుమచ్ఛుభనామ పఠన మండలి శక్తిన్
వినిపించుచు నాసుందర
హనుమన్మంత్రంబుఁ దెలిపి యాతండేగెన్"

ఆచార్యులవారీ మంత్రమున గల మారుతి యిరువదేడు నామములను గూడ నిచ్చి యున్నారు. (పుట 26,27)

ఈ హన్మత్ సుందర మంత్ర సహితమగుటచే-నాచార్యులవారు హనుమంతుని సుందరుడని వ్యవహరించినారు. ఇందువలన-రామాయణ కథా నాయకుడగు శ్రీరాముడు సుందర రాముడైనాడు.

## రచనా విశిష్టత

ఇట్లు పేరు చేతనేగాక, యింపలి కవితా రచనయు సుందరమైనదే. అది తెలుపుటకు ముందు గ్రంథ వివరము తెలుపుట యావశ్యకము.

వాల్మీకి మూలమున-68 సర్గలును 2808 శ్లోకములు గల యీ కాండను, ఆచార్యులవారు 1475 పద్యములలో రచించిరి. ఇందైదాశ్వాసములున్నవి. ప్రతి యాశ్వాసమునకు కథా సందర్భము ననుసరించి ప్రత్యేక నామములున్నవి.

| | | |
|---|---|---|
| 1. | తరణాశ్వాసము | 119 పద్యములు |
| 2. | ప్రయత్నాశ్వాసము | 210 ,, |
| 3. | దర్శనాశ్వాసము | 665 ,, |
| 4. | ఉపదేశాశ్వాసము | 321 ,, |
| 5. | ప్రమదాశ్వాసము | 158 ,, |

---

1. ఇప్పటి కిరువదేండ్ల క్రిందటనేను తంజావూరి పుస్తక భాండాగారము పక్షమున కట్టా వరదరాజు ద్విపద రామాయణమును నాలుగు సంపుటములుగా ప్రకటించి, అందు సుందరకాండ పీఠికలో నిట్లు వ్రాసినాను.

'హనుమన్మంత్రములో సుందర హనుమన్మంత్రముగలదు' ఆమంత్రము హనుమన్మంత్రములలో ప్రధానము. ఆమంత్రము నుపాసించుచుఁ దత్పౌరుష చిహ్నమగు సుందర కాండమును పారాయణము చేసినచో శీఘ్రఫల ప్రదమని ప్రాజ్ఞులైన పెద్దల యభిప్రాయము (పుట 8) నేను పైగ్రంథము ప్రకటించునాటికీ మంత్ర విశేషముల నెఱుగను. ఈనాడు శ్రీ గోవిందాచార్యులవారి గ్రంథ మూలమున నీమంత్ర విశేషములను తెలిసికొంటిని గాన వారికి నాకృతజ్ఞత తెలుపుకొన్నాను.

సుందరకాండలో ముఖ్యఘట్టము-హనుమంతుడు సీతను దర్శించుట ప్రధానముగాన, నిందీఘట్టము విపులముగానున్నది. ఇది గ్రంథములో సగము భాగమని చెప్పనొప్పును.

ఈ కృతియందంతట హనుమంతుని మూర్తిమత్త్వము, ప్రభావము చక్కగా విశదీకరింపబడినవి

తరణాశ్వాసమున సముద్రము లంఘించుటకు మింటిపై బాఱునపుడు, మారుతిసహస్రారమును భేదించుయోగితో పోల్పబడినవాడు.

"కుండలిని పరాశక్తిని గూడనున్న
యోగిచందాన మారుతి యొప్పెనపుడు
లంకయను కుండలికిఁజేరి లలిత శక్తి
సీతఁగననుండె నా యన చెలఁగుచుండె. (24 ప)

ఇడయుఁ బింగళయు సుషుమ్న లేకమగుచు
జన సహస్రారమునఁ బరాశక్తిఁ గనగ
వెడలుయోగి విధంబున వెడలె హనుమ
జానకినిలంకఁ జూడంగఁ జదలవెంట
31వ పద్యమును యోగవిషయమే తెలుపును. (25 ప)

పై మూడు పద్యములును ఆచార్యులవారి యోగశాస్త్ర పరిజ్ఞానమేగాక, యోగాంజనేయమూర్తి మనకు ప్రత్యక్షమగుచున్నాడు.

యోగాంజనేయమూర్తినేగాక పంచముఖాంజనేయ మూర్తిని మనకాచార్యుల వారు దర్శింపజేసినారు.

హనుమ పెనుగోళ్ళచేతుల సంతసాచి
పర్వతాకారుఁడై మింటఁ బాఱుచుండ
అద్రిలోనుండి వెడలెడు యెదుతలల
పాములనదోచె మారుతి బాహుయుగము. (27 ప)

తరణాశ్వాసాంతమున-హనుమంతుని.

"పంచముఖముల భాసిల్లు పండితుండ"

అని సంబోధించినారు.

సురసయడ్డగించునపుడు, పవనజుడంగుష్ఠ మాత్రుడై యామె నోటిలో నుండి వెడలెను. ఈసందర్భమువలన నాంజనేయున కణిమాద్యష్ట సిద్ధులుగలవని మనము గ్రహింపవచ్చును. ఈ విషయము.

అంతనంతలోన నంగుష్ఠమాత్రుఁడై
హనుమ దానినోటి యందుదూరి
యవలబడుచు నిలిచి యణిమాది సిద్ధుఁడు (78 వ)
సురసఁగాంచి పలికె సరసగతిని.

అన్న పద్యము తెలుపుచున్నది.

ప్రయత్నాశ్వాసమున-లంకలో సీతను పలుప్రదేశములలో వెదకుచున్నప్పుడు. ద్విపదలు పయోగించుటయందు కృత్త్యౌచిత్యముగలదు-ఆంజనేయుడు తనరెండు పాదములతో నతిత్వరితగతిని నాయాప్రదేశములను వెదకుట యది సూచించును.

దర్శనాశ్వాసమున-రావణుడు సీతతో తన యభిప్రాయము వ్యక్తపఱచు సందర్భమున-దేవియని సంబోధించునప్పు డాచార్యులవారు మూలపదములనే ప్రయోగించి, సీత పరముగను దేవీపరముగను రెండర్థములను సాధించుట హృద్యమైయున్నది.

"సర్వలోక మనోహర చాలుభయము
నలదు సర్వాంగగుణమూర్తి భయము నిన్న
హో విశాలాక్షి కామించియున్నవాఁడ
దేవి కృపఁజూడుమీ నీవదీనునన్ను. 3-96.
సర్వలోక మనోహర దేవి మాత్రమే
సర్వాంగగుణ సంపన్న దేవి మాత్రమే
విశాలాక్షి ఈపేరు గలదేవి.

ఈ ఘట్టమున నాచార్యులవాడు త్రిపురసుందరి భక్తుఁగాన- 'దేవి! త్రిపురసుందరి భక్తుఁదేల్చుమింక. 3-101.
లలితమూర్తి 3-103.
త్రిలోకసుందరి 3-100
అనియు, సుందరి' అనియు సీతను సంబోధించినారు.

భార్యయనగా—కాంతిచే పూజింపదగినది యను. వ్యుత్పత్తి హృద్యము.

గడువులోపల భార్యవై గ్రాలకున్న
గడువుదీరిన మఱునాఁడె కాంత నిన్ను
ప్రాతరాశార్థమై చంపి వంటయింట
వండినంజుగా నిడువారు వంటవారు 3—169.

దీనికి—మూలమునగల శ్లోకము నుదాహరించి, దానికి మాహేశ్వర వ్యాఖ్యతో, టీకతోగూడ చూపుటచేత గ్రంథకర్తలు మూలమునెంత తల స్పర్శిగా పరిశీలించి తామీ గ్రంథము వ్రాసిరో వెల్లడి యగుచున్నది.

సీతమాటాడుట—గీతమాలికగా గూర్చుట—సార్థకము—ఏలననగ, ఆమె మనోనిశ్చయము దెలుపునపుడు మాటలను సూటిగా నాడునేగాని—మధ్య మధ్య నాగదు.

వేయికండ్లవాని వేల్పుల ఱేనిని
గూడియుండు శచిగగూడియుందు
రామునాదుభర్త రాజీవలోచను
దీనుఁడైన రాజ్యహీనుఁడైన. 3—199.

అనియామె తన దృఢాభిప్రాయము ప్రకటించినది.

ఇందు సీతపాత్రమహోదాత్తముగ జిత్రింపబడినది ఆంజనేయునిపాత్ర యతిలోకోత్తరముగ వర్ణితమైనది.

ఇందే—హనుమంతుడు సీతతో శ్రీరాముని గుణగణముల వర్ణించు నపుడాతడు దాసాంజనేయుడుగా మనకు ప్రత్యక్షమగుచున్నాడు.

అశోకవనధ్వంసము- చైత్ర ప్రాసాద ధ్వంసము జంబుమాలి, మంత్రి పుత్రులు—అక్ష కుమారులవధ కథాఘట్టములలో వీరాంజనేయ మూర్తి మూర్తీ భవించుచున్నాడు. ప్రమదాశ్వాసమున హనుమంతుడు, తన ప్రయాణ వృత్తాంతము దండకములో చెప్పుటయందౌచిత్యము చాలగలదు. దండయనగా, పూస లొక దానితో నొకటి దగ్గరగా చెప్పుట. దీనినే పూసగ్రుచ్చినట్లు అనియందురు. ఇచ్చట దండకములో నాంజనేయుడు వివరించుటచే నొక్క విషయము విడువ కుండ పూసగ్రుచ్చినట్లు వినిపించినాడని స్వారస్యము. ఇట్లేన్నెని స్వారస్యము లీకాండనుండి చూపవచ్చును. గ్రంథవిస్తర భీతిచే విరమించితిని.

## పదప్రయోగము శైలి

ఆచార్యులవారి శైలి, సహజ మధురము, సులభ సుందరము నైనది. అరంటి పండొలిచి చేతికి నిచ్చిన రీతి, ఆబాలగోపాలము చదువుకొని యానందింపదగిన ప్రసాదరచనగలది. వారి పదప్రయోగ నైపుణ్యము కొనియాడదగినదే–శిపారసు–అపురూపము మున్నగునవి. వ్యావహారికములై రసస్ఫూర్తి గల్గించుచున్నవి.

ఆచార్యులవారు (1–17) లంకాశబ్దమును లంకయని ప్రయోగించినారు. ఇట్లే–జానకీశబ్దము. జానకియని వసుంధరాశబ్దము, వసుంధరయని ప్రయోగించిరి. ఇందులకు అర్థోజ్ఞాపికలో నిట్లు సమర్థనము వ్రాసినారు. కాశిదాసు–రేవతి పుత్రుడు కాశికురుక్షేత్ర గయాప్రయాగములు, అజక్షీరము, అనురీతి ప్రయోగములుగ నిరూపించిరి. లంకశబ్దమునకు గూడనిట్టి యుదాహరణము గలదు. కట్టావరదరాజు (క్రీ.శ. 1650) తన ద్విపద రామాయణమున 'లంక'యని వాడి యున్నాడు. ఈ ప్రయోగములు, పూర్వకవిసమ్మతములే.

దర్శనాశ్వాసమున–ప. 359 లో–

లోకాశ్రితుండు ముల్లోకనుతుడు. అని ప్రయోగముగలదు. ఇది బాల వ్యాకరణము ప్రకారము సాధ్యముగాదు. చిన్నయసూరికి ముందు క్రీ.శ. 1430 ప్రాంతములో అనంతుడిట్టి సమాసములను నిషేధించినాడు (3–50)

అనగా ముల్లోకములు అనిమాత్రమే సమాసముండును కాని ముల్లోకనుతుడు అను సమాసముండదు. కాని అనంతునికిముందే, శివకవులలో ప్రథమగణ్యుడైన పాల్కురికి సోమనాథుడు బసవపురాణమున నీపదమునే ప్రయోగించినాడు.

ద్వి. మొన్న బల్కించిన ముల్లోకనుతుడు

బస. 2 ఆ. 90 పంక్తి.

ఇట్లే, ముల్లోక విభుండు, ముల్లోక వంద్యుడు మొదలగు సమాసములు శివకవులలో ప్రయుక్తములైనవి కావున ఆచార్యులవారి ప్రయోగము సరియైనది పూర్వకవి ప్రయోగానుసారముగ నున్నది. ఇట్టి పదప్రయోగవైచిత్రియే గాక సూక్తులు నిందుగలవు.

పరకామినులఁ జూడరాదు 2_152
వినాశకాలే విపరీతబుద్ధి 2_154
స్వీయకృతకర్మఁ బట్టియే సిద్ధిగలుగు 2_159
తేఁకునతోడ బూనిన కర్మలఁ బొందనౌసిద్ధి 2_160
కార్యసిద్ధికి యత్నింపఁ గడగవలయు 2_193
ప్రార్థింపఁగలుగు నపుడె యత్నకార్యంబులందు
జయంబుగలుగు 2_210
దురతిక్రమణమంబగు కాలమేరికిన్ 3_43
కర్మఫలమా యను ఋక్తికి రాఁతప్పునే 9_200

ఇట్టి సూక్తులతో సుందర రచనతో కాండమంతయు భక్తిరస సుందరమై యున్నది.

కావ్యాంతమున నాచార్యులవారు తమకు యుద్ధకాండ వ్రాయుశక్తిని ప్రసాదింపుమని శ్రీరాముని ప్రార్థించుచు నిట్లు విన్నవించినారు

ఆయువొసంగి రామకథయంతయుఁ బూర్తిగ వ్రాయఁజేయఁడే
ప్రేయసిఁ గూడి రాజ్యరమఁ బ్రీతి వహించెడి యుద్ధకాండమా
ప్యాయయుతోడ వ్రాయఁగల పాటవముంగృపసేయు, వాఁడెరా
మాయనమో' యటంచు సతమాత్మదలంచెడివాని కండయై. 5_154

శ్రీరామానుగ్రహమున. వారి యిష్టదేవత బాలా "త్రిపురసుందరి కవితను దిద్దితీర్పగా." ఆచార్యులవారు. యుద్ధకాండమును వ్రాసి గోవింద రామాయణమును సంపూర్ణముగా నాంధ్రసాహిత్య ప్రపంచమున కర్పించి కృతార్థులగుదురు గాత.

2_2_1137/5
లక్ష్మీకాంత నిలయము
న్యూ నల్లకుంట, (స్వతంత్ర నగరము)
హైదరాబాదు_44
30_5_1971

నిడుదవోలు వెంకటరావు.

———

# పీఠిక

ఆచార్య
డాక్టరు శ్రీ పాటిబండ మాధవశర్మగారు
ఎమ్. ఎ. పి. హెచ్. డి
ఆంధ్ర శాఖ: ఉస్మానియా విశ్వవిద్యాలయము

"చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరం
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనం"

శ్రీరామచంద్రుని చరిత్ర పరమపవిత్రమైనది. అది సహృదయులకు సుందరమైనది శరణాగతులకు శివమైనది. శ్రద్ధధానులకు సత్యమైనది. శతకోటి శ్లోకపరిమితమైన రఘునాథుని చరితమును ఒక్కొక్క యక్షరము నుచ్చారణ మాత్రమున మహాపాతకములను సైతము నాశము చేయగలిగి యుండును. ప్రపంచమున శ్రీరామునికథవలె విశ్వజనీనమైనది వేరొండు లేదు. భారతదేశమందే కాక సర్వప్రపంచమునందును శ్రీరాముని కథను అంతో ఇంతో అభివర్ణింపని భాష లేదందురు. భారతీయ భాష లన్నింటను రామకథ యనంత రూపముల నవతరించి పఠితులను శ్రోతలను తరింపజేయుచున్నది.

సంస్కృత భాషయం దవతరించిన తొలి రామాయణ కావ్యము, ఆదికవి వాల్మీకి కృతము. అది గాయత్రీ మంత్రాక్షర సంఖ్యను బురస్కరించుకొని ఇరువది నాలుగువేల శ్లోకములలో రచింపబడి యున్నది. వర్తమాన వైవస్వత మన్వంతరమున వాల్మీకి రామాయణము తొలి రామాయణము. దీని ననుసరించి పుట్టిన రామాయణములు సంస్కృత భాషయందే లెక్కలేనన్ని కలవు. ఇప్పుడు మనకు లభ్యమగుచున్న వాల్మీకి రామాయణ మాదిరామాయణము కాదట. తత్కర్తయైన వాల్మీకియు ఆదివాల్మీకి కాదట. యోగవాసిష్ఠమున ఇప్పటి రామాయణము వాల్మీకి యను జీవునిచే పండ్రెండవ పర్యాయము రచింపబడిన రామాయణమని చెప్పబడినది ఇప్పటి వ్యాసభారతముకూడ వ్యాసనామక జీవునిచే ఏడవసారి రచింపబడినదట.

ఈ విధముగా మన్వంతర యుగాంతములందు ప్రవర్తిల్లిన శ్రీరామ చరితము మఖాంశము లంధేకరూపమే యయ్యు సూక్ష్మవివరములందించించుక భేదిల్లియుండునట. ఈ సర్వయుగ రామాయణములను మూలభూతమైన యొక మహారామాయణమునుండి యవతరించిన యంశములట. ఆ మూలరామాయణము శతకోటి శ్లోకపరిమితము. ఆదివాల్మీకి రూపము ధరించి బ్రహ్మ నిర్మించెను.

''వాల్మీకి రభవద్బ్రహ్మా వాణీవాక్త స్వరూపిణీ
చకార రామచరితం శతకోటి ప్రవిస్తరం''

అని స్కాందము చెప్పుచున్నది శతకోటి ప్రవిస్తరమైన బృహద్రామాయణము బ్రహ్మ విష్ణు మహేశ్వరుల లోకములందు మాత్రమే ఉన్నదని బ్రహ్మాండ పురాణమున శివుపలుకు—

"శతకోటి సువిస్తీర్ణ మేతద్రామాయణంమహత్
మల్లోకే విష్ణులోకేచ సత్యలోకే పరంతప''

ఈ బృహద్రామాయణమే ఆయా లోకములందలి జీవుల యాయుః పరిమాణమునకు అనువగు తీరున సంక్షేపింపబడి ప్రకటింపబడి యున్నట్లును బ్రహ్మాండ పురాణము చెప్పుచున్నది.

| | |
|---|---|
| ధ్రువలోకమున | 50 కోట్ల శ్లోకములు |
| గోలోకమున | 10 కోట్ల శ్లోకములు |
| ఇంద్రలోకమున | 1 కోటి శ్లోకములు |
| భూలోకమున | 24 వేల శ్లోకములు |

మహాపాతకనాశన సమర్థములయిన యక్షరములుగల శతకోటి ప్రవిస్తర రామాయణమును పఠించి తరించుటకు మర్త్యలోకవాసుల యాయుఃపరిమితి చాలదు గనుక బ్రహ్మదేవుడు వాల్మీకిగా అవతరించి భూలోకవాసులైన సర్వవర్ణములవారికిని తాపత్రయవిమోచనము కలిగించు తలంపుతో చతుర్వింశతి శ్లోక పరిమితమగు రామాయణమును రచించెను. శ్రీమన్నారాయణుడు శ్రీరామచంద్రుడుగా అవతరించిన యనంతరమే వాల్మీకి శ్రీమద్రామాయణమహాకావ్యము రచించెను. నేటి వాల్మీకి రామాయణము శ్రీరామావతారమునకు పూర్వమే యుగాంతర రామ కథాను సారము వాల్మీకి రచించినది కాదు. పరాశరోప పురాణ మిట్లనుచున్నది.

"వేదవేద్యేపరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేత సాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"

వేదవేద్యుడైన పరమపురుషుడు శ్రీమన్నారాయణుడు ఆయన దశరథాత్మజుడైన శ్రీరామచంద్రుడుగా అవతరించినంత వేదమే వాల్మీకి ముఖమున శ్రీమద్రామయణముగా అవతరించెను. భారతము పంచమ వేదమందురు. కాని రామాయణము సాక్షాద్వేదమే ఐనను స్త్రీ శూద్ర బాలాదులు సైతము చదివి విని యానందింపదగినది.

శతకోటి రామాయణ సారభూతమైన వాల్మీకి రామాయణము కూడ మహాపాతక నాశనమే యనవలెను. కావ్య మాత్రమునకు "శివేతరక్షతి" ప్రయోజనముగా ఆలంకారికులు వక్కాణించి యుండగా, మాయా మానుష విగ్రహుడైన శ్రీరామచంద్రుని కల్యాణ గుణములను కీర్తించు సాక్షాద్వేదమైన రామాయణము మహాపాతక నాశనమనుటలో ఆశ్చర్యము లేదు. కనుకనే ఆత్మ సంతరణార్థము, లోక సంతరణార్థము పలువురచే రామకథ వర్ణింపబడినది.

"1 యోగవాసిష్ఠము 2 ఆధ్యాత్మరామాయణము 3 హనుమద్రామాయణము 4 నారద రామాయణము 5 లఘురామాయణము 6 బృహద్రామాయణము 7 అగస్త్య రామాయణము 8 సారరామాయణము 9 దేహరామాయణము 10 వృత్తరామాయణము 11 బ్రహ్మరామాయణము 12 భారద్వాజ రామాయణము 13 శివరామాయణము 14 క్రౌంచీ రామాయణము 15 భరతరామాయణము 16 జైమిని రామాయణము 17 ఆత్మధర్మ రామాయణము 18 శ్వేతకేతు రామాయణము 19 జటాయు రామాయణము. 20 రవిరామాయణము 21 పులస్త్య రామాయణము 22 దేవీ రామాయణము 23 గుహ్యకరామాయణము 24 మంగళ రామాయణము 25 విశ్వామిత్ర రామాయణము 26 సుతీక్ష్ణరామాయణము 27 సుగ్రీవరామాయణము 28 విభీషణ రామాయణము 29 ఆనందరామాయణము మున్నగునవి. ఆనందరామాయణమున పేర్కొనబడి యున్నవి. ఇవికాక కూర్మ మత్స్య పద్మ, స్కాంద, వరాహ, బ్రహ్మాండాది పురాణము లందు, భారతమున చెప్పబడిన రామాయణములు కలవు.

పై పట్టికను బట్టి చూచినచో రామాయణ మందలి ప్రధాన పురుషులందరును రామాయణములు రచించినట్లు తెలియుచున్నది. శ్రీరాముని సర్వదేవ

తాత్మకునిగా భావించి రచింపబడిన రామాయణము లున్నట్లును తెలియుచున్నది. సంస్కృతమునందే రచింపబడిన యీ నానా విధములైన రామాయణముల ప్రభావము వలన దేశభాషలందు రచింపబడిన రామాయణముల పోకడ లెన్ని వింత తెరగుల నుండగలవో ఊహింపవచ్చును.

దేశ భాషలందు రామాయణము పుట్టు నాటికే శ్రీరామచంద్రుడు శ్రీమన్నారాయణుడుగా, పరబ్రహ్మముగా భావింపబడినాడు. పైన పేర్కొనబడిన నానా విధ సంస్కృత రామాయణములను పరిశీలించినచో రామచంద్రుని నరత్వము, నారాయణత్వముగా పరబ్రహ్మత్వముగా పరిణమించిన తెరగు గుర్తింపనగును.

వాల్మీకి "కోన్వస్మిన్ సాంప్రతంలోకే" ఇత్యాదిగా నారదుని అడిగిన ప్రశ్నమున జిజ్ఞాసా విషయము నరుడే. విష్ణ్వాది దేవతలతో తుల్యుడైన నరుడు. "మానుషం రూపమాస్థాయ రావణం జహి సంయుగే" అను బాలకాండ వాక్యము వల్లను. ఎడ నెడ గల మరికొన్ని వాక్యముల వల్లను విష్ణువే. దశరథాత్మజుడైన రాముడుగా నరరూపమున నవతరించినట్లు వ్యక్తమగుచున్నది. అనంతర రామాయణము లందు ఈ యంశమునకు ప్రాధాన్యమువచ్చినది. నరలోకమున ధర్మము ప్రతిష్ఠింపగోరుట వల్లనే విష్ణువు నరరూపము ధరించి నరునివలె చరింపవలసి వచ్చినది.

"నృణాంహి సదృశం రామచరితం వర్ణితం తతః"

శ్రీరామచంద్రుడు కూడ—

"ఆత్మానం మానుషం మన్యేరామందశరథాత్మజం" అని తన్ను మానవునిగానే భావించి చరించెను. కనుకనే వాల్మీకి కృతమైన శ్రీ మద్రామాయణము ఇతిహాసమనబడినది. ఇతిహాసత్వము మరుగున యోగధర్మ మోక్షాది శాస్త్రత్వమునుదాచి, కావ్యత్వముచే మెఱుగుపెట్టి వాల్మీకి శ్రీ మద్రామాయణమును బహ్వార్థ సాధకమైన మహా ప్రబంధముగా రూపొందించెను.

శ్రీరాముడు విష్ణుని యవతారము గనుక వైష్ణవులకు రామాయణము వేదముకంటె ప్రామాణికమైన గ్రంథము. భక్తిమార్గము తుదిమెట్టు శరణాగతి. రామాయణమునందది బహుధా నిరూపింపబడినది. కనుకనే రామాయణమును వైష్ణవులు దీర్ఘశరణాగతి అందురు. నిరంతర రామాయణ పఠన శ్రవణ మననాదుల వల్ల రామభక్తియలవడి శ్రీరామ శ్శరణంమమ అను శరణాగతి వక్యమై

పరమపదము సిద్ధించును. ముక్తిప్రదమగుటచే రామాయణము ఒక మహా మంత్రము అన్న విశ్వాసము ఏర్పడినది. అర్థమైనను కాకున్నను చిత్తశుద్ధితో రామాయణమును పారాయణ మొనర్చినచో సర్వాభీష్టములు సిద్ధించునన్న నమ్మిక కము వ్యాపించి యున్నది. అంత వరకు అక్కరలేదు. 'రామ' అను అక్షరద్వయ ఉచ్చరించిన చాలును సంసార దుఃఖమును తరింపవచ్చును. గనుక రామ నామము తారక నామముగా నెన్నబడినది. దేనియందు యోగులు రమింతురో అది రామము-అనగా పరబ్రహ్మము. నారాయణాష్టాక్షరికిని, శివ పంచాక్షరికిని ప్రాణభూతములైన రా,మ యనునక్షరములు కలిసి రామశబ్దము ఏర్పడినది గనుక రామనామము తారక నామము. శివుడు రామనామజప పరాయణుడైన రామభక్తుడు. శ్రీరాముడు తాను మరల శివభక్తుడు. శివరాములభిన్నులనుట దీని తాత్పర్యము.

శ్రీరాముని చరితము విస్తరిల్లిన కొలందియా శ్రీరాముని తత్త్వమును విస్తరిల్లినది.

"బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ త్వమేవ రఘునందన" అని పాద్మ పురాణము శ్రీరాముని మూర్తి త్రయాత్మకత్వము ప్రతిపాదింపగా ఆధ్యాత్మ రామాయణము "భ్రాతర స్తేత్రయోరామ బ్రహ్మవిష్ణు రహంతథా త్వత్తో నిర్గతాహ్యేతే త్వయ్యేవ విలయంగతాః త్వమేవ పరమంగుహ్యం త్వమేవ పరమంపదం త్వమేవ పరమం బ్రహ్మ త్వమేవ శరణంహినః" అని శివుని ముఖమున శ్రీరామచంద్రుని పరబ్రహ్మ త్వమును వెల్లడించినది. ఈ విధముగా శ్రీరాముని తత్త్వము వివృతమగు చుండగా దానివెంట సీతా తత్త్వమును వివృతము కాజొచ్చినది.

"త్వంవిష్ణుర్జానకీ లక్ష్మీః శివ స్త్వం జానకీ శివా
బ్రహ్మత్వం జానకీ వాణీ సూర్యస్త్వం జానకీ ప్రభా" అని యధ్యాత్మ రామాయణము సీతాతత్త్వమును తెలిపినది. సీతా తత్త్వము, శ్రీరామ తత్త్వము భిన్నములుకావు. పరతత్త్వమునకు రెండు ముఖములు-ఒకముఖము పురుషుడు, రెండవది స్త్రీ.

"రామంత్రిణేత్రం సోమార్ధధారిణం శూలినంపరం
భస్మోద్ధూళిత సర్వాంగం కపర్దిన ముపాస్మహే"

అని రామ రహస్యోపనిషత్తున శ్రీరామచంద్ర ధ్యానము.

"రామాభిరామాం సౌందర్యసీమాం సోమావతంసకాం
పాశాంకుశధనుర్బాణ ధరాం ధ్యాయేత్ త్రిలోచనాం"

అని బృహన్నారదీయమున సీతాధ్యానము. ఈ రెండింటికిని భేదమేమున్నది? సీత శివాభిన్న శ్రీరాముడు శివాభిన్నుడు. సీతారాములభిన్నులు. కనుక దేవీ మంత్ర రహస్యమున-

"శ్రీకృష్ణః శ్యామలాదేవీ శ్రీరామోలలితాంబికా"

అని స్పష్టము చేయబడినది. శ్రీరాముడు పరమాత్మ. పరాశక్తి. రామకథా ప్రపంచమునకిది ఏకవాక్యత.

శ్రీమాన్ గోవిందాచార్యులవారు శ్రీరామ భక్తులు. త్రిపురసుందరీ భక్తులు, శ్రీ విద్యోపాసకులు నగుటకు ఈ పరమతత్త్వావగాహనమే కారణము. నానావిధములైన రామాయణములను, రామాయణ వ్యాఖ్యలను అన్నింటిని గాకున్న కొన్నింటినేని ఆచార్యులవారు పరిశీలించియుందురు. బహుముఖములైన రామాయణ వ్యాఖ్యల తాత్పర్యమును ఆయన జీర్ణించుకొని యుందురు. ఆయన దృష్టిలో శ్రీరాముడు పరమాత్మ. ఆయన రామకథా రచనయందు దీనికి దాపరికములేదు, ఆయన రామాయణము శరణాగత్యుపనిషత్తు.

ఇది సుందరకాండము. దీనిలో సప్తకోటి మహామంత్రములున్నవని ప్రతీతి. బహుశః శతకోటి ప్రవిస్తరమైన మూల రామాయణ మందలి సుందర కాండమునందవి యుండినవి కాబోలు. వైవస్వతమన్వంతర మందలి చతుర్వింశతితమ త్రేతాయుగమున నవతరించిన శ్రీరాముని చరిత్రమును నిబంధించు, ఇప్పటి వాల్మీకి రామాయణ మందలి సుందరకాండము నుండి మంత్రముల నెవ్వరు ఉద్ధరించిన జాడకనబడదు. మూల సుందరకాండ మందలి మంత్రముల శక్తి మాత్రము వర్తమాన సుందర కాండమున నున్నట్లు ఆస్తికులు విశ్వసింతురు.

సుందరమైన కాండము గనుక నిది సుందర కాండము. ఇది ఏల సుందరము? వియుక్తులైన సీతారాములు పునస్సంయుక్తులగుటకు మార్గమేర్పడినది గనుక ఇది సుందరము అనవచ్చును. శ్రీమాన్ ఆచార్యులవారు దీనికి సుందర రాముడు అని పేరుపెట్టిరి శ్రీరాముడు సుందరుడు. సీత త్రిపుర సుందరి.

ఆయిరువురి నడుమ దౌత్యముచేసిన హనుమంతుడు సుందరుడు. ఈ కాండమున ప్రధాన వ్యక్తులైన ముగ్గురును సుందర శబ్దవాచ్యులుగనుక ఇది సుందర కాండ మనదగునని యాచార్యులవారి భావనగా నగపడుచున్నది.

సుందరుడా రఘూద్వహుడు సుందరి భూమిజ, ఆంజనేయుడున్
సుందరు, డాదికావ్యమున సుందర కాండము సుందరంబు, నా
నందకరంబు నిత్యపఠనంబునఁ గామితదాయ కంబుసన్
సుందరి నీవభక్తి గృపజూడుము వ్రాయగ సుందరంబుగన్.

అని యాచార్యులవారు ఈ కాండము ఏల సుందర కాండమయ్యెనో వివ రించి యున్నారు.

"సుందరాకార చేతన సూరివరుడ" అని హనుమను ఆచార్యులవారు సంబోధించిరి. ఆతడు లంకలో త్రిపుర సుందరినిగన బోవుచున్నాడు. సీతను త్రిలోక సుందరి, త్రిపుర సుందరి, సుందరి, లలిత, విమలమున్నగు పదము లతో ఆచార్యులవారు వ్యవహరించి యున్నారు.

సుందర కాండమును యోగ శాస్త్రపరముగా వ్యాఖ్యానించినవారును గలరు. ఆచార్యులవారు అట్టి వ్యాఖ్యానమునకు ప్రాధాన్యమిచ్చుచు ఈ కాండమును రచించిరి.

ఈ కాండమునందైదాశ్వాసములు గలవు. తరణాశ్వాసము, ప్రయత్నా శ్వాసము, దర్శనాశ్వాసము, ఉపదేశాశ్వాసము, ప్రమదాశ్వాసము అనునామ ములు సుందర కాండ కథాంశములను వెల్లడించుటే కాక కుండలినీ యోగాంశ ములను గూడ సూచించుచున్నవి.

"తతోరావణ నీతాయాః సీతాయాః శత్రుకర్శనః
ఇయేష పదమన్వేష్టుం చారణాచరితేపథి"

అన్న సుందర కాండ ప్రారంభ శ్లోకమునందే కుండలినీ యోగ సూచన గలదు. రావణుడు స్థూల సూక్ష్మ కారణము లనబడు త్రివిధ శరీరములందు అభిమానముగల జీవుడు. త్రైలోక్య భోగములు తనయధీనమందున్నవి గనుక తానే సర్వేశ్వరుడననియు, త్రిపుర సుందరియగు సీత తనది కావలెననియు వాని

భావన. పరాశక్తి పరమేశ్వరుని యర్ధాంగి. ఆమెయన్యుని చెన్నడును కొజాలదు. రావణుడామెను అపహరించి లంకలో బంధించెను. లంకయే మూలాధార చక్రము. అచ్చట బంధింపబడి శోకించుచున్న కుండలినీ శక్తిని ఉత్థాపనచేసి సహస్రారమునకు గొనిపోయి పరమాత్మతో సంయోగపరచు యోగి హనుమ. అతడు శత్రుకర్శనుడు. జితేంద్రియుడైన బ్రహ్మచారి, మహాయోగి. హనుమ శివానుచరుడైననంది. హనుమను చూచి "కిమేష భగవాన్ నందీ" అని రావణుడు గుర్తించెను.

రావణుడు శివభక్తుడు. పరాశక్తిని సంపాదించుటే వాని భక్తికి పరమ లక్ష్యము. శివుడు వాని భక్తికి మెచ్చి పార్వతిని వానికిచ్చెను. కాని ఆమె వాని కేల దక్కును? ఇప్పుడా పరమేశ్వరుడు శ్రీరాముడు, ఆపరాశక్తియే సీత, ఆనందీశ్వరుడే హనుమ. శివశక్తుల తత్వమెఱింగిన యోగీశ్వరుడు.

శ్రీమాన్ ఆచార్యులవారు కావ్యారంభమునందే.

"శ్రీరమ గనయోగంబున
గూరుకురాకుండ నూర్ధ్వకుండలిఁ జేంన్
తీరుగనణి మాదులుచే
కూరవె సకలార్థ సిద్ధిజెలఁగఁగ రామా"

అని పరమాత్మమైన శ్రీరాముని స్తుతించి సుందర కాండమునందలి కథాంశమును సూచించుటే కాక అది కుండలినీ యోగమనియు వ్యక్తము చేసిరి.

"కుండలిని పరాశక్తిని గూడనున్న
యోగిచంద్రాన మారుతి యొప్పెనపుడు
లంకయను కుండలికిఁ జేరి లలితశక్తి
సీత గనమండెనా; యనవెలఁగుమండె"

ఆమూలకమైన యీవర్ణిత వాల్మీకి రామాయణమునకు వ్యాఖ్యానము— హృదయావిష్కరణము. లంకయందున్న సీత ఊర్ధ్వకుండలిని. హనుమ సుషుమ్నా మార్గమున ఎక్కిడదిశకుబోయి షట్చక్ర మార్గమున పరాశక్తినిగొని వచ్చి సహస్రారమందున పరమాత్మను చేర్చవలెను. తరణాశ్వాసమందలి

పెక్కు పద్యములందు ఆచార్యులవారి యోగలక్షణములను వెల్లడించుచు హను మంతుని మాత్రమభివర్ణించిరి.

యోగసిద్ధికి పురుషప్రయత్నముతోపాటు ఈశ్వర కృపయు అవసరము. ప్రయత్నాశ్వాస ప్రారంభమున ఆచార్యుల వారు.

"శ్రీ కరనిను గనదలచెడి
ప్రాకట విజ్ఞానియోర్పు వహియించుచు నా
లోకన మొనరింపవలయు
నీకు కృపజనించుదాక నిర్మల భక్తిన్"

అని యీయంశమును సూచించినారు. ఆశ్వాసాంతమున.

"శ్రీయుతుపైఁదా భారము
వేయుటకు న్ముందు కర్మస్వీయ కృషిందా
జేయఁగవలె పురుషుడురా
మాయ నమోయను తలంపు మానకభక్తిన్.

హనుమయిట్లే రామునిపై భారమువైచి కృషిచేసి ప్రయత్నసిద్ధి పొం దెను. విఘ్నములన్నియు తరించి లంకను ప్రవేశించెను.

"నైజశత్రువులను గెల్చి రాజయోగి
లంకలో రాజవీధుల జంకులేక
తిరిగి ముత్యాలతోరణాల్ తేజుతోడ
రథ్యలనుగాంచి విస్మయరాశియయ్యె.

అని యాచార్యులవారు రాజయోగియైన హనుమ మూలాధార చక్రమైన లంక పరాశక్తి సన్నిధానమువల్ల ఆశ్చర్యకర వైభవముతో వెలుగుచున్నట్లు వర్ణించినారు. హనుమకు 'అణిమాదులు సిద్ధించినవి. కాని రావణునివలె అవియే యోగమునకు పరమలక్ష్యములని భావించు అజ్ఞానికాడు హనుమ లంకలో.

"అందపునారుల అందెలు గజ్జెల్
సందడి సల్పుచు జక్కఁగ త్రోవన్

వింటోన గూర్చుచు వేచనువారిన్
సుందరుడెల్లెడఁ జూచుచునుండెన్."

యోగమార్గమునందిది యొకదశ. ఈ భోగములందు చిత్తము లగ్నము చేసిన యోగిభ్రష్టుడగును. హనుమ వీనిని ఆశ్చర్యముతో చూచెనే కాని యందు రావణునివలె ఆసక్తుడు కాలేదు ఈ పద్యమున సుందరుడనగా హనుమ. లంక యందు సీత నన్వేషించుచు హనుమ కాంచిన వైభవమంతయు రావణుడు యోగశక్తిచే సాధించినదే. రావణుని కదియే పరమార్థము. హనుమకది యధమము.

రావణాంతఃపురమున వెదకుచున్న హనుమకు మందోదరియగపడెను. "సీతయను బుద్ధిజనింపగజేయు దాని మందోదరి సుందరాంగినిగనుంగపి వర్యుడు" మందోదరి యింద్రియ భోగములకు ప్రతీక. అతీంద్రియ భోగము వలెనగపడి భ్రమకొల్పునది యోగాభ్యాస దశయందుయోగికి కొన్ని భోగములు సిద్ధించి అదియే యోగచరమ సిద్ధియని భ్రమకొల్పును. హనుమకీస్థితి తటస్థించెను గాని అతడాభ్రమకు లోబడలేదు.

"యోగియణిమాదిసిద్ధుల యోగసిద్ధి
యనుచు భ్రమసెందు రీతిగా హనుమ గూడ
కనుచు మందోదరిని సీతగాగ దలచి
యంతలో భ్రమదొలగి సత్యంబు నెంచె."

ఇదియమూలకము. సుందరకాండ తత్త్వము నావిష్కరించు తలంపున ఆచార్యులవారు స్వయముగా చేసినవి.

దశమాశ్వాసము అన్నింటికంటె పెద్దది. ఇందు హనుమంతుడు సీతను దర్శించును. రావణుడును సీతను దర్శించును. హనుమకు ఆమె తల్లి. రావణునకు భోగస్త్రీ. హనుమ సీతను గుర్తించుట స్వభావ సుందరముగా ఆచార్యుల వారు తీర్చినారు. రావణుడు సీతతో చేసిన సంభాషణము మూలార్థములను ప్రకాశింపజేయు రమణీయ వ్యాఖ్యానము.

తెలుగునందిప్పటికే పెక్కు రామాయణములు వెలసియున్నవి. ఐనను గోవిందాచార్యుల వారి రామాయణమునకు అవసరము ఉండనేయున్నది. భక్తి

యుక్తమైన యోగముయొక్క ప్రాధాన్యమును నిరూపించుచు రామాయణము యొక్క శరణాగతిత్వ లక్షణము సువ్యక్తమగుతీరున రామాయణము నితః పూర్వము ఎవ్వరును చెప్పలేదు. ఆచార్యులవారా పనిచేసిరి ఈసుందరకాండము హనుమంతుని శరణాగతియని యెఱుగడుగునను వ్యక్తమగుచున్నది

"శ్రీరామశ్శరణం" అని హనుమ యబ్ధిలంఘనమునకు బూనెను. నడుమ నడుమ పెక్కు పర్యాయములు శ్రీరాముని శరణువేడి విఘ్నములు తరించి సీతను దర్శించి తిరిగివచ్చెను.

'మా నిభుండ, చేతనుడ నీకృప లభింపజేయఁ జాలనట్టిపని యేదియుం డునో యవనినాథ' అని శ్రీరామ పాదములను జేరినాడు.

ఆచార్యులవారు పోతన, త్యాగయ్య, రామదాసుల కోవలోనివారు. రామాయణమును మహాకావ్యముగా సంతరించి కవియశస్సునార్జింపదలచినవారు కారు. రాముడు తారకరాముడు. రామాయణము మహామంత్రము ఆచార్యులవారు రామ భక్తులు ఈ రామాయణ రచనవారి శరణాగతి. రామకథ వ్రాసి తానుతరించి లోకులను తరింపజేయుటయే ఈ రామాయణ రచనా పరమార్థము.

ఆచార్యులవారు దీర్ఘరోగి. దీర్ఘశరణాగతియైన శ్రీమద్రామాయణమే ఆరోగమునకు దివ్యౌషధము. అది పనిచేసినది. ఆయన జీవితలక్ష్యమైన రామ కథా రచనము పూర్తియైనది

"నాకనారోగ్యముం బాపి సాకుమీవ
నీకు పట్టాభిషేకంబునే నొనర్ప
సీతకవగూడి పట్టాభిషిక్తు రాము
కనులవిందుగనను జూడగలుగనిమ్ము"

అన్న ఆచార్యులవారి మొర శ్రీరాము నాలకించెను. ఆయన కారోగ్యము, ఆయువు ప్రసాదించి తనకథ పూర్తిచేయించుకొనెను. ఆచార్యులవారు ధన్య జీవులైనారు.

"యోగులరాజయోగ హఠయోగము లెంచ గృహస్థ ధర్మముం ద్యాగమొనర్పకుండఁ బరమాత్మను జేర్చవు, సన్యసించియే యోగవిధానమూనవలె, నొప్పునె లోకుల కాచరింపగా సాగునె? భక్తియోగమున సర్వజనంబు దరింపవీలగున్"

ఆచార్యులవారు గృహస్థాశ్రమ మందుండియు సర్వకర్మలను, బంధములను శ్రీరామార్పణముగా సన్యసించినవారు. కనుకనే వారి భక్తియోగము ఫలించినది. కోరుటనే తడవుగా ముక్తికాంత వారిని వరింప సిద్ధముగా నున్నది.

శ్రీమద్రామాయణ రచనము వారి యోగమునందొక భాగము. జరాభార రుజాభారములెన్ని యవరోధములు కల్పించినను లలితాంబికారూపుడైన శ్రీరాముని లీలా కృపచే వానిని తరించి ఆచార్యులవారు పరాశక్తియైన సీతను పరమాత్మయైన శ్రీరామునితో కలిపి పట్టాభిషేక మొనర్చి సాహిత్యయోగ సిద్ధులైనారు.

శ్రీరామ శరణాగతులైన రామాయణ వ్యక్తులందరి యందును ఆచార్యుల వారు ఆత్మచిత్రణముగావించు కొన్నారు.

ఆశ్వాసాంత పద్యములందు ఆత్మీయభక్తి భావమును సుధాస్రవంతిగా వెల్లి విరియించినారు. రామకథా జ్ఞానమాత్రమునకు ఏరామాయణమునైన చదువ వచ్చును. శ్రీరామతత్వావగాహనమునకు గోవిందరామాయణము చదివి తీర వలయును. శ్రీరామలీలా కృపాలబ్ధికి గోవిందరామాయణ మందలి యాశ్వాసాంత పద్యములు చదువుట అత్యంత సులభమార్గము. ఆ పద్యములెంత మహిమాన్వితములో ఆచార్యులవారి జీవితమే నిరూపించుచున్నది. వాల్మీకి రామాయణమునకు, సుందరకాండమునకుగల మంత్రశక్తి గోవిందరామాయణమునకు కలదో లేదో కాని ఆచార్యులవారి ఆశ్వాసాంత పద్యములకు మాత్రము అద్భుతమైన శక్తియున్నది.

ఈరామాయణ రచనమున ఆచార్యులవారు నిమిత్తమాత్రులు. చోదనా శక్తి శ్రీరాముడు, క్రియాశక్తి శ్రీలలితాంబిక, అయత్నసిద్ధమైన యీసర్గ సుందరశైలి దేవీప్రసాదమే కాని యన్యము కాదు.

"తేలికమాటల మృదువగు
శైలిని మధురార్థయుక్తి సకలులు మెచ్చం
బాలించుచునా కలమును
జాలా! రచియింపఁ జేయఁ బ్రార్థింతు నినున్"

అని బాలా శరణాగతులై ఆచార్యులవారు రామాయణము రచించినారు. దీనిని శ్రీరామార్పణము గావించినారు. ఇది కర్మ సన్యాసయోగము. ముక్తి ప్రదమైన ఉత్తమయోగము.

జరా రుజాభార పీడితులయిన ఆచార్యుల వారికి సుందర యుద్ధకాండము లను వ్రాసి ముగించుటయే గగనమైనది. ముద్రణకు అనువగుతీరున ప్రతులను సిద్ధముచేయుటకు, ముద్రణము చేయించుటకు వారు ఇతరులపై ఆధారపడక తప్పలేదు. ఫలితముగా ముద్రిత గ్రంథము సాఖలిత్యబహుళముకాక తప్పలేదు. సర్వకల్మష హరమైన శ్రీరామచంద్రుని పావన చరిత్రమున నీ సాఖలిత్యము కరిగిపోవునని యాశింతముగాక.

ఈ కాండమునగల 1466 పద్యములలో ఆచార్యులవారు వివిధములయిన వృత్తములను వాడియున్నారు. వాల్మీకి రామాయణమువలె దీనిని నిర్గద్యముగా రచించుట ఆచార్యులవారి సంకల్పము కాబోలు. పేర్కొనదగిన తెలుగు రామా యణములలో ఇదియే నిర్గద్యమనవచ్చును. ద్విపదలు ధారాళముగా వాడబడినవి. ద్విపదరచనలో ఆచార్యులవారు ప్రాసయతి వాడుట విశేషము. లంకలో సీతను దర్శించివచ్చి తన యనుభవములను హనుమంతుడు శ్రీరామచంద్రునకు నివే దించు సందర్భమున ఆచార్యులవారు దండకము నుపయోగించినారు. సుందర కాండ సారమంతయు ఈదండకములో వర్ణింపబడినది సామాన్యులీసంక్షిప్త దండక సుందరకాండమును పఠించి తరింపవచ్చును.

1940 ప్రాంతములందే ఆచార్యులవారు ఉత్తర కాండమును రచించి ప్రకటించి యుండిరి. వీరి రామాయణరచనము ఉత్తర కాండముతోడనే ప్రారంభమైన రామకథా రచనమును శ్రీ సీతారాముల పట్టాభిషేకముతో మంగ ళాంతముగా ముగించుట ఆచార్యులవారి సంకల్పము కాబోలు. ఇది విచిత్రమైన సత్సంకల్పము. ఆచార్యులవారు కావ్యమును ఆశ్వాసములుగా విభజించి వానికి నామకరణము చేయుట యందును అపూర్వత ప్రదర్శించినారు. ఆనందరామా యణమునందలి కాండములకు, రాజ్యకాండ, మనోహరకాండ, యాత్రాకాండ, పూర్ణకాండ ఇత్యాదిగా క్రొత్త పేరులు పెట్టబడినవి. ఆచార్యుల వారును ఇతర కాండములందువలె ఈ సుందరకాండమునందును ఆశ్వాసములకు కథాక్రమ

---

సాఖలిత్యములు తప్పుఒప్పుల పట్టికలో సవరింపబడినవి.

పరిణామ సూచకములుగా తరణాశ్వాసము, ప్రయత్నాశ్వాసము, దర్శనాశ్వాసము. ఉపదేశాశ్వాసము, ప్రమదాశ్వాసము అని నామకరణముచేసిరి. ఈనామకరణము యోగశాస్త్రదృష్టిచే కూడ సమంజసముగా నున్నది.

శ్రీమాన్ గోవిందాచార్యుల వారికి నాపట్ల అవ్యాజమైన ప్రేమకలదు. ఈసుందరకాండమునకు పీఠిక వ్రాయుమని వారు నన్నాదేశించుటకు ఆప్రేమయే కారణము. ఈపీఠిక వ్రాయుటకు నాకెట్టి యధికారమును లేదు. ఆచార్యులవారి పట్ల నాకుగల యపారమైన గౌరవమువల్ల వారి యాదేశమును దిరస్కరించు శక్తి లేక యీనాల్గు వాక్యములు వ్రాయుటకు బూనుకొంటిని. చిత్త సమాధిలేని సమయమున నీపని చేయవలసి వచ్చినది. ఏమి వ్రాసినను నది శ్రీమదాచార్యుల వారి శ్రీరామ కైంకర్యమున కొక యుపాంగము కాగలదు గదా. ఈ సదవ కాశమును నాకు కల్పించిన ఆచార్యులవారికి కృతజ్ఞత నివేదింతును.

మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్.
వేదవేదాంత వేద్యాయ మేఘశ్యామల మూర్తయే
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్.

ఇతిశివమ్

# మనవి

దరరాముఁడను నీ కావ్యము (సుందరకాండము) సాధారణ సంవ
నవమి (శ్రీరామనవమి) నాటికే అచ్చుకావలసియున్నది. విరోధి
శ్రీరామనవమి గూడ దాటు వఱకు ముద్రింపఁ జాలనైతిని. నా
యిందులకు మూలకారణము.

## ధన్యవాదములు

డాక్టరు శ్రీ బెండపూడి పేరరాజుగారు.
ఎమ్. బి. బి: యస్. విశాఖపట్టణము.

ప్రసిద్ధ వైద్యనిపుణులు. వీరు నిరంతరము సుందరకాండ
నరించువారు. సాహిత్య పోషకులు, కవి పండితాభిమానులు,
కు గడచిన నలుబది ఏండ్లనుండియు పరమ మిత్రులు, మా
భిలాషులు. శ్రీ సీతారామాంజనేయ భక్తులు, శ్రీ సీతా రామాంజ
ముగ నీ సుందరకాండము నచ్చువేయించిరి. వీరికి నా ధన్య
నుమత్ సమేత, శ్రీ సీతా రామచంద్రుడు వీరికి, ఆయురారోగ్య
సాదించుగాత.

## వైద్యులు

రు శ్రీ కస్తూరి నారాయణమూర్తిగారు. ఎం. డి.

రుగ్మతతో దీని వ్రాయునపుడును, గత 50 వత్సరములనుండియు
శ్రేయోభిలాషులును నగు డాక్టరు కస్తూరి నారాయణమూర్తిగారు
సహాయ మొసంగిరి. జీవిత పర్యంతము వీరి సహాయమునకే
జ్ఞుడను.

వైద్యరత్న శ్రీ రంగం సుబ్బారావుగారు, సికిందరాబాదు.

రమౌషధ మొసంగుచు గత 10 వత్సరముల నుండియు కంటికి
గాపాడుచుండిన- ఆయుర్వేద వైద్యరత్న శ్రీ శ్రీ రంగం

సుబ్బారావుగారి తోడ్పాటు నిత్య స్మరణీయము. ఈ పరమ మిత్రుని, అవ్యాజ ప్రేమకు నా ధన్యవాదములు. కృతజ్ఞుడను.

కృతజ్ఞత :–

ఎడతెగని పనితొందరలో తీరిక జేసికొని, డాక్టరు శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు దయతో తొలిపలుకు వ్రాసిరి. వృద్ధులయ్యును శ్రమయనక, సమీక్షను శ్రీ నిడదవోలు వేంకటరావుగారు వ్రాసిరి. తీరనిపని తొందరలో, ఎట్లో తీరిక జేసికొని డాక్టరు శ్రీ పాటిబండ మాధవశర్మగారు పీఠిక వ్రాసిరి. ఈ మిత్రులు ముువ్వురకును నేనెంతయుఁ గృతజ్ఞుడను.

కావ్య స్వరూపము :–

ఇది వాల్మీకము ననుసరించియే వ్రాయబడినది. వాల్మీకి సుందరకాండమునకు తర్జుమా మాత్రము కాదు. ఇతర రామాయణములనుండి కొలదిగ మాత్రమే గ్రహింపఁబడినది.

పాఠక మహాశయులకు :–

ఇందు స్ఖాలిత్యములు కొన్ని గలవు. అవి తప్పు, ఒప్పుల పట్టికలో సవరింపబడినవి. ఈ స్ఖాలిత్యములు, అర్థ, భావ, రస గ్రహణములకు ప్రతిబంధకములు గావు ముద్రణ కాలమున, నా అనారోగ్యమే యీ స్ఖాలిత్యములకు కారణము

కొన్ని ప్రయోగములు :–

(1) ఇందు 'ముల్లోక నుతుడు' అను ప్రయోగము కలదు

(2) ద్విపదలలో ప్రాసయతియు వాడబడినది.

"ముల్లోకనుతుఁడు" అను ప్రయోగము, పాల్కురికి సోమనాథుఁడు గావించినాడు. ఈతని కాలము 1295–1323. తదుపరి శివకవు లిట్టి ప్రయోగముల నెన్నియో గావించినారు. ఈ ప్రయోగములను తదుపరి వ్యాకరణ కర్తలు దోషములనిరి.

వ్యాకరణము–ప్రయోగ శరణ్యము కదా! తదుపరి శతాబ్దములవారు 13 వ శతాబ్దపు, సోమనాథుని ప్రయోగము. దోషమనినను,

పూర్వకవి ప్రయోగములే గ్రాహ్యములని, నేను, వాని ననుసరించితిని. ఇట్లే ద్విపదలకు,, ప్రాస యతిని గూడ విచ్చల విడిగ సోమనాధుడుపయోగించినాడు. ఈ సాంప్రదాయము 1430 ప్రాంతము వఱకు వచ్చినది. నేనీ మరుగు పడిన పూర్వకవి సాంప్రదాయమును పునరుద్ధరింపఁదలచి ద్విపదలలో. ప్రాస యతిని గూడ వాడినాను. దీనిని. పండితులు గ్రహింతురుగాక.

తుదిమాట :-

మ. హరినామస్తుతిఁజేయుకావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజితమైనమానససరస్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతిలేనికావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమైయుండదయోగ్యదుర్మలినవత్కాకోలగర్తాకృతిన్.

మ. అపశబ్దంబులఁగూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా
పపరిత్యాగముసేయు గావునహరిన్ భావించుచున్ బాడుచున్
జపమున్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబుగీర్తించుచున్
దపసుల్ సాధులుధన్యులౌదురుగదా తత్త్వజ్ఞచింతింపుమా.

మకాం 6-1-911/4
శ్రీ సీతారామ నిలయం
ఖయిరతాబాదు పోష్టు
హైదరాబాదు-4

ఇట్లు
భక్తభక్తుఁడు
ఆత్మకూరి గోవిందాచార్యులు
1971-జూలై.



## తప్పు—ఒప్పుల పట్టిక

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 6 | 18 | 1 | తే గీ. | ఆ వె. | 56 | 36 | 1 | తే.గీ. | ఆ.వె |
| 9 | 43 | 1చివర | బలే | బల్ | 66 | 98 | 2 | లేకయే | లేకయె |
| 13 | 71 | 2 | దైత్యనాధుడు | దైత్యనాథుండు | 77 | 165 | 3 | బతివ్రతసుబాముల | బతివ్రతనెయావ్యధ |
| 23 | 23 | 1 | నీకోటలోన | దిస్నగఁగోట | 80 | 181 | 4 | (నాలుగవపంక్తికి బదులుగ) | గతిఁగనవేలసీతరా సుఖంబునకైయసు రేళుభార్యవై |
| 30 | 66 | 1 | గ్రాలు | నలదు | 80 | 181 | 3 | విజయుడు | విజయుండు |
| 31 | 70 | 3 | బరిపూ | బరిఖా | 83 | 200 | 6 | నేమి | నేమాయె |
| 33 | 83 | 8చివర | గాంచుచున్ | గాంచుచునున్ | 87 | 225 | 1 | మపుడెత్రాగి | మిపుడెత్రాగి |
| 37 | 109 | 4 | గదిని | గది | 93 | 276 | 1 | లనము | లనఘు |
| 38 | 113 | 8(2) | సంపుల్లలతవంటి | సంపుల్లలతలను | 103 | 353 | 2 | దలఁచు | దలంచు |
| 40 | 135 | 3 | సుందరాంగిఁని | సుందరాంగిని | 103 | 356 | 4 | గనునేమో | గనునోగద |
| 42 | 153 | 2 | కానసుసీత | కానసీత | 104 | 358 | 3 | తోడనె | తోనె |
| 51 | 1 | 2 | చిత్తమునందే | దార్మికయంచే | | | | | |
| 53 | 23 | 3 | నరహ | నర్హా | | | | | |

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 125 | 540 | 4 | హరి చిన | హరించిన | 171 | 183 | 2 | పచ్చితిని | వచ్చితి |
| 127 | 557 | 1 | దలఁయచున్ | దలఁచుచున్ | 172 | 187 | 1 | జామతరాంగిని | రాంగిఁ |
| 129 | 570 | 1 | తే.గీ. | ఆ.వె. | 174 | 200 | 4 | భుక్తి | భుక్తికి |
| 132 | 587 | 1 | వేసుమా | వెసుమా | 182 | 259 | 2 | నశయంప | నశియింప |
| 141 | 655 | 2 | బూనియ | బూనియంతన | 192 | 2 | 1 | అరఘురాము | శ్రీరఘురాము |
| 144 | 3 | 3 | జయియింపదైత్య | విజయంబుఁగాంచ | 206 | 65 | 1 | గొట్టధాత్రి | గొట్ట |
| 145 | 3 | 4 | సంగ్రహించిన | సంగ్రహించి | 208 | 80 | 3 | వనిం | వనిన్ |
| 147 | 21 | 3 | చందంబు | తత్వంబు | 208 | 80 | 4 | జేరరు | నీచులె |
| 147 | 25 | 3 | పఁపగావచ్చె | వంపవచ్చె | 213 | 115 | 2 | యామెశిరోమణి | యామెమణిని |
| 152 | 54 | 1 | రామలక్షనుండు | రామలక్ష్మణుండు | 220 | 157 | 3 | పట్టాభిషిక్తుగ | పట్టాభిషిక్తు |
| 153 | 566 | 3 | జేరుచు | గేరుచు | 2 | 7 | 2 | బట్టితి | ఁబట్టితి |
| 154 | 154 | 3 | శరము ల | శరముల, పది | 2 | 7 | 4 | జేయు | ఁజేయు |
| 157 | 91 | 2 | లేడు | లేడు | 3 | 1 | 4 | జేలఁగఁగ | ఁజెలఁగఁగ |
| 157 | 95 | 2 | జేయునపకృతియె | గనునపకారమె | 4 | 5 | 1 | గొండంతగా | ఁగొండంతగా |
| 166 | 149 | 2 | వుడురాకా | వుదురాకా | 4 | 7 | 2 | జూతు | ఁజూతు |
| 167 | 167 | 2 | మహాస్త్రయేది | మహాస్త్రమేది | 5 | 16 | 2 | కర్మనుండు | కర్మసుండు |
| 169 | 166 | 3 | చాప | బాప | 6 | 20 | 1 | వంత | వంతఁ |

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 6 | 20 | 3 | బడి | ఁబడి |
| 7 | 25 | 4 | లంక | లంకఁ |
| 7 | 28 | 1 | గూడ | గూడఁ |
| 8 | 30 | 3 | వెడల | వెడలఁ |
| 8 | 38 | 4 | దా | దాఁ |
| 9 | 42 | 2 | గనంబడు | ఁగనంబడు |
| 10 | 47 | 2 | జేవ | ఁజేవ |
| 10 | 52 | 2 | ప్రవిభాస | ప్రతిభాస |
| 10 | 52 | 4 | గొంత | ఁగొంత |
| 11 | 58 | 1 | లాత్మఁజూడెడె | లాత్మజుఁడాడె |
| 11 | 58 | 4 | గావలయు | ఁగావలయు |
| 12 | 63 | 2 | లంకకు | లంకకుఁ |
| 12 | 63 | 3 | నిరాడంబరుడై | నిరాడంబరుఁడై |
| 78 | 169 | 2 | శపించితేని | శపింపనెంచ |
| 11 | 11 | 11 | బూడిదవయ్యెద వీవు | బూడిదగావాకొ |
| 79 | 173 | 4 | బిట్టాడుచున్నావాకొ | చేపట్టలేకుంటివా |

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 91 | 254 | 1 | నింక సేయగల | నింకఁజేయఁగల |
| 94 | 282 | 3 | పరాజయంబుగూడ | పరాజయమునుగూడ |
| 95 | 284 | 2 | బలుక | పలుక |
| 96 | 290 | 3 | గనుపించె | కనిపించె |
| 97 | 302 | 2 | యారాము | ఆరాము |
| 98 | 314 | 2 | ఖరములూన్చి | ఖరములూని |
| 99 | 324 | 1 | తెల్లనివస్త్రధారు నిన్ (పాఠాంతరము) | శ్వేతదుకూలధారునిన్ |
| 101 | 339 | 2 | నురి | యురి |
| 106 | 365 | 1 | చెపుడు-రాఘవు నకు | చెప్పువాడనింక క్షితిసుత సీత |
| 105 | 370 | 1 | రాఘవుని కథా లోలయై | రాఘవకథావిలోలఆ |
| 107 | 389 | 2 | రాక్షసవిభుండు | రాక్షసవిభుండంత |
| 109 | 411 | 1 | నమోస్తుయనుచు | నమోస్తుటంచు |
| 110 | 412 | 4 | శిరస్సు | శిరసు |
| 113 | 445 | 2 | సాంతము | సాంగము |

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 113 | 446 | 1 | తే.గీ. | ఆ.వె. |
| 115 | 459 | సీ. 4 | ముల్లోకనుతుఁడు | పాల్కురికి సోమ నాథుని ప్రయోగము |
| 144 | 3 | 3 | జయియింపదైత్య | విజయింపదైత్య |
| 145 | 9 | 3 | వానరుఁడనగు | వానరునగు |
| 213 | 115 | 2 | శిరోమణి | మణిని |
| 218 | 146 | 1 | జెందరు | కష్టమేఅందరు |
| 220 | 157 | 1 | షికుగ | షికు |
| 19 | 109 | 1 | ‹గాంచినట్టి | రాజిలంగ |
| 55 | 30 | 3-4పాదము లకుబదు లుగనీపాద ములు | రక్కసులనడు మను క్రుక్కు దాని | గాంచియా మెసీత గాగ నెంచు |

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 61 | 67 | 2 | యింతి | పొలతి |
| 61 | 71 | 4 | నందవిహీనలె | నంగవిహీనలె |
| 61 | 72 | 2 | ఎనుబోతుముఖులలో | ఎనుపోతుసరివారి |
| 64 | 86 | 2 | సుందరీయుతి వచ్చు | సుందరులయుతుండు |
| 65 | 96 | 4 | యధీనునన్ను | వ;దీనునన్న |
| 77 | 165 | 3 | బాముల | నీవ్యధ |
| 162 | 124 | 4 | కార్మికి | కార్ముక |
| 61 | 72 | 3 | గజనాసముల | గజనాసికల |

# విషయసూచిక

## ౩. సందర్శనాశ్వాసము

## 4. హితోపదేశాశ్వాసము



## ౫. ప్రమదాశ్వాసము

మంగళమహాశ్రీ

శ్రీ రామాయనమః

శ్రీ బాలా త్రిపుర సుందర్యైనమః,

# శ్రీ గోవింద రామాయణము

## సుందర రాముఁడు

### ఇష్ట దేవతా ప్రార్థనము

శ్రీనిధియై యనాదిచిద చిన్మయదివ్య శుభంకరాంబయై
భానుసహస్రమండల విభాప్రతిభాసితమూర్తిఁ గల్గియున్
జానగు మోమునన్ మధుర శాంతమృదూక్తులఁ బల్కుబాల నా
మానసమందు నిల్చి యభిమానముతో సుకవిత్వమిచ్చుతన్ 1

సుందరుఁడా రఘూద్వహుఁడు సుందరిభూమిజ, ఆంజనేయుఁడున్
సుందరుఁడాదికావ్యమున సుందరకాండము సుందరంబు, నా
నందకరంబు నిత్యపఠనంబునఁ గామితదాయకంబునున్
సుందరివీవభక్తు గృప ఁజూడుము వ్రాయఁగ సుందరంబుగన్ 2

తేలిక మాటల మృదువగు
శైలిని మధురార్థయుక్తి సకలులు మెచ్చం
బాలించుచు నాకలమును
బాలా! రచియింపఁజేయఁ బ్రార్థింతు నినున్ 3

ఏయేశబ్దము లెత్తఱి
వ్రాయన్ రసభావభంగి వరలఁ గ గావ్యం
బాయాశబ్దంబులనే
ఆయాతావులలిఖింపు మమ్మరో నీవే 4

కం. మును వ్రాసినరీతిగ, ని
ప్డును భక్తిరసంబుదనరఁ బూర్ణంబుగ బా
వని, పావనసీతారా
మునికథ వ్రాయింపు దేవి! మ్రొక్కెద నీకున్ 5

ఉ. రాముని సంస్మరించి జలరాశి, దరించివసుంధరాసుతా
క్షేమ మెఱింగి రాఘవునిక్షేమము సెప్పి యొసంగియుంగరం
బామెశిరోమణిన్ దశరథాత్మజుఁ జేర్చిన వాయుపుత్రకుం
డోము స్వకీయకాండము మహోత్తమ మంత్రవిరాజమానమున్ 6

తే॥గీ. ఆది కవివర్య! దాసోహ మనుచు నీకు
కలము బట్టితి సుందరకాండ వ్రాయ
మధురతరమైన సుందరీ మహితగాథ
భక్తజనతతి తరియింప వ్రాయ జేయు 7

కం. వ్రాయందలకొంటిని "రా
మాయనమో" యని సతంబు మానక, కలముం
బాయక వ్రాయింపవె, ఓ
ధ్యేయా! రాఘవ! రమా సతీప్రియరామా! 8

(కృత్యాదిమంగళము)

ఉ. మంగళమాదిమూర్తికి రమావతికిన్ క్షితిపుత్రిభర్తకున్
మంగళ మాదిమాతకును మంగళ మాజనకాత్మజాతకున్
మంగళమర్కసూనునకు మంగళ మాప్లవగాధినేతకున్
మంగళమాంజనేయునకు మంగళమయ్యెడి భక్తకోటికిన్ 9



శ్రీ రామాయనమః

# శ్రీ గోవింద రామాయణము

## సుందర రాముఁడు

కథా ప్రారంభము

### తరణాశ్వాసము

కం. శ్రీరమ గనయోగంబున
గూరుకురాకుండ నూర్ధ్వ కుండలిఁ జేరన్
తీరుగనణిమాదులుచే
కూరవె సకలార్థసిద్ధి జెలఁగఁగ రామా? 1

హనుమ-ప్రయాణము

మ. తమ మెల్లంజనలోకబాంధవుడు భూతశ్రేణికిందోచు,త
త్సమయంబందని లాత్మజుండవనిజాతం గాంచ సన్నద్ధుఁడై
తమిమైయోగిగ జారణుల్ జనుపథిన్ దాటంగసంద్రంబు గా
యముఁబెంచెన్గిరివోలె భీషణముగా నాయద్రిపై నిల్చుచున్ 2

సీ. కార్యాదిఁబెద్దలఁ గని మ్రొక్కి విధిభాను
విద్యాగురునిజూచి వినతిఁజేసి
బాల్యమందునరవిఁ బట్టఁబో గొట్టిన
అలశక్తిమంతు జంభారి మ్రొక్కి
కారణజన్మంబుఁ గలిగించి యుండిన
వాయుదేవునకంతఁ బ్రణతిసల్పి
వరమిచ్చితప్పుడు బ్రహ్మాస్త్రిబంధన
మనినవిధాతృ నమస్కరించి

తే.గీ. భూతతతికెల్ల మ్రొక్కి ప్రభూతభక్తి
తండ్రికిఁ బ్రణామమూని సీతార్థమంత
దక్షిణాభిముఖుండు వాతాత్మజుండు
వాయుమార్గప్రయాణంబుఁ బట్టనుండె 3

ఆ.వె.హృదయమందు ప్రాణ మేర్పడఁ బట్టుచు
దూరమార్గము,గను దూరదృష్టిఁ
గాంచు నూర్ధ్వ దృష్టిఁ గగనతలంబును
జెవులమూసి కాళ్ల వెనకియుండ

ఆ.వె.అంత గొలతలేని యటుగ గొంతంతగా
సద్ధివోలె తనువు నపుడె పెంచి
దక్షిణాభిముఖుఁడు తరలసిద్ధుండయ్యె
ఆమహేంద్రపర్వతాగ్రమందు

తె.గీ.రామబాణంబురీతి నప్రతిహతంబు
గాగ వాయువేగంబునఁ గడలిదాటి
రావణునిలంకకేగి వే రాఁగలాడ
ననుచు జాంబవంతుఁడువిన ననియెహనుమ

ఉ. కానఁగలేనిచో నటను క్ష్మాజను స్వర్గము గూడఁ బోయి,యా
జానకిజాడ జూతు,నట స్వర్గమునం గనకున్న,నేగిలం
కానగరమ్ము,నేమఁజల గట్టుచు రావణుఁ బట్టితెత్తు, కా
దేని నిశాచరేశుపురి నేపెకలించుకఁ దెత్తువానితో

తే.గీ అనుచవీరుండుభీకర మైనరీతి
స్వీయబలము విక్రమము తేజు స్వీకరించి
యద్రికంపింపమర్దించె హస్తపాద
యుగళి వాయు మార్గానఁ బో నుత్సహించి

తే.గీ.ఆమహేంద్రాద్రి మర్దించు నంతనచటి
పుష్పితలతదులతాదయ పుష్పవితతి
జలజలనిరాలె హనుమపై సకలశుభము
లొదవఁగ,వసంతుఁడాశీస్సు లొసఁగినటుగ

తే.గీ కొండయంతయునొక పూలకొండగాఁగ
సహజముగనున్న సెలయేళ్ల చలనమొంది
యెక్కుడుగఁ బారసాగెఁ బెం పెక్కియున్న
మదమిభములు వీడినవను మాదిరిగను

తే గీ.అర్ధచంద్రాకృతిని రేఖ లలరఁదలలఁ
బడగలనువిప్పి నడయాడి పాములెన్నొ
బుస్సుబుస్సుమనుచు వేయి ముక్కలుగను
గొండబండలఁగఱచెను గోపమూని 11

ఆ,వె.పామువిషము దీయ పరమౌషధావళి
కొండయంతనిండి యుండికూడ
ననుపయోగమయ్యె నత్తఱి,విషమున
వేయి ముక్కలగుచు విఱుగబండ 12

తే.గీ.అచలమయ్యును జలియించె నద్రియంత
రెండుగంటల కాలంబు కొండగదల
వెండిబంగారు నీలంపు బండరాళ్లు
పగిలివాని రేఖలు బయ ల్పడినవపుడు 13

తే.గీ.హనుమమర్దింపఁగా మహేంద్రాద్రికదలి
యందుఁగల భూతతతియెల్ల నతిభయంబుఁ
దగిలివికృత స్వరంబున దైన్యమొందెఁ
బరిసరంబులు నిండనా భయదరవము 14

తే.గీ.కొండగూలు నోయనురీతిఁ బండలన్ని
పగిలి ధాతుసంచయమెల్లఁ బయలు వడుట
రంగురంగుల కాంతుల రాణ,నవ్వి
యందమొనగూర్చినవి,మహేంద్రాద్రికపుడు 15

హనుమ-లంఘనము

శా. శ్రీరామశ్శరణమ్మటంచని హృదిన్ సీతా పదంబారయన్
వారాశిన్‌రిపు కర్మనుండు తరియింపంబూని,కుంభించి,లం
కారాజ్యంబున, వాయుమార్గగతుఁడై కాల్మోప, మైపెంచి పెం
పారం గొండగ నిశ్చితాత్ముఁ డయిపో వన్‌లంఘనోద్యోగియా 16

మ. అరిషడ్వర్గ విజేత దివ్యపటుయోగాభ్యాససిద్ధాత్ముఁడా
సురు,లంకన్మను పొచ్చియున్ మనసుతో జొప్పింపగా దేహమున్
బరమార్థంబుగ యోగి కుండలికి బోవంజూచురీతిన్[1] వసుం
ధరపుత్రిన్ మహితాత్మ, లంక[2]గన సంధానించె మేనంతయున్ 17

తే.గీ. మొగముముందు సాచి భుజములు మెడయును
బిగియ బట్టి పాదయుగళి ముడిచి
హస్తయుగము డొక్క లంటంగ స్తంభించి
గాలి బీల్చియూర్ధ్వ గతిని బట్టి 18

ఆ.వె. పెద్ద మొయిలురీతిఁ బెనుభూతమోయన
హనుమ గగనసీమ కంతనెగురఁ
బ్రథమమైన యా, ప్రభంజనగతి చేత
వృక్షచయము లేచి వెడలెఁబైకి 19

ఆ వె. వెడలికొంత దవ్వు కడలిఁ గూలినవంత
గవలి చదలు రెండుఁ గలిసినటుగఁ
వెల్లి పొంగములు సింధువులో బడి
మక్కళించఁగనొప్పె సుందరముగ 20

ఆ.వె. మారుతాత్మజుండు మైపెంచి పోవుట
గమనగతిని పెద్ద గాలివీవ
వనధి జంతుతతియు భయమొంది పెలరేఁగి
నీటిపైకి వచ్చి నిలిచె నంత 21

తే.గీ. మూఁడు పదులయోజనముల పొడువు గలిగి
పిదప, పదియోజనమ్ముల విస్తరించి
కడచి వాఁడెడి,హనుమంతు నౌవలీవ
వనధి ప్రతిబింబితంబయి వరలెనంత 22

1. "[illegible] - రేవుప్రాంతము, [illegible]క్షేత్ర గయాప్రయాగములు-అజాక్షి [illegible] [illegible]యోగము.
2. [illegible] = [illegible].

తే.గీ.వాయువేగంబునం బోవు వాయుసుతుని
యూరువుల గాలిపెట్టున నుబికికడలిఁ
బెద్ద తరగలగమి విను వీథియందు
శారదాభ్రములని యెడి సరణి నొప్పె 23

తే.గీ.కుండలిని పరాశక్తిని గూడనున్న
యోగిచందాన మారుతి యొప్పెనపుడు
లంకయను కుండలికిఁజేరి లలితశక్తి
సీతఁగననుండె నాయన చెలఁగుచుండె 24

తే.గీ.ఇళయుఁబింగళయు సుషుమ్న లేకమగుచు
జనసహస్రారమున బరాశక్తిఁ గనగ
వెడలు యోగివిధంబుగ వెడలె హనుమ
జానకిని లంకజూడంగఁ జదలవెంట 25

ఆ వె.వెన్నుఁబట్టి, పైకి వెడల శిరంబునఁ
జుట్టగాగఁ దోకఁజుట్టియుంట
భాస్కరుండు పొందు పరివేషమన నొప్పె
చక్రగతిగఁ నద్ది, చదల బార 26

తే.గీ.హనుమ పెనుగోళ్లఁజేతుల నంతసాచి
పర్వతాకారుఁడై మింటఁ బారుచుండ
అద్రిలోనుండి వెడలిన యైదు తలల
పాములనఁదోచె మారుతి బాహుయుగము 27

తే.గీ.చంద్ర సూర్యులిర్వురుఁగూడ జదల నొకట
నుదయమైనట్టి రీతిగా నుండె, దీప్తి
మంతములగు హనుమ కండ్లు మహిజఁ గనఁ గ
వాయువేగాన మింటిపై బాఱుచుండ 28

తే.గీ.నాసికయు మొగంబును నెఱ్ఱనై వెలుంగ
నాతని ముఖమండలమపు డరుణకాంతి
సూర్యుఁడస్తాద్రి కేగెడి సొంపునింపు
సాంధ్యకాలరాగోదయ సమయమగుట 29

తే.గీ.అద్రి చలియింప విహరించు యక్షులాది
సురలువిడి కొండ, మింటికిఁ జొచ్చి, హనుమ
భీకరాబ్ధిని దాఁటుచు వెడల, గాంచి
రామకార్యార్థమని మునిరాజికనిరి 30

తే.గీ.ఇళయు బింగళయు సుషుమ్న నేకమగుచు
గుండలికిఁ బోవుగతివాయు వుండెనపుడు
హనుమ వెంటాడిచనియు త్తరానిలంబు
దక్షిణపథానిలంబుతోఁ దారసిలుట 31

ఆ.వె.తోక, నిక్కబెట్టి తోయధిఁదాఁటుచు
హనుమ దక్షిణదిశ కరుగునపుడు
లంక కేదొ కీడు రానున్న గతిఁదోపఁ
దోకచుక్కవోలెఁ దోచెతోఁక 32

మారుతి-మైనాకుఁడు

ద్వి. ఈగతిఁ జదలందు నేగెడివాని
సాగరము వరింప సాగినవాని 33

ద్వి. సురలు దేవతలంతఁ జూచిముదమున
విరులను జల్లిరి వీరునిపైన 34

ద్వి. సూర్యుఁడు వేడిమిఁ జూపుట మానె
ధైర్యముతోఁ జను దనయుని వెంట 35

ద్వి. వాయువు తోడ్పడ వరలుచు నుండె
ధ్యేయుఁడు రాముని దీపని యగుట 36

ద్వి. మునులును యోగులు మోదంబు తోడ
హనుమకు దీవన లందిచ్చినారు 37

మ. తనులంఘించెడివాని, సాగరుఁడు మోదంబూని వీక్షించుచున్
మును తా సాగర నామమూనఁ గలపెం పుంబ్రాపుఁగావించి యుం
డిన నిక్ష్వాకులలోని రాఘవునివాఁడేవీడు, లంఘింపడ
స్సిన గార్యార్థమెవీగునంచు మదిలోఁ జింతించు దాఁదోడ్పడన్ 38

తే.గీ. పరుల యుపకృతి మరువఁజాలరుకృతజ్ఞు
లరయ, సగరుసంతతి,గద యబ్ధిద్రవ్వి
వృద్ధి దనకిచ్చి యుండుట వేగిరపడెఁ
బ్రత్యుపకృతి సల్పఁగ వారి వంశజునకు 39

ఉ. ఱెక్కల తోడఁ బై కెగిరి రివ్వన, లోకభయంకరంబులై
దిక్కులకేగు నాగిరుల దేవవిభుండు నిజాయుధంబునన్
ఱెక్కలు గొట్టియుండిన త ఱిన్ భయమొంది మహాబ్ధినాశ్రయం
బొక్కమహీధరంబుగొని యుండుటసాగరుఁ డెంచియంతటన్ 40

మ. మనుచున్నాఁడు తదాదినాకడుపులో మైనాకుఁ డాతండు రా
ముని కార్యార్థికిఁ దోడ్పడంగలుగు నేపున్నట్టివాడంచు, నా
తని కాసాగరుఁడంత బల్కెఁగనుమీ ధాత్రీశుఁ డౌరాముపం
పున లంకంజొరనున్నదాటెడి మహా పూతాత్ముని న్మారుతిన్ 41

ఉ. నాకుపకారకుల్ సగర నందను లేమును, పెంపొసంగుటన్
నాకిటు సాగరాఖ్య యుగనంబడు తత్సగరాన్వయుండు ని
క్ష్వాకు కులోద్భవుండు రఘువర్యుఁడు, మారుతి వానిదూత, లో
కైకవిభుండు రాఘవున కిప్పుడు ప్రత్యుపకారమూననొ 42

ఉ. పంపినవాడు రాఘవుఁడు వచ్చినవాడును వాయుజుండు, బలే
తెంపు గలట్టివీరుఁ డును ధీరుఁడుయోజనముల్ శతంబు గు
ప్పింప దలంచె, నీజలధి వేదవిదుండు, నిజారివర్గముం
జంపినయోగసిద్ధుఁడును జానకిఁగాంచఁగనున్న పూజ్యుఁడున్ 43

తే.గీ. పెద్దపెట్టునవాయువు వీచి నాడు
కడలిఁబడవేసి, యింద్రుని కత్తిదెబ్బ
నీదుపక్షంబులందెగ నీయకుండఁ
గాచియుండఁడె హనుమంతుఁ గన్నతండ్రి 44

ఉ. మారుతిపోహుటాహుటిని, మార్గమునందెటగాని డస్సినన్
శ్రీరఘురామకార్యము విశీర్ణమగుంగద, సేదదీర శృం
గారరుచి ప్రదీప్తములు గా, భవదీయములైనశృంగముల్
సేరమువీడి దారినవి నిల్పుము మారుతి విశ్రమింపఁగన్ 45

కం. చేయుము, ప్రత్యుపకారము
వాయువునకు ఋణము దీర్చుపట్టిదెసుమ్మా
వాయుసుతుఁడు రక్షితుఁడై
పోయిననను దాఁటి, శుభము పొందును జగమున్ 46

తే.గీ. హనుమ బూజింప రామున కదియ జెందు
రామునకు జేర నిక్ష్వాకు రాజుల కది
యందు ; బ్రత్యుపకారమి ట్లాచరింప
ధన్యతములము గామె యిద్దఱముఁగూడ 47

కం. లేనియెడం గడు దిట్టెడిఁ
బాని కృతఘ్నునిగ, నన్నెపుడు ముజ్జగముల్
జానకిఁ గనఁ బోయెడి, యి
వ్వానికి నాతిథ్యమిచ్చి వరలుట మేలౌ 48

తే.గీ. రక్కసుల మూకభూమికి రాకయుండఁ
గదలి పాతాళమునకడ్డు గాగ నునిచె
సురలపతి, నిన్నతఁడు మెచ్చుఁ బరమమైత్రి
హనుమ కాతిథ్యమిడ వైర మంతరించు 49

ఉ. లోకము మెచ్చ సాగరు, నిరూఢమనంబెదనెంచుచున్ వడిన్
నాకమునందు దోవ, నలినాక్షుని దూతకు సేదదీర మై
నాకుడు స్వర్ణ శృంగముల నాకమునంటఁ గ బెంచిదారిలో
బోకకునడ్డుగా నిలిపెఁ బూజ్యుఁడు మారుతివాని గాంచుచున్ 50

తే.గీ. రక్కసుల మాయయౌనిది లంకకరుగ
నడ్డుపడుచుండె నీయద్రి యనితలంచి
శృంగభంగంబు గావించి చెలఁగె హనుమ
తనదు వెడదయురంబునఁ దాఁకి దాని 51

మ. ఆమైనాకుఁడు శృంగభంగమున కావంతేని చింతింపఁడా
రామాంఘ్రిప్రవిభాసమానుఁగని దాసోహమ్మనున్ భక్తిమై
నామార్గంబుగఁ బోవు సద్గుణుఁడు మార్గాయాసముం బాపగా
నీమార్గంబుననుండి గొంతతడవేన్ నిల్వంగనౌ నాపయిన్ 52

తే.గీ.ఇందుగల స్వర్ణ శృంగార శృంగములను
వివిధ ఫలపుష్పశోభిత విపినసీమఁ
గొంతతడవుండి, లంఘింప నెంతొసుఖము
పండ్లబక్షింపు మతిథివై పవనసుతుఁడ 53

తే.గీ.సగరవంశస్థుఁడౌ రామచంద్రమూర్తి
దూతవౌటసాగరుఁడు సంప్రీతిమీరఁ
బంపెననుస్వాగతంబీయ వాయుజుండ
మున్నునీతండ్రిరక్షణ మొసగె నాకు 54

ఆ,వె.ఎఱుకలేనియట్టి పెఱవాఁడె యతిథియై
వచ్చియున్న గూడ వాఁడు గూడ
నమితతృప్తి గనగ నాతిథ్యమిచ్చుట
పరమధర్మమనుచుఁ బ్రాజ్ఞులనుడి 55

తే.గీ.హనుమనీవంటి యతిథిలభ్యమ్ముగాడు
సాగరుని నన్ను మన్నించి స్వాగతంబు
గొనుము. మాకృతజ్ఞతఁజూప మనసుగలిగి
చేయునుపకృతి గొనుమోయి వాయుపుత్ర 56

తే.గీ.నేనుమైనాకుడ హిమాద్రి సూనుఁడసుమ
జలమునందుండివచ్చితి జలధిపైకి
రాక్షసులమాయగాదు నా రాకహనుమ
స్వాగతంబిదె, అతిథివై వరలుమయ్య 57

చ. అనవినిస్వాగతంబు, నని లాత్మఁజు డాడె ను మార్గమందు ని
ల్వనని యె కాయెకిన్ జలధి లంఘనమూన బ్రతిజ్ఞజేసినాఁ
డను, రవిపశ్చిమాద్రినిబడన్ జనుచుండెనుగాన నంతకున్
మన్నుదరిఁజేర గావలయుఁ బూనవిలంబనమెచ్చటేనియున్ 58

కం. సాగరుఁడునునీవొసగిన
స్వాగతమేతృప్తినిచ్చెఁ జాలిదిదూరం
బేగఁగవలె వేరువిధము
గాగఁ దలపకుడుముదంబుఁ గొంచితినింతన్ 59

ద్వి. అనుచు మైనాకునిఁ దనచేత నిమిరి
హనుమంతు నాకాశ మునముందుకరుగు 60

ద్వి. హనుమకు స్వాగతం బనుటను మెచ్చి
కనినాకమునుండి కనకశృంగముల 61

ద్వి, గిరిరాజుసుతునకు సురరాజు గూర్మి
వరమిచ్చె దిరుగాడ భయమును వీడి 62

సురస-హనుమ

ఉ. అంబుధినూరుయోజనము లాశుగపుత్రుఁడు దాటనోపునా?
అంబరమందు బోయెడి మహాగతి లంకకు జేరునా? నిరా
డంబరు డైనవాఁడని సురల్ మునికోటియు సంశయించి డెం
దంబుల, వానిశక్తి గనఁ దక్షణమే తలపోసిరెల్లరున్ 63

ఆ.వె. హనుమశక్తియుక్తి నంత బరీక్షింప
సురసఁజేరి వాయు సూనుశక్తి
దూచిచూడ గోరఁ దోయజాక్షియునంత
వికృతరూపమూని పెంచె దనువు 64

సీ. ఘోరాకృతితోడ వినువీధి నిండుచు
గగనభాగంబెల్లఁ గప్పి నిలిచె
పెద్దముక్కును విప్పి పెనునెత్తి గోఱల
నగ్గిచూపుచు దారి కడ్డు నిలిచె
మిడిగ్రుడ్లఁ ద్రిప్పుచు మీదమీదకు వచ్చి
హూంకరించుచు మ్రింగ నుండి నిలిచె
అటునిటు బోకుండ నెటు దారి లేకుండఁ
దననోటిలో దూరు మనుచు బలికె

తే.గీ. అహహ నేఁటికిఁ జిక్కె నా హారమింక
నన్ను మీఱుఁచు బోయెడి తెన్ను సున్న
నారగుమిదె నోటఁ దగబడి చూతువేల
నిన్ను దిగమ్రింగఁ బంపిరి నిర్జరతతి 65

మ. అనుచున్ భీకరవేష రూపమునఁదా నడ్డున్న,యారాక్షసిం
గనుచుంబోరొనరింపఁగా దలపఁ డా కార్యార్థివీరుండెయ
య్యనుశీఘ్రంబుగ ముందు బో దలఁచి చే యుం బ్రార్థనంబంత,రా
మునికార్యార్థినిసీత గాంచ జనునన్ బోనిమ్ముకై మోడ్చెదన్ 66

ఉ. రాముఁడు సర్వలోకనుతరాముఁడు రాజ్యమువీడువీడి, సీ
తామహితాత్మభార్యయును దమ్మునిలక్ష్మణుఁగూడుచున్వనీ
ధామనివాసియౌచు వసుధాసుత నొంటిగవీడిపోవనా
కాముకుఁ డైనరావణుఁడు క్ష్మాజనుదొంగిలి చేరె లంకకున్ 67

ఉ. ఏమనుకొంటివో, నృపవరేశునిదూతనులంకయందు సీ:
తామణిఁగాంచియాశుభము దాశరథింగనితెల్ప గావలెన్
వ్యోమతలంబునందిటుగఁ బోయెడి దారికినడ్డునిల్చెదో
ఏమిఫలంబురాఘవున కిట్లపకారముఁబూనరాక్షసీ 68

తే.గీ.రామకార్యంబువంటి కార్యంబులేదు
పతితపావనరాముని పనినొనర్పఁ
దోడ్పడుమునీవుఁగూడ సంతోషమూని
రాఘవునిరాజ్యమందీవు బ్రతుకుచుంట 69

ఉ. కాదనియందువేని రఘుకాంతునకున్ శుభవార్త దెల్పియా
మీదనువచ్చు వాడనను మ్రింగగనీకడకేను, నమ్మ, స
మ్మోదముతోడహారముగఁ బొందుముసత్యము చెప్పుచుంటినీ
పాదసమాశ్రితుండనయి ప్రార్థనఁజేయుచునుంటి వీడుమీ 70

శా. అమ్మా? నేరఘురాముదూతను సుమా! ఆవాయుసూనుండ సీ
తమ్మన్ రాఘవుపత్నినిన్ సుగుణపూతన్ దైత్యనాథు డుస్సీ
యమ్మాలంకకుఁజేర్చెనామె గననే నాలంకకుంబోయెదన్
వమ్మౌరాముని కార్యమిప్పుడుననున్ భక్షించితేనీవిటన్ 71

ద్వి. వాయుసూనునిమాటఁ బాటింపదామె
వేయదువెనుకంజ భీకరాకృతిని 72

ద్వి. మారాడఁజూతు నా మాటకునీవు
నోరిదేదీనిలో దూరుమీవింక 73

ద్వి. వరమొందియుంటినె వ్వారునుగాని
దరిఁజేరినావారి దాటఁగా లేరు 74

ఆ.వె.అంతనంతలోన నంగుష్ఠమాత్రుఁడై
హనుమదానినోటి యందుదూరి
యవల బడుచునిలిచి యణిమాదిసిద్ధుఁడు
సురసఁగాంచిపలికె సరసగతిని 75

తే.గీ.సురస: దక్ష ప్రజాపతి సుతవు నీవు
వందనమ్మిదె నీనోటఁ బడకఁ దప్ప
దేరికినిగాని,యనుచు నీ వెంచుదాన
బ్రహ్మయిడియుండెనీఁ కిట్టి వరముమున్న 76

ఆ.వె.వరముదీరె, నింక వదలుమీనన్నీవు
సీతయున్నచోటు జేరవలయు
ననఁగహనుమ,సురస యారూపువిడనాడి
స్వస్వరూపయగుచుఁ బలికెనంత 77

తే.గీ.హరివరా: యేగుమీవింక నబ్ధిదాఁటి
కార్యసిద్ధిని బొందఁగాఁగలవునీవు
సీత గని మహాత్ముఁడు రాముఁ జేర్పుమనుచు
నయముమీరంగ దీవించె నాగమాత 78

తే.గీ.ఉదధిలంఘించుచుండుట మొదటి పూన్కి
అంద గొనకుండ బోవుట రెండవయది
సురసనోటనుబడియు వే మరలిరాక
మూఁడవయదియుఁ బరికింప వీఁడె ఘనుఁడు 79

ద్వి. అనిసురల్ మునులును హనుమను బొగడి
ఘనమగుదీవనల్ ఘటియించినారు 80

ద్వి. విజయంబు,గనునింక వీనికార్యంబు
విజయుఁడై మఱలునీ వీరుండు, నిజము 81

తే.గీ.అనెడివారల యాశీస్సు లందుకొనుచు
దాఁటిమైనాకు. సురసను దాఁటివేగ
జలధిలంఘించు నాకాశ లలితవీధి
దేవతలుపోవుమార్గాన దేవిఁగనఁగ 82

## సింహిక-హనుమ

ఆ.వె.రాహుముఖము నుండి గ్రహణ విముక్తుడై
జదలవెలుఁగుచుండు చంద్రుమాడ్కి
జుక్కగములదారి శూరుండుమారుతి
చనుచునుండెలంకఁ గనగ వేగ 83

చం. అటునటు కొంతదవ్వరుగు నంతగుభాలునదారికడ్డమై
పటుతరశక్తిసింహిక యపారభయంకరరూపనిల్చె నే
డిటఁతిరుగాడుఁబెద్దమెక మేదియొ,యంచనినీడఁబట్టుచుం
దటుకునమ్రింగగాఁదలఁచి వారసిలెన్‌హనుమంతునంతటన్ 84

ఆ.వె.నీడ బట్టిలాగి నేర్పుమైమ్రింగఁగ
నడ్డువచ్చి హనుమ దొడ్డమేనుఁ
బట్టనోరుఁబెంచెఁ బాతాళపర్యంత
మబ్ధినుండికొండ కంటునటుగ 85

ఆ.వె.హనుమ, పయనమైన యపుడు సుగ్రీవుండు
తనకుఁదెలిపినట్టి దైత్యయీమె
యంచుఁదెఱచియున్న యాపెనోటినిగనె
జీవమర్మములను జింతసేసి 86

తే.గీ.వజ్రమును బోలుకాయంబు ప్లవగవరుఁడు
మిక్కిలిగఁజిన్నదిగఁజేసి యొక్క పట్టు
దైత్యపెనునోటఁజొరబడి త్వరిత గతిని
జీవమర్మంబులనుగోళ్ల జీల్చివైచె 87

ఆ.వె. ఆమెనోరుమూయు నంతకు బూర్వమే
వెలికివచ్చిమఱలఁ బెంపెమేను
సింహికయునుగుండెఁ జీల్చినయంతనె
చచ్చి కడలి దేలె శవముగాఁగ 88

## హనుమ-లంకఁగనుట

ఉ. ఘోరనిశాచరిం దునిమి కొండను ముందుకు బోవుమారుతిన్
భూరిపరాక్రమాన్వితుని ఘాతములన్నియుఁగాంచిమెచ్చి యా
ధీరుఁడు కార్యసిద్ధి గన దీవనలిచ్చిరి, పూజసల్పి రా
శూరుఁడు పన్నగాశనుని జొప్పునరివ్వనదాటి వార్నిధిన్ 89

సుగంధి:-

చుక్కలుండుదారివెంటఁ జొచ్చుచుండియే, కనెన్
బక్కిఁజేనిరీతివేగ బాఱుచున్ వనావళిన్
బెక్కువృక్షపుష్పరాజి వెల్గులంక. నద్రిపై
నొక్కపెట్టుదూకితీర మొప్పుగాఁగఁజేరుచున్ 90

కం. మలయాద్రిని లంకనుగని
సలిలంబులతీరమందు జక్కఁగఁజేరెన్
లలితాంగిఁ సీతనుగను
తలపునముందు గలకార్యతంత్రముదలఁచెన్ 91

ఉ. నాప్రభురూపవేగముల నన్నికదైత్యులుజూడఁగల్గుచో
నాపయి గన్ను వేసెదరు నన్నికవీరదుకార్యహానియౌ
నీపుర మెల్లరోయవలె నిందునిధానన జూడసూక్ష్మమౌ
రూపువహింతునంచు నెద లో హనుమంతుడు పూనెయోజనన్ 92

తే.గీ. యోగసిద్ధుఁడు లలితాంబ యుండు చోటుఁ
జేరఁగలఁడతం డణిమాదిసిద్ధుఁడగుట
పరమవిజ్ఞానిదేహంబు వదలి తుదకు
సూక్ష్మరూపాన బరమాత్మఁజొచ్చునట్లు 93

తరణాశ్వాసము - సింహిక - హనుమ

ఆ.వె.బలిని సంహరింప విలయమూర్తిగనయ్యెఁ
బడసెఁదొంటిరూపు వామనుండు
హనుమగూడనట్లె యద్రిరూపము వీడి
సహజరూపమూనె సంచరింప

తే.గీ.లంబపర్వతశిఖరాన వ్రాలి యాతఁ
డా త్రికూటాద్రిఁ గల లంక నంత గనుచు
రహిని నమరావతీనగరంబుమాడ్కిఁ
బొలుపుమీఱుచునుండి న పురముగనుచు

శా. నానాసూన వితానవాసనలచే నల్దిక్కులన్నింపుచుం
గానల్ గొంతలు జుట్టుముట్టిగల లంకాపట్టణంబున్గనెన్
ఘానుండ స్తమయంబు గాంచుటకు బూర్వంబే కుఠిన్శాఖలన్
మేనెల్లన్ విదళించుచున్ విడిసె సంప్రీతింగృతార్థుండుగా

తరణాశ్వాసము - సంపూర్ణము

ఆశ్వాసాంత పద్యములు:-

తే.గీ.తరణిసుత సువర్చల నిజదార గాగ
బ్రహ్మచర్యంబు నెఱపెడి బ్రహ్మచారి
లంకఁ ద్రిపురసుందరిఁ గను రహిఁజెలంగు
వజ్రకాయుండ? యోగి?దేవా? నమామి

తే.గీ.లంకఁద్రిపురసుందరిఁ గనజంకులేక
చేతను నికడ్డమైవచ్చు చిక్కులు డిపి
శత్రుకర్మనమూనుచు జలధిదాటు
అఖిల, నిగమవేద్యా? మహాత్మానమామి

తే.గీ.నిఖిలరోగార్తివారణ, నిర్జితారి,
రామభక్తశిరోమణి, లంకయందు
వ్యోమమార్గానఁ జనికనఁ బూనియున్న
అతిప రాక్రమ ధుర్యవీరా? నమామి

ఉ. కారణజన్ముఁడైన రఘుకాంతుని దివ్యపదారవింద సే
వారతిమగ్నయోగివరః వారిధిదాఁటుటలెక్కయొక్కః సీ
తారమ గాంచుదీవనుట తథ్యము, దాసన, నుంగరంబు నా
భూరమణుండొసంగె గురుపుంగవః చేతనకోటిరక్షకా 100

తే.గీ.పంచముఖముల భాసిల్లు పండితుండ
రామదాసుండ భక్తసంరక్షకుండ
భయనివారణమంత్ర విభాసితుండ
ఇష్టకామ్యార్థములనిచ్చు నిష్ఠవాడ 101

తే.గీ.ఆయురారోగ్యవిద్యాప్రదాయకుంత
సుందరాకారచేతన సూరివరుఁడ
చేతనావనదీక్షావిశిష్టమూర్తి
సర్వసకలార్థవిద్యావిశారదుండ 102

ద్వి. మనసునఁదనువున మలినంబులేక
"హనుమాన్నటం" చు నష్టాక్షరినినీను 103

ద్వి. మొదట"ఓం",కారంబుఁ చివరి"స్వాహా"యు
గుదిగూర్చిజపియించి కొల్వఁగనిన్ను 104

ద్వి. ఇహపరసుఖముల నీయవేనీవు
రహి నీకు ధ్యేయుంచు రామయ్యవోలె 105

ద్వి. అన్యుల గొల్వక నారాముగొల్చు
ధన్యుండ నీకెదె దాసోహమందు 106

ఉ. తారకమంత్రరాజమున దాటుచునుండిరి భక్తకోటి సం
సారసముద్రముం బరమ సద్గుణయోగి త్వదీయభక్తు డీ
నీరధిదాఁటనెంతసనిః నీకృపగాంచినవానికే దిలన్
భారమగున్ శుభంబెగను వాయుసుతుండునురామభక్తిమై 107

ఆ.వె.కుదురుపఱచియూర్ధ్వ కుండలి జిత్తంబు
లోఁ పదేకదృష్టి లోభుఁడగుచు

యోగిచూడ జూడ యుగములుఁగ్రుంకును
గనఁబరాత్మదివ్య కాంతిమేన 108

తే.గీ.యోగసిద్ధిరామునిఁగను యోగియయ్యు
దివ్యమంగళవిగ్రహ దీప్తి గనుల
బాహ్యదృష్టిని గన గల్గు భాగ్యమేరి
కబ్భేఃహనుమనీ,కబ్బేఁ తుభ్యంనమోస్తు 109

తే.గీ.రామకార్యార్థమైజన్మఁ గాంచినట్టి
వాయుసూనఃకృతార్థుఁడ వైతివీవు
భక్తజనకోటిసంత్రాణ! భయవిదూర
మానవాచార్య,దేవ నమోనమోస్తు 110

తరణాశ్వాసము-సంపూర్ణము

శ్రీ గోవింద రామాయణమున, సుందరరామ కావ్యంబున
తరణాశ్వాసము సంపూర్ణము.



శ్రీ రామాయనమః

# సుందరరాముఁడు

## ప్రథమాశ్వాసము

కం. శ్రీకరుఁ నినుఁ గనఁ దలఁచెడి
ప్రాకటవిజ్ఞానిసొప్పు వహియించుచు నా
లోకనమొనరింపవలయు
నీకు కృపజనింపదాక నిర్మలభక్తిన్

హనుమ - స్వగతము

ఉ. శ్రీమహితుండు రాఘవుని చిత్తముసం దలపోయునాకు నూ
రామడ, పాటలెక్కయొకొ! అమవలెన్నియొ దాఁటువాఁడ, వి
శ్రామమదేలయంచు హృది సంతసమందుచు వాయుసూనుఁ డా
భూమిజగాథలన్నిడీనెఁ బుష్పచయంబులు రాల మేనిపై 2

సీ. బంగారుపూఁతతోఁ బ్రాకారమొప్పుచుఁ
గొండనుబాకెడి కోటగోడ
కోటగోడనుజుట్టి దాఁటనశక్యమౌ
కలువపూవులుగల కందకంబు
కందకంబునుజుట్టి కలిసమహోన్నతా
వివిధలతాకుసుమ వృక్షతతులు
వృక్షతతులనుండి వినసొంపుగాఁగూయు
పలురంగులీనెడి పక్షిగములు

తే.గీ. పక్షిగములకాశ్రయములై వనులు, వనుల
హంసకారండవాది ఖగాళిసొప్పు
పెద్దనదవావులును జాల పెరుగుచుంట
హనుమగాంచుచువిస్మయ మందుచుండె

ప్రయత్నాశ్వాసము-హనుమ-స్వగతము

ఉ. తీరుగ విశ్వకర్మజలధిన్గిరియగ్రమునందు గట్టెఁబ్రా
కారపరీవృతంబుఁబరిఖావృతమున్పురుజుల్ గలట్టిదై
వైరి,కభేద్యమౌచు భటవర్గముకాపలగాయుచుండిరీ
ద్వారములంబ్రవేశమెటు పట్టణమున్ గెలువంగనేనొకో?

తే.గీ.కొండకొన గట్టియుండుట గొండఁదాకి
డీకొనఁగఁ బోవుచున్నవా? లోకనాథు
ననఁగఁజంద్రశుక్రులకాంతిఁ దనరుసౌధ
రాజివిపులరథ్యల నలరారు లంక

తే.గీ.ధరణిజాపతిలంకపై దాడివచ్చు
ననెడిభీతిమై సాయుధ హస్తులగుచుఁ
బురమునెల్లయు గాయుచుఁ దిరుగువీర
భటచయంబులగాంచెడి వాయుసుతుఁడు

ఉ. వానరు లెట్లుదాట గలవారలు,వారిధిదాట నీలుఁడున్
నేనునునంగదుండు గపినేతయు మాత్రమెయోపువారమై
పూనఁగనౌనె సంగరము భూరిబలాఢ్యుఁడురాక్షసేశుతోన్
జానకినాథుడండయయి సాగరముందరియించివచ్చినన్

సీ. బలమదోద్ధతితోడ బరనారిహరియించె
సామవిధానంబు సాగఁబోదు
వెండిబంగారముల్ విరివిగాఁగలవిట
దానవిధానంబుఁ దలఁపరాదు
పూర్వమైత్రియొకింత పొసఁగనిదైత్యుల
భేదవిధానంబుఁ బెట్టరాదు
ఉద్దండబాహుబలోపేతు, లసురులు
దండనోపాయంబుఁ దగునెతగదు

తే.గీ.వరబలాన్వితుఁడైన రావణునితోడ
ననిజయాపజయంబుల నరయవశమె?
సీతఁగాంచినమాటనే చెప్పునంత
దాశరథి నిర్ణయించుక ర్తవ్యమపుడు

ఉ. ఇంతకుస్వస్థయై బ్రతికి యేయిటనుండెనొ లేదొ సీత వృ
త్తాంతమెఱింగియామెనుడి దాశరథింగనివిన్నవింపనొ
నంతకుముందుఁగాఁదలఁపనౌనె జయాపజయంబులంబురిన్
సాంతముగాగరోయనగు నందులకేగతిఁజొత్తు గోటలోన్ 9

ఆ.వె.కోఁతిరూపుతోడఁ గోటలోఁజొరఁబడఁ
బట్టువడనెతోడ వైరికపుడు
పెద్దమేనుగూడి వెడలుటచెడుగాను
చిక్కువాడ వైరి చేతికంత 10

తే.గీ.రాక్షసస్వరూపంబున లంకఁదూర
నౌనె!యొండొరుల్ లంకలో నసురవీర
మెఱిఁగియుండుట గుఱుతింప రే,ననుఁబెఱ
వానిగాఁగార్యహాని నావలనఁగాదె 11

తే.గీ.దూతనేర్పరియైనచోఁ దొలఁగివిఘ్న
తతులు,కార్యసాఫల్యమే తదనుగుణము
గాఁబ్రవర్తిలయోజించి కడఁగవలయుఁ
గానియెడ రామకార్యవిఘ్నంబెయగును 12

ఆ.వె.పవలెయిపుడెవనఁగ వైరులుపట్టరె
ప్రొద్దుగ్రుంకినతఱిఁ బోవఁదగును
పిల్లివోలె చిన్నపిల్లగరూపొంది
యేరుఁగానకుండ నేగఁదగును 13

మ. అనుచున్ మారుతి,రామలక్ష్మణుల సీతాంబన్ హృదిన్ నిల్పుచున్
మననంబానుచునిశ్చితాత్ముఁడయి సంభావించెమార్గంబు,లం
కనుదూరన్ విడిశంకలన్ జనకజా కళ్యాణినింగాంచనౌ
ననుసంతోషముననగ్గిరిన్విడిచి దివ్యామోఘశక్తుండుగా 14

ఆ.వె.కుముదమైంద,ఋక్ష కుశపర్వులును,గేతు
మాలి,ద్వివిద,సుషేణ మహితులిటకు

రాగలారు రామ లక్ష్మణయుతులయి
వీరులౌటఁదుదకు విజయమబ్బు 15

ఆ.వె. అనిప్రదోషకాల మాసన్నమగుతఱిఁ
బిల్లకోఁతివోలె పిన్నరూపుఁ
దాల్చి మెల్లమెల్ల దారిలోనెగురుచు
రామకార్యమెంచి రాత్రిబడుట 16

తోదకము. తోఁటలగుట్టలఁ దొందరతోడన్
దాఁటుచుగుట్టుగ దైత్యులలంకన్
గోటకుఁజేరెను గుడ్యముచెంతన్
వాటముజూచుచు వాయుజుఁడుండెన్ 17

## లంకాప్రవేశము - లంకిణి

ద్వి. రామకార్యార్థమై లంకలోఁజొచ్చు
నామారుతికి సహాయంబుగాననఁగ 18

ద్వి. మిన్నున,శశివెల్గి మేదినినంత
వెన్నెలనింపెను వేడుకమీఱ 19

ద్వి. తిన్నఁగ బురిఁ గాయు దేవతలంక
పిన్నకోఁతినిఁగని భీకరాకృతిని 20

ద్వి. ఎవఁడవునీవిటు లీపురిఁజేర
జవమునవచ్చితి చంపెదనిన్ను 21

ద్వి. ఎవరికలవియేను నీకోటఁజేరఁ
బవలురేలును నేను ప్రజ్ఞమై కాయ 22

ద్వి. నన్నుజయింపక నీకోటలోన
వెన్నుఁడుఁగూడఁ బ్రవేశింపలేడు 23

ద్వి. తెలుపుమీనీకథఁ దేటతెల్లముగ
పలుకుమీ,యేపనిఁ బట్టివచ్చితివి 24

ద్వి. అనుచుహాహాకారమును జేసి నిలిచె
హనుమకట్టెదుట,లయాకారయగుచు 25

కం. చెప్పెదకాంతా!నాకథ
నిప్పుడె,ముందువినవెంత నీవెవ్వతెవో
యిప్పురివాకిటనీవిటు
గొప్పగనడ్డుపడ నాకు కోపముతోడన్ 26

కం. వినుచున్హనుమనురాక్షసి
కనుమోయీ నేనె లంక కాపగులంకన్
గనుజెప్పలవాల్చకయే
మనుచుండినదాననీవు మనజాలవిటన్ 27

ఉ. రావణరాజు పాలకుఁడు రాక్షసవీరులనేకకింకరిన్
ధీవరులున్బలాన్వితులు దేవతలైనను లంకలోనికిం
బోవఁగలారె?నన్నిటనుఁ బోరిజయింపకఁగోతివీవహా!
ఈవెటుజొత్తువీపురము నేనె నిను న్దిగమ్రింగివేయనే 28

చం. అనిపలుకాడునట్టి యసురాంగన గాంచుచుమేనుగొండగాఁ
జెనిచివనీలతాకుసుమ వీథులసౌధచయంబు గాంచుని
చ్చనుజనుదెంచినాఁడఁగని చయ్యనవచ్చినదారిఁబట్టెదన్
వినుమనిపల్కె-నాహనుమ వెంటనెయడ్డుఁదొలంగఁగోరుచున్ 29

ద్వి. హనుమంతుమాట కా యసుర కోపించి
కనులెఱ్ఱఁజేయుచుఁ గంఠంబునెత్తి 30

ద్వి. వినుపీథముట్టంగఁ బెద్దగానఱచి
తనువెల్ల విదళించి దర్పంబుమీఱ 31

ద్వి. కనుమోయినాదెబ్బఁ గను మిదేయనుచు
హనుమఁజొమ్మనుగొట్టె నఱచేతితోడ 32

ఉ. జొమ్మనఁగొట్టినాయసురరూపను,స్త్రీనివధింపరాదటం
చమ్మోయినెంచిమారుతి తదంగనగ్రుద్దెనుముష్టి,వామహ

స్తమ్ముఁబిగించియంతట,నిశాచరిలంకవడింబడెన్ భువిన్
వమ్మయిగర్వమెల్లఁజన, వాయుసుతుంగనిపల్కెదీనమై 33

ఉ. ఈవు మహాపరాక్రముఁడ వీవె జయించితినన్నుబల్మియై
నీవహా!వీరవర్యుఁడవు, నే,వనితన్,దునుమాడనెంతువే
ఈవువనీచరోత్తముఁడవేనొకరక్కసియాడుదాననుం
జావఁగఁ గొట్టుదే కనుము జాలి,ననుంగృపఁ జూడుమింతతో 34

## లంక రాక్షసనాశనంబు దెల్పుట

చం. హరివర?చెప్పుదాన విను నాన్నృతమైనయుదంతమొండు,మున్
వరమిడిబ్రహ్మపల్కె, గపి బాహుబలాఢ్యుఁడొకండువచ్చి నా
గరువమువాపుచున్ జయముఁ గాంచెడివాడని, నాఁటనుండి, అ
సురులకు ముప్పుగల్గుననుచున్,విధివాక్కునకడ్డముండునే 35

ద్వి. సీతనుహరియించి నీ!రావణుండు
పాతకంబొనరించెఁ బాడగువాఁడు 36

ద్వి. దాపరించెనుజేటు దైత్యులందఱకు
ఆపాపమేలంక నంతయుఁగాల్చు 37

ద్వి. నందికేశ్వరుశాప మందిన లంక
పొందును నాశంబు ,బొమ్మింక జూడ 38

శా. ఆసాంకేతికమైన రోజిదియగా, నావీరవర్యుండ వీ
వే, సాంతంబుగనన్ను గెల్చితివి,నీవే,లంకలోజానకీ
వ్యాసంగంబునస్వేచ్ఛమై దిరుగుమీ వాతాత్మజా,చూతు వీ
వాసీతన్ జయమొంది రాక్షసకులం బంతంబుగా నాందివై 39

ఉ. నేనొక ధన్యురాలను వనీచరపూజ్యుఁ గనంగనోచితిన్
జానకిజాడఁజూడరఘుచంద్రునిపంపున వచ్చియున్నని
న్నూనిరఘూద్వహుందలచు పుణ్యమొకింతలభించెఁగాదె, న
వ్వానిస్మరింపఁగాఁగలుగు భాగ్యము నాకిపుడేలభించెగా 40

కర్కటిరాక

తే.గీ.అనుచువిహ్వలయౌచును నవనిఁబడియె
గ్రుద్దుఁదినినచోటనె లంకఁ గూలిపడిన
సోదరిని, మూడులోకాల స్రుక్కఁజేయు
కర్కటివిషూచి రూపవేగముగఁగాంచి[1] 41

తే.గీ.భీకరార్భటి హనుమంతు దాకవచ్చె
వరముఁబొందితిమున్నేను బ్రహ్మవలన
దానవిక్రమమూనెద గాలికొడుక!
క్షణములోనిన్నుఁద్రుంతునా శక్తి గనుము 42

తే.గీ.అనుచుఁగర్జించులోకసంహార్త్రినెఱిఁగి
వాయుసుతుఁడామెచేఁగల వక్రదండ
మంతలాగియద్దాననే యామె చావ
మోదిపడవైచె నటనె యా భూమిమీద 43

చం. అదికని బ్రహ్మదేవుఁడట కప్పుడెవచ్చిసమీరసూతికిన్
విదితమొనర్చెవాయుజుఁబవిత్రమహోత్తమ మంత్రరాజమి
య్యదికడుసుందరంబనుచు ఁబావనినామము లిర్వదేడునున్
హృదిఁదలఁపన్ విషూచిమొద లేరుజయుంగనరెవ్వరీభువిన్ 44

కం. అనుచును నిరువది యేడగు
హనుమచ్ఛు*భనామపఠన మందలిశక్తిన్
వినిపించుచు నాసుందర
హనుమన్మంత్రంబుఁదెలిపి యాతండేగెన్ 45

---

(1,2,3,4,5. పరాశరసంహిత. 38)

*హనుమంతుని, ఇరువది యేడు నామములు.

1. హనుమా 2. నంజనాసూను 3. ర్వాయుపుత్రో 4. మహాబలః। 5. కపీంద్రః 6. పింగళాక్షశ్చ 7. లంకాద్వీపభయంకరః॥ 8. ప్రభం జనసుతో 9. వీర 10. స్సీతాశోకవినాశకః। 11. అక్షహంతా 12. రామసఖో 13. రామకార్యధురంధరః॥ 14. మహౌషధిగిరేర్హారీ

ఆ.వె.కామరూపలంక నామెసోదరిఁగెల్చి
హనుమ ముదముగాంచి యపుడెకోట
గోడ ౖదూకె సీతజాడఁ గనఁగనెంచి
వీధి తెఱువువీడి వీరుఁడగుట 46

ద్వి. వైరినిర్జింపంగఁ బరపురిఁజొచ్చు
వీరుండుద్వారాన వెడలంగరాదు 47

ద్వి. అనునీతినెఱిఁగిన యాంజనేయుండు
సనెగోడదూకి నిశాచరపురికి 48

ద్వి. పగతురతల మీఁద ౖబాదంబువెట్టు
పగిదిలంకహనుమ పాదంబుఁబెట్టె 49

సుగంధి.
వామపాదముంచెముందు వైరిపట్టణంబునన్
ధీమహుండుశాస్త్రరీతి ధీరనీతిచొప్పునన్
సోమువెల్గునందు జూచుచుండె గోతిపిల్ల,ఆ
వ్యోమమంటుసౌధరాజిఁ బోవుదారిప్రక్కగా 50

తే.గీ.ఆ పరాశక్తిఁగననెంచు నతులయోగి
దేహముజయింపవలెనన్న తీరుగాగ
లంకనుజయించిమారుతి లంకఁజొచ్చె
జంకుకొంకునువీడుచు సంచరింప 51

ఆసుర క్రౌంచ - హనుమ

ఉ. అంతట లంకలోనఁగల యాసురిక్రౌంచ సమీరసూను నా
వంతయుభీతిలేనికపిఁ జయ్యన గాలును బట్టియాడ్చెనీ 52

---

15. వానరప్రాణదాయకః 16. వాగీశతారకశ్చైవ 17. మైనాకగిరి భంజనః 18. నిరంజనో 19. జితక్రోధో 20. కదళీవనసంవృతః 21. ఊర్ధ్వరేతా 22. మహాసత్త్వ 23. స్సర్వమంత్రప్రవర్తకః 24. మహాలింగప్రతిష్ఠాతా 25. బాష్పకృజ్జపతాంవరః 26. శివధ్యాన పరోనిత్యం 27. శివపూజాపరాయణః. (పరాశరసంహిత 26 పటలం. ఉమా. సం. 11 అధ్యా )

వెంతటిసాహసుండవిట కేపనివచ్చితినిన్ను మ్రింగినీ
యంతముసూతు లంకనగరాంతరముం బరిరక్ష నాయదే

కం. అనుచునీ్భకరనాదం
బునహనుమంగనిపలుకఁగ మోదెనునాక్రాం
చనువడిఁజచ్చెడిరీతిగ
మునుసింహికగతినిబోవ ముందునకరిగెన్ 53

తే.గీ.లంకవెలుపలలోపల రక్షసేయు
గ్రామదేవతలగువారి గర్వముడిపి
[1]మువురరాక్షసనారుల మోదిగెలిచి
రథ్యవెంబడిస్వేచ్ఛమై లంకజొచ్చు 54

తే.గీ.[2]నైజశత్రువులనుగెల్చి రాజయోగి
లంకలోరాజవీధుల జంకులేక
దిరిగి,ముత్యాలతోరణాల్ఁ దేజుతోడ
రథ్యలనుగాంచివిస్మయ రాశియయ్యె 55

మాలిని, తీరిచిదిద్దినసౌధగృహంబుల తీరునుజూచిముదావహుఁడౌ
మారుతివీధులపెన్రవమొప్పఁగ మాటలనాడెడిరక్కసులన్
దోరముగామధుపానమునంగడుఁ దుష్టినిద్రుళ్ళుచులేచుచుసం
చారమొనర్చెడిదైత్యులఁగాంచెడిఁ జంద్రునివెన్నెలలోఁ
జనుచున్ 56

ద్వి. రాణివాసస్త్రీల లలితగీతాలు
వీణాస్వరంబున వినునింపునింప 57

దోదకము. చక్కనిపాటల శ్రావ్యముగాగన్
దిక్కులనంటెడి దివ్యనినాదం

(1, 2 శివ రా.)

1. (మువురరాక్షసనారుల దారేషణ-ధనేషణ, పుత్రేషణ-ఈషణ త్రయముల గెలిచి)

2. (అరిషడ్వర్గములు)

బెక్కువగావిని యేగెడిరథ్యన్
జుక్కలతేజును జొచ్చుచు లంకన్ 58

దోదకము. అందపునారుల అందెలుగజ్జల్
సందడిసల్పుచు జక్కగద్రోవన్
విందౌనగూర్చుచు వేచనువారిన్
[1]సుందరుడెల్లెడ జూచుచునుండెన్ 59

తే.గీ.రాజవీథుల రాత్రుల రక్షసేయ
నాయుధంబుల ధరియించి యచ్చటచట
నిలిచియుండినసైనిక నివహములను
గనికపి,కిశోరమేగెడి గానరాక 60

ద్వి. కనిగూఢచారుల కనుకట్టురీతి
హనుమయేగెడివారి కనులగప్పుచును 61

తే.గీ.వేణువీణలగాత్రాల వివిధరీతి
చెవులకింపుగ బాడెడి స్త్రీలపాట
విమలసుస్వరయుక్తమౌ వేదఘోష
వినుచుజనుచుండె రథ్యను వీరహనుమ 62

తే.గీ.వేదమంత్రాలజపియింప వెడలుఘోష
పెద్దగొంతెత్తితమతేని విహితరీతి
స్తవమొనర్చెడి రాక్షసస్వనమునొకట
వినుచుముందునకేగెడి వీరహనుమ 63

తే.గీ.క్రిక్కిఱిసియున్నరథ్యల గీశవరుడు
పెన్నినాదంబుసల్పుచు వెడలువారి
సుందరులనుగురూపుల జూచుచుండి
ముందునకుసాగుసీతమ్మ మూర్తి గనగ 64

సీ. మిడిగ్రుడ్లువంకర మేనులుకోఱలు
పాఱపండ్లును గలవారినొకట

---

1. సుందరుడు—హనుమంతుడు.

కాలుచేతులుపొట్టి గాగలకుబ్జల
బహుదీర్ఘవక్త్రులౌ వారినొకట
లంబోదరులభీకరాకృతిభయుమలై
పకపకనవ్వెడి వారినొకట
మధుపానమత్తలై మగవారిభుజములఁ
బట్టుచునానెడి వారినొకట

తే.గీ.గార్దభస్వనంబులఁ బాడి గంతులిడుచు
రథ్యలందునఁదిరుగాడు రక్కసులను
గాంచునేకానిసీతమ్మఁ గమలనేత్రఁ
గనఁగఁజాలమి చింతించు హనుమయంత 65

తే.గీ.హనుమ ముండితశిరములఁ గ్రాలువారి
దీక్షితులజటాధారణ దీక్షవారి
ఎద్దుతోలుఁగట్టినవారి హద్దుమఱచి
చనుదిగంబరులౌవారిఁ గనుచుఁజనును 66

తే.గీ.అంత నభిచారకక్రియ నరులఁజంపు
మంత్రముల హోమముల్ సేయు మాంత్రికులను
దర్భలే యాయుధములుగఁ దనరఁజేయు
దర్భముష్టులుగలవారి; దారిఁగనుచు 67

తే.గీ.ఆ నిశాచరపురి నెవరేనిఁగాని
గుఱుతుఁబట్టగఁజూడరు గొల్లుమనుచు
వారివారలకగురీతి దారులందు
మేళతాళాలఁజొక్కుచు మెలఁగువారు 68

**కోటలోఁ బ్రవేశించుట**

సీ. పద్మములనఁబడు బహుసుందరాకృతి
వెలయుగృహంబుల వీధి గనుచు
వర్ధమానంబని వరలు ధనప్రద
రాజసౌధావళి రథ్య గనుచు

స్వస్తికంబనఁనొప్పు సంతానసంపద
తుందిలవాసముల్ త్రోవఁగనుచు
ఐరావతములన నలరారువజ్రాప్త
ధవళనిలయరాజి దారి గనుచు

తే.గీ.సిరియుసంపదఁదులఁదూఁగు నరిపురంబుఁ
గనుచుసంతోషమొందుచు హనుమవెడలు
రక్షకశ్రేణిఁజూచుచు రాజవీథిఁ
బరులుచనుఁ జూడని,విధానఁ బ్రక్కలందు 69

చం. అటునటుపోయి రావణగృహాంగణమున్ శిఖరాగ్రమందునన్
దిటమగుకోటగోడగల దివ్యతమోరువిలాసవంతమున్
జటులసువర్ణతోరణవిభాసురమున్, బరిఘావృతంబునున్
బటుతరశక్తియుక్తుఁడగు వాయుసుతుండుగనెన్ముదంబునన్ 70

ద్వి. అందాలచందాల నలరారుకోట
చందురువెన్నెలఁ జక్కగానుండె 71

ద్వి. నడిరేత్తిశిథియుండి యిడుచుండఁగాంతి
వడివడి, యిల్లిల్లుఁ బనివడిచొచ్చి 72

ద్వి. గబగబవెదకుచుఁ గాంచలేదాయె
నబలను సీతమ్మ నందెందుఁగాని 73

ద్వి. భర్తలతోఁగూడ బవళించుమంచి
వర్తనగలయట్టి భార్యల గాంచు 74

ద్వి. లేదులేదీయిండ్ల లేదులేదనుచు
కాదుకాదీయిల్లు కమలాక్షియునికి 75

ద్వి. అనియెంచివెదకుచు హనుమంతుఁడంత
వనములగృహములఁ గను సీతఁజూడ 76

తే.గీ.కానరామికిఁజింతించి కడకుఁజొచ్చి
కుంభకర్ణునియింటిలో గూడ, గాఢ

నిద్రమత్తిల్లి గిరివోలె నెగడువానిఁ
గాంచి, మరలి విభీషణు గడపనెక్కి- 77

ఆ.వె.హరిని సంస్మరించి యారాధనము సల్పు
విష్ణుభక్తుఁ డావిభీషణుఁ గని
వెదకి ఇంద్రజిత్తు వీడును, ముఖ్యులౌ
వారి గృహములన్ని వరుసగాగ 78

కం. మయని.ర్మితమా యని, వి
స్మయముసు గలిగించు రాక్షసప్రభు గృహమున్
స్వయముగ సుందరమగు ప్ర
క్రియతో మనువిశ్వకర్మ కృతముం గాంచెన్ 79

తే.గీ.దైత్యకులపతి మందిరాంతరముఁ జొచ్చి
యచటఁ గలవస్తుసంచయ మంతఁ జూచి
విస్మితుండయి సీతమ్మ వెదకఁ బూని
పలు తెఱంగుల స్త్రీల నవ్వాడఁ గాంచె 80

మానిని.కొందఱు జేని సమీపమునందునఁ
గూర్చుని యెందిరి గాఢముగా
కొందఱు కావలగాయుచుఁ జేతులఁ
గూర్చిరి శూలము, ముద్గరముల్
కొందఱు, శక్తిని, తోమరముం గొని
కూరిమి రక్షణ నుండిరి, వా
రందఱు స్త్రీలహ! వారల మారుతి
యారసి జానకి లేదనుచున్ 81

కం. అంతట రావణుఁ డుండు గృ
హాంతరముం జొచ్చి కాంచె హనుమంతుఁడటన్
వింతగ లోకంబుల గల
సంతోషప్రదసువస్తు సంతతి నెల్లన్ 82

మానిని.ఎచ్చటఁ జూచిన బంగరువస్తువు
లేకలవచ్చటఁ గావలివా

రచ్చపు మేలిమియాభరణంబుల
నందముగా ధరియించిరి వా
రిచ్చమెయిన్; రిపుసంహరణంబొన
రింపఁగలట్టి మదేభములన్
మెచ్చగురక్తహయంబుల వేలుఁగ
మేడల మిద్దెలఁ గాంచుచున్ 83

తే.గీ. చిన్నవియుఁ బెద్దవియు గదు లెన్నిక గను
సావిడులు గూడియొప్పు నిశాచరేంద్రు
భవనమందున మధుపాన బహుళపాత్ర
ములు, విచిత్రవస్తుతతి సంకులముగనుచు. 84

ద్వి. చక్కనిచుక్కల సౌందర్యవతుల
పెక్కుఱఁ గనెనందు వీరుండుహనుమ 85

ద్వి. అటునిటు నడిచెడి యాస్త్రీలకాళ్ల
తటుకుతటుకున మృదంగంబురీతి 86

ద్వి అందెలుగజ్జెలు హాయిఁగమ్రోయ
సుందరులందఱఁ జూచుచుఁజూచి 87

ద్వి. కనుఱెప్పవేయకే గాంచువారి
జనకజ లేదాయె ననియెంచి యెంచి 88

ద్వి. లలితలతాగృహరాజిని జొచ్చి
వెలుపలలోపల వెదకుజానకిని 89

ద్వి. అటుమిద్దెమేడల యందెల్లఁదిరిగి
పటుతరోత్తమ రాజభవనంబుజొచ్చె 90

సీ. వరకాంతిమంతమౌ వైడూర్యరత్నాల
స్థగితంబులౌ గవాక్షనిచయములు
క్రీడార్థముగఁగిటికీలయం దుంచిన
పలురంగులీనెడి పక్కిగములు

బంగారుపాన్పులు స్వర్ణపీఠంబులు
దారునిర్మిత పర్యంకాగ్రచయము
ప్రకృతిసౌందర్య వికాశితంబులు కడు
లీలగాఁగల చిత్రలేఖనములు

తే.గీ. అందచందాలఁదనరారు నాతువాండ్రు
వన్నెచిన్నెలమెఱసెడి పడుచువారు
వేనవేలుగ నుండిన వివిధ మంది
రాంత,రమ్ముల హరి కిశోరంబుదిరుగు. 91

చం. తిరిగి సమీరనందనుఁడు తీవ్రగతి న్భవనంబులన్ని, యే
యరమరలేకసుందరుల సంగనలంగని యేరియందునన్
ధరణిసుతా విలక్షణవిధాన మొకింతయుఁగానలేమి యా
దరిఁగలపెన్విమానమున ధాత్రిజఁగాంచగఁజొచ్చెఁజయ్యనన్ 92

విమానమును వెదకుట

ఉ. మున్నుకుబేరు గెల్చి యనిఁ బొందిన దివ్యవిమానరాజముం
గన్నుల విందుసేయు గనకప్రతిభాసితసుందరంబునున్
మిన్నున, గాలి యానము;నమేయముదప్రదమౌచు నొప్పగాఁ
దిన్నగనెంతదవ్వయిన దేలికగాఁజను పుష్పకంబునున్ 93

ఆ.వె. ఎంతమందినైన నెక్కించుకొనిపోవు
శక్తిమంతమును విశాలమునయి
దివ్యభవన మనగఁ దేజరిల్లెడు పుష్ప
కమువిమానమెక్కె గపివరుండు 94

చం. అతులిత చిత్రలేఖనమునందు, లతా తరు, గుల్మ పుష్ప సం
తతి మృగపక్షులున్ బహువిధానముగా బలురంగులందు సం
గతమయి సుందరంబగుచు గానఁగనైన విమాన మెక్కె మా
రుతి యట నాల్గుదిక్కులను రోయుచు రాముసతీనిమిత్తమై 95

ఉ. అందము చిందులాడు వనజాక్షులు సుందరమోహనాంగులం
దెందఱినో విలాసినుల నేర్పడఁ జూచునుగాని సీతనా
యిందిరలక్షణాన్వితను నెందున గానక రాక్షసేంద్రుభా
గ్యేందిరమాత్రమే పురిని గానఁగనౌటను విహ్వలాత్ముఁడై 96

ఉ. ఇంతటి భాగ్యయోగ్యము లహీనముగా గలవాఁడునయ్యు వే
దాంతమెఱింగి వేదముల నధ్యయనం బొనరించుచుండియున్
సంతత మంత్ర హోమ జప సద్విధి బాయనివాఁడునయ్యు.వీ
డెంతటి ఘోరకృత్యమిటు రేగతిఁ జేసె! హరించె భూమిజన్ 97

సీ. వేదవేదాంగాది విద్యాప్రవీణులు
యజ్ఞయాగాది కర్మానుచరులు
నిత్యాగ్నిహోత్రాది నియమ ప్రవిష్టులు
మంత్ర తపోధ్యాన మహితవరులు
ధర్మాచరణదక్ష ధార్మికమూర్తులు
పరశక్తి గొల్చెడి పరమవిదులు
పుణ్యాత్ము లగువారు పూతాత్ము లగువారు
తపసు సిద్ధించిన ధన్యతములు

తే.గీ. పలువు రున్నార లీమహాపట్టణమున
కాని శుచియె శూన్యంబు లంకాపురాన
రక్త మాంస కంఠర మద్యసక్తమైన
యిచట సిరి యెట్లు నిలిచెనో! యెఱుకరాదు! 98

ద్వి. అని లోనఁ దలపోసి నసురుల నెంచి
గనుచుండె యందందు గల యందములను 99

తే.గీ. కనక, రజత రత్నమయాశ్వ గజములాది
జంతుసంతతి ప్రతిమలు చాల గలవు
రంగురంగుల శృంగారరాశియనఁగ
నా విమానమందున వాని హనుమ గనుచు 100

తే.గీ. ప్రకృతిసౌందర్యరాశినిఁ బట్టితెచ్చి
యావిమానమునం దుంచినట్టిరీతిఁ
జిత్రపటములు గలవు, విచిత్రగతుల
నొప్పువాని గని హనుమ తెప్పరిలఁడు 101

ద్వి. నిజముగు లక్ష్మియే నిలిచియున్నటుగ
గజలక్ష్మిచిత్రంబు గలదాని గనుచు 102

ఉ.: మానితమౌ విమానమున మారుతి చిత్రవిచిత్రదృశ్యముల్
గానఁగనయ్యె మోదమును గాంచఁడు, మేల్భవనం బనందగున్
దాని, గలట్టి, రావణునిదర్పము భాగ్యము దాటు చోటులన్
జానకి నెంతయో వెదుక జాడ లభింపమి ఖేదమూర్తియై 103

తే.గీ. ఎంత దిరిగిన రావణుం డేడ గలఁడొ
చూడఁజాలమి సీతమ్మ జాడఁ గనమి
ఆవిమానాగ్ర మెక్కి యందంత పీల్చి
మంచివాసనఁ బ్రసరించు మారుతంబు 104

ఉ. వండిన పిండివంటల సువాసనలం గొని గంధవాహనుం
డుండుటచే, సమీపమున నొప్పగ నుండగవచ్చు, రావణుం
డుండెడి మందిరంబనెడి యూహ జనింపఁగజేయు బంధువై
యుండగ వాయుదేవు డపు డప్పటి వీచుట, వాయు
సూనుఁడున్ 105

తే.గీ. ఎన్నియో సౌధములు గల్గి తెన్నుఁ గనని
యటుగనరయామడ వెడల్పు నామడ నిడు
పైన రావణేశ్వరు మహాభవన మంత
మరల వెదకుచు గలయంగ తిరిగితిరిగి 106

తే.గీ. సీత గనఁజాలమిని చాల చింతఁ దుదకు
రాక్షసేశ్వరు నంతఃపురంబుఁ జేరి
బలిమి దెచ్చిన కన్యలు భార్యలుఁ గల
యబ్ధి యననొప్పు నద్దాని నతఁడు గాంచె 107

తే.గీ.లచ్చియిల్లనఁ దోచు నారాజగృహము
సుందరాకారముననొప్పు మందిరంబు
సతులసుఖదంబుఁ బంచేంద్రియంబుల కగు
దాని రాక్షసేశ్వరుఁ డుండుదాని గాంచె 108

ఆ.వె.అమరవిభునివాస మమరావతి యనంగ
బ్రహ్మలోక మనఁగఁ బఱఁగుదాని
దీపకాంతి, దైత్య తేజుభూషణముల
వెలుఁగును గలిసె గదిని జ్వాలనరీతి 109

తే.గీ.మమత రతి దేలి, మధుపానమత్త లగుచు
నొడలు మరుపొంది నిదురించుచున్నవారి 110
కలువకన్నుల జవరాండ్రఁ గంజముఖుల
వేయిమందిని గనె, నాంజనేయుఁ డచట

తే.గీ.పలురకంబుల కోకలు పైడినగలు
గలిగి నిశ్శబ్దముగఁ జిత్ర కంబళమునఁ
బవ్వళించి, భ్రమరహంసవారము గల
కమలవనమన దోపించుఁ గంజముఖులు 111

తే.గీ.గగనమున దారలంగూడి క్రాలు శశిగఁ
బుడమిఁ బడినట్టి చుక్కల వోలు స్త్రీలఁ
గూడి యొప్పు నా రావణుఁ జూడగలిగి
యచటఁ గల సుందరాంగుల నరయు హనుమ 112

సీ. పూలమాలలు మెడఁ బొలుపుగా నుండక
స్థానచలనమైన జవ్వనులను
తిలకంబు, మాసి,యందెలు గడుఁ జెదిరి మో
కాళ్ళనంటుచుఁగల కామినులను
వస్త్రముల్ విడఁగ నాభరణంబు లిటునటు
పడ నిద్రఁ బొర్లాడు భామినులను

గజఘట్టనమువల్లఁ గదలి నేలకు డుల్లు
సంఫుల్లలతవంటి శశిముఖులను

తే.గీ.ఒండొరులతోడ ఱొమ్మను దిండుగాగఁ
గొనుచు గాఢనిద్రను గను వనితల గను
సర్వలక్షణసంపన్న జనకసుతను
మాత్ర మవ్వారి గనఁడాయె మారుతి యట 113

తే.గీ.కామవశలైన రాజర్షి కన్యకలను
దైత్యవనితల, పితృదేవతల సుతలను
వలచి రావణుఁ బ్రేమించి వచ్చియున్న
వారి గంధర్వభామల మారుతిగను 114

తే.గీ.అనికి మొనగాఁడు తానౌట నపహరించి
బలిమిఁ దెచ్చిన కన్యలు వారు, రాక్ష
సేంద్రు మోహించియుండిన యింతులే యటఁ
గలరు పరులభార్యలు లేరు గాయటఁ గన 115

చం. సురుచిర రూపసంపదల శోభను రావణుభార్యలందఱుం
బరమసుఖంబునం దనరు వారలఁ గాంచునె కాని జానకిన్
వరగుణసీత రాఘవునిభార్యను గాంచఁడు వాయుసూనుఁ డా
సురు,భవనంబునందు వగచుం బృథివీజ దలంచి నెమ్మదిన్ 116

మ. తన యిల్లాండ్రను గూడి రావణుఁడు నిత్యానందుడై యుండెఁగా
తనరీతిన్ సుఖమొంద రామునకు సీతాదేవినర్పించుచో
గనవౌ రావణుఁడున్ శుభంబె; యని యాకాంక్షించు సద్బుద్ధియై
హనుమంతుం డెద, నంగనావృతుని దైత్యాధీశ్వరుం
జూచుచున్ 117

ఉ. రావణురీతినే యతని రాముల పత్నుల దొంగిలింప సు
గ్రీవునకే శుభంబె, యసురేశ్వరుఁ డప్పు డెఱుంగనౌను సీ
తావసుధాసుత న్స్వామి దా, హరియించిన దుష్ఫలంబుగా
పావని సాధుబుద్ధి నిటు భావన జేయుచు చూచు రావణున్ 118

చం. ఇటఁ గల భార్యలందఱను నేగతిఁ జూచుచు నున్నవాఁడొ, తా
నటు గనె సీత నెంచునెడ నా సురనేతకు మంగళంబె?ఆ
చటులసువర్ణ,కాంతమగు జానకి దివ్యపతివ్రతామణిం
బటుతర బాహుశక్తిమెయి బల్మిని దెచ్చుటయే తలంపునో! 119

ఉ. చూచితి రాక్షసేశ్వరుని సుందరభార్యల, నిప్డె చూడఁగా
నోచితినేని జానకిని నోము ఫలించెడి నాకు, శిష్ట,కా
ణాచి సమస్తసద్గుణ గణంబుల కామె, విశిష్టమూర్తి, యీ
యోచన యేల? గాంచ నిట నుర్విజ, రాఘవుధర్మపత్నినిన్ 120

ఆ.వె.ఇచటి స్త్రీలకంటె నెన్నికఁ గన్నది
సీత వీరిగూడి చెలఁగునొక్కొ!
ఎట్టిదానిఁ దెచ్చెఁ బట్టి రావణుఁ డహా!
ఏల దుష్కృతంబు నిటుగఁజేసె? 121

తే.గీ.అనుచుఁ జింతించి మారుతి యందునిందుఁ
గనుచు శయనగృహంబును గాంచి రక్క
సుల విభునిమందిరంబునఁ జెలఁగునొక్క
స్ఫటికరత్నమణిమయంబు శయ్యఁ గాంచె 122

తే.గీ.మంచిముత్యాలమాల, లమర్చియున్న
చంద్రురీతిని దెల్లనౌ ఛత్రముఁగను
శయ్యతలవైపు సుందర చామరముల
నందకత్తెలు వీచుచు నచట నిలువ 123

ద్వి. ఆపాన్పుపై మందిరాంతరమందుఁ
జూపట్టె నల్లని యేపైన తనువు 124

ద్వి. ఎఱుపగు కన్నులు నెట్టచందనము
మెఱుపుల మొయిలన మే నున్నవాని 125

ద్వి. మేరుపర్వతరీతి మేఘవర్ణాన
చారుకుండలధారి శయనించియుండె 126

ద్వి. పొడువైన చేతులు మోకాళ్ళవఱకుఁ
దొడలఁ దాటుచునుండఁ దోరంపు నగల 127

ద్వి. కామరూపుండగు కాంతిమంతుండు
కామినీప్రియుఁడయి క్రాలెడివాని 128

ద్వి. రాక్షసకన్యల రంజింపఁజేయు
దక్షుఁడౌ రావణ దైత్యపాలకుని 129

ద్వి. ప్రమదంబు నిడు ధూపపరిమళములను
సుమవాసనలు మందిరము గుబాళింప 130

ద్వి. నిదురించు బాముని నిట్టూర్పువిడుచు
విదితుండు రావణువీరుని గాంచి 131

ద్వి. హనుమంతు డేగె నాతనిచెంత కంతఁ
గనునేమొ యను భీతి గదలి వేమఱలి 132

ద్వి. వేరొక్కతావున వీరుండు నిలిచి
దూరమందుండి దైత్యుల పతిఁ జూచు 133

ద్వి. పాదమూలంబున భార్యలం జూచు
మోదాన నుపచారములు జేయువారి 134

ఉ. ఆదరి పవ్వళించిన మహాలలితాంగులు స్త్రీలయందు స
మ్మోదముగూర్చి సీతయను బుద్ధి జనింపఁగఁ జేయుదానిమం
దోదరి సుందరాంగిని గనుం గపివర్యుఁడు, రూపరేఖలం
దేదియు లోటులేని వదియేయగు సీత యటంచు నెంచెడున్ 135

తే.గీ. సీతయే యీమెయని సంతసించె దొలుత
కాని వికలాత్మ విడి యంతలోన హనుమ
వేరువిధమునఁ దలపోసె విమలసీత
యెటుగ నిట నుండునంచని యెంచఁగడఁగె 136

ద్వి. ఈమూకలో సీత యెటు లుండునొక్కొ
ఏమూలనో దాచె యీరక్కసుండు 137

తే.గీ.యోగి యణిమాదిసిద్ధుల యోగసిద్ధి
యనుచు భ్రమ సెందురీతిగా హనుమగూడఁ
గనుచు మండోదరిని సీతఁ గాగఁ దలఁచి
యంతలో భ్రమ దొలఁగి సత్యంబునెంచె 138

ఉ. రాముని బాసి సీత నిదురం గనఁజాలునె భూషణంబులి
ట్లేమని దాల్చు? వీ డశనమున్, సురపానముఁ జేయఁబూనునే
కాముకురాలు గాదు సురకాంతునినైనఁ బరు న్వరింప దీ
భామిని సీత కాదనుచుఁ బావని నిశ్చితబుద్ధిమంతుఁడై 139

ఆ.వె.వెదకివెదకి నిశిని వేసారి మారుతి
పానశాలఁ జేరి పాఱజూచు
నొళ్ళు తెలియకుండ నూగుచుఁ ద్రుళ్ళుచుఁ
బడుచు లేచు రూపవతులఁ గనుచు 140

ద్వి. మధువుతో నిండిన మహితపాత్రంబు
లధికంబుగాఁ గల యా పానశాల 141

ద్వి. వెండిబంగరు గిన్నె లుండిన వచట
పిండివంటలు గల వెన్నియో రుచుల 142

ద్వి. మృగ పక్షి మాంసంబు లెన్నెన్నొ గలవు
యిగురులు రసములు తగురీతిఁ గలవు 143

ద్వి. పాయసంబులు బహు ఫలసంచయంబు
కాయలు గూరలు గల పానశాల 144

ద్వి. పాడుచు నాడుచుఁ బలుకాడువారు
చేడియ లుండిరి వీడుచు సిగ్గు 145

ద్వి. అందాలచందాల హాసంబువారి
సుందరీమణులను జూచునేగాని 146

ద్వి. కనఁజాలఁ డాయె భూతనయ నిచ్చోట
గనుచుండి పరనారులను మాత్ర మచట 147

ద్వి. ఆపానశాలయం దంత ద్రిమ్మరుచుఁ
గోపాన దుఃఖానఁ గ్రుంగుచు హనుమ 149

ఆ.వె.బ్రహ్మచారినగుచుఁ బరకామినుల గాంచి
కలుష మిపుడు మూటఁ గట్టికొంటి
పాప మొందితి నని భావించి భావించి
కాదు లేదని నెమ్మదిఁ గాంచు శాంతి 150

తే.గీ.కర్మకంటెను ముఖ్య మాకర్మ సేయు
భావముకద! నాహృది పాపభావ మేది
లేదు, పరకామినుల జూడలేదు దుష్ట
బుద్ధి; సద్దాన దురితంబు పొసగునొక్కొ! 151

తే.గీ.ఇదియు రోయగాఁ దగునెల విందుగాక
ఏడనుండును నిది స్త్రీలవాడగాన
దాశరథిభార్య వెదుకంగఁ దలఁచినాఁడ
గాని పరకామినుల జూడఁ గాదురాక 152

హనుమంతుని నిరుత్సాహము

తే.గీ.ధైర్యము వహించి, దేవ గంధర్వ నాగ
కన్యల వెదకి, వేసారి కానను సీత
ననుచుఁ జింతించి పానశాలను విడి చని
యితర శయనగృహంబుల నెల్ల వెదకి 153

ఉ. పూవిలుకాని గెల్చు బలముం దపముం గలవాఁడె వీఁడు తే
జోవిభవంబుగా, నిటు వసుంధరనాథుని సుందరాంగిపైఁ
దా వలపూని దెచ్చి యెట దాచెనొ? సీత నహో? వినాశకా
లే విపరీతబుద్ధియని, పలింతురు ప్రాజ్ఞులుగూడ నిట్టులే 154

తే.గీ.ఆమె నెచ్చట దాచెనో యసురవిభుఁడు
బ్రతికియున్నదియో లేదొ? రాముభార్య
చంపియుండఁడుగద నామె జనకసుతను
ఆపతివ్రత రావణు నంటఁ గనమి 155

తే.గీ.చెవులు చేటలవలె నుండు చెనటులఁ గని
విక్రృతరూప వేషంబుల వెలదులఁ గని
రావణుని భార్య లందుండి రాఘవుసతి
భీతిఁ జెందుచుఁ బ్రాణంబు వీడెనేమొ! 156

ఉ. అంతిపురంబునందు గల యా సురనాథుని భార్యలందఱన్
గాంతల నెల్ల వారిఁ గని, కాంచనుగా జనకాత్మజాత, నే
కాంతపు వాడలన్ని దిరుగాడితి బ్రిమ్మరినాడ వీథులన్
శాంతిని గాననైతి రఘుచంద్రునిభార్యను గాననైతిగా. 157

ఉ. సీతను జూచివచ్చెదను శీఘ్రముగానని చెప్పినాడ. నా
నేతకు, రామమూర్తికి వనీచరముఖ్యులకెల్ల, లంక నా
పూతను జూడకే మఱలిపోవుచు వారిముఖంబు లెట్లు నే
జూతు గృతార్థతం గనక జూచెద నింకను నెల్లవాడలన్ 158

తే.గీ.ఆయనిర్వేదమే మూల మరయసిరికి
ఆయనిర్వేదమే సౌఖ్య మరయనిచ్చు
ఆయనిర్వేదమే సకలార్థకరము
స్వీయకృతకర్మఁ బట్టియే సిద్ధిగలుగు 159

ద్వి. దీనత్వమును వీడి తేఁకువతోడఁ
బూనిన కర్మలఁ బొందనౌ సిద్ధి 160

ద్వి. అని యిటునటుఁ జొచ్చి యనిలసూనుండు
కనఁజాలనట్టి భూగర్భమందున్న 161

ద్వి. మందిరంబులఁ జొచ్చి మహిజకై వెదకు
అందెందునుంగాని యామెను గనక 162

ద్వి. మున్ను వెదుకనట్టి ముంగిళులన్ని
తెన్ను గాననియట్టి తెఱవుల నన్ని 163

ద్వి. కుప్పించి దూకుచు గొప్పవైన చోట్లఁ
జప్పుడు గాకుండ నొప్పుగా వెదకె 164

ద్వి. ఎగురుచు, దాటుచు నెక్కుచు దిగుచు
మిగిలిన తావుల మేలుగా వెదకి 165

ద్వి. తలుపుల కిటికీలఁ దా నంత దెఱచి
వెలుపల నిలుచుచు వీక్షించుచుండి 166

ద్వి. రావణాంతఃపుర రాజి నెల్లెడలఁ
ద్రోవల గదులను దొట్టికట్టులను 167

ద్వి. బెత్తెడు తావైన రిత్తవోకుండ
చిత్తంబు శమియింప సీతమ్మవెదకె 168

సీ. విద్యాధరస్త్రీల వీక్షించెనేకాని
రాఘవేంద్రుని ప్రియురాలు లేదు
అల నాగకన్యల నటఁ జూచునేకాని
సింగంపు నడుమొప్పు సీత లేదు
దేవతానారులఁ దేరిచూచెను కాని
వైదేహి జనకునిపట్టి లేదు
అందకత్తెలఁ జూచు నెందఱనో కాని
కమలాక్షి సుందరి కనఁగలేదు

ఆ.వె. ఎందుఁ జూతు నింక నింకెందు వెదకుదు
వనచరాధిపుకృషి వ్యర్థమాయె
జలధిలంఘనంబు సలిపిన నా శ్రమ
కడలిఁ గలిసె సీతఁ గాననైతి 169

కం. అనుచున్ దుఃఖితుఁడై యా
హనుమంతుఁడు కోటగోడ కంతట నెగిరెన్
గని యిటునటు సీతమ్మను
గనజాలమి చిత్తమందుఁ గలవరపడుచున్ 170

మ. మును సంపాతి, వసుంధరాసుతను గొంపోయెన్సుమా రావణుం
డని చెప్పెంగడ, కాని లంక నెట నా యమ్మం గనంజాలనే

జనియించెంగద సీతయౌచు జనక క్ష్మానాథుసత్పుత్రియై
మనుచున్ రామునిభార్యయై యెటుగ దుర్మార్గంబునం దుండెడిన్ 171

తే.గీ.కామవశునకు జిక్కియుఁ గామవశత
లోకకంటకుఁ గోర్కెకు లోబడునొకొ!
రామబాణభయంబున రక్కసుండు
వేగముగ బాఱ, భువి బడి వీడెనో మెయి! 172

ద్వి. ఆకాశమార్గాన యాసురుం డామె
నేకాకినిం దెచ్చె నేడ్చెడిదాని 173

ద్వి. దారిలో జలనిధి దాటుచు భీతి
జారెనా నీటిలో జావంగ నెంచి 174

తే.గీ.రావణుఁడు భుజంబులక్రింద రాముసతిని
బలము,తో బట్టి వేగ రా నలిగినలిగి
ప్రాణముల బాసెనా? లేక రాక్షసుండు
నిజపతివ్రతాధర్మమ్ము నిలుపుకొనెడి 175

తే.గీ.ఆమె భక్షించియుండెనా? అది సహజము
లేక రాక్షసేశ్వరుభార్యలే, దురూహఁ
జేసి, దుష్టలై యామె భ క్షించియైన
నుండవలయు సీ.తమ్మ దా నుండ దిలను 176

శా. హారామా? రఘురామ? లక్ష్మణ? అయోధ్యా యంచువైదేహి ఆ
త్మారామున్ సుగుణాభిరాము, సఖు భర్తం జిత్తమం దెంచుచున్
శారీరంబుఁ ద్యజించెనేమొ! జనకక్ష్మాభర్తకుం బుత్రియై
వైరాగ్యంబున మున్గితేలెడి మహావైదుష్యముం గల్గియున్ 177

ఆ.వె.కానిపట్ల దైత్యకాంతుని యింట నే
పంజరంబునందుఁ బడినశారి
కవలె రోదనాగ్నిఁ గనలుచుండినదేమొ!
యనుచు నార్తిఁ బడుచు హనుమ దలఁచు 178

చం. జనకుని కూతురై ధరణి జాతయునై, కమలాయతాక్షియై
యినకుల రామచంద్రుసతి యేగతి లోఁ బడునొక్కొ దైత్యరా
జునకుఁ ధరాత్మజన్ సుగుణ శుద్ధ, నధోభువనంబునందు డా
చెనొ: పడెనో సముద్రమునఁ జీవము వాసెనొః సీత
యక్కటా 179

ఉ. ఏమనువాఁడ రాఘవున కేమ వసించెడి సీతయన్న, సీ
తామహితాత్మఁ జూచు సుకృతంబు లభింపదు నా కటంచు నా
రామునకున్ సతీహితపరాత్మునకుం దెలుపంగ దోషమే
స్వామికిఁ దెల్పకుండినను సంభవ మౌగద దోష
మప్పుడున్ 180

ఉ. చెప్పిన సీతగాధ మఱి చెప్పకయున్నను దోషమే యగున్
గొప్ప ఘటింప దేమియు నిగూఢముగా నిక దాచుటెట్లుః రా
మప్రకు విన్నవింపకయె పొగవ కాఁగలయట్టి కార్య, మే
చొప్పునసైన, నం. చనిలజుం డెద నెంచెడు వ్యర్థజీవిగా 181

ఉ. ఏమి ప్రయోజనంబు కలదే నిటనుండి పురంబుఁ జేర, నూ
జామడ యబ్ధిలంఘనము లంకకుఁ జేరుట రాక్షసాళిలో
సేమముతోఁ జరించుటయు నేరుఁ జేసిన వ్యర్థయత్నమౌ
రాముసతీమణిం గనక రాఘవు సూర్యసుతుం గనం జూమీ: 182

శా. నావెంటం బడియున్న వానరు లహో నన్నెట్లు భావింతురో
దీవింపందగు సూర్యనందనుఁడు పృథ్వీశుండు దూషించఁడే
లావున్ మెచ్చుచు నాదురాక శుభవార్తాసక్తులై యుండు, వా
రా వీరుల్ రఘురామలక్ష్మణులు శోకాక్రాంతులై క్రుగ్గరే 183

ఆ.వె. సీత కానరాని చెడుమాట వినునంత
రాఘవప్రభు విల రాలిఁ బోక్కొ
పరుష దారుణమగు పలుకాపఁ జెల్లునే
విన్న రాముఁ డపుడె వీడు బ్రతుకు 184

ఉ. రాముఁడు ప్రాణముల్ విడిచ లక్ష్మణుఁ డప్పుడె కూలు నేలపై
నిమిషచే నయోధ్యఁ గల యిద్దరు తమ్ములు మువ్వు రమ్మలున్
భూమిని వీడిపోవ రాత్రా పోయిన వంశవినాశమౌ కదా!
కాముకులైనవారు కడగండ్లను గూర్పరె యెట్టివారికేన్ 185

తే.గీ. దైత్యుఁ డెంతటి ఘోరకృత్యంబు సలిపె
సీత గనఁజాలనని నేను చెప్పినంత
రాము డస్తమించు, నిజకులంబె మాయు
నేమిసేయుదు నే నిపు డెటుగ మనుదు 186

ఆ.వె. మేలు మఱువరాని మేటియే కపిరాజు
రాము ననుసరించు రాజ్యము విడి
భార్య రుమయు! జచ్చు భర్తను వెంటాడి
యంగదుండు దార యనుసరింప 187

తే.గీ. భక్తివిశ్వాసములు గల వానరులును
తేనివెనువెంట జావక మాన రపుడు
వానరక్షయంబగు నిజవంశమె చను
సీతఁ గానక గిష్కింధఁ జేరరాదు 188

ఉ. వచ్చును సీత గాంచి శుభవార్తను దెచ్చునటంచు వేచు నా
సచ్చరితుండు రాఘవుఁడు జానకిపై గల కూర్మిచేత, నే
పొచ్చెము రాదు నే బిరికి బోవకయుండిన వానరేశుఁడున్
హెచ్చగు నాశతో బ్రతుకు నే నిలు సేరకయున్న నిప్పుడే 189

తే.గీ. జానకిని జూడనేరమి చావొ బ్రతుకొ
నేనె గనువాఁడ రాఘవుని, గపిరాజుఁ
గనగఁ గిష్కింధకేగను క్ష్మాజ గనెడి
వఱకు రావణులంకనే వదల వదల 190

కం. వానప్రస్థునిగతి నే నీ
కాననముల దిరిగి కూరగాయల దినుచున్

జానకిఁ గనగా రోయుట
మానక గాలంబు గడుప మాన్యముగాదే 191

ఉ. కానగలేనిచో జనక కన్యను నేఁ జితిఁ బేర్చికొంచు నం
దైనఁ బడం దలంచెద మహాబ్ధిని దూకుచుఁ జచ్చువాడ, గా
దేని త్యజించి భోజనము నీ తనువున్ విడజేతు జీవమున్;
మేను భుజింప గాకులు, సమీరుఁడు యోగులు మెచ్చు
రీతిగా 192

తే.గీ. చచ్చి చేసెడి పని యేమి చావకుండ
బ్రతికియుండియె పాముల బడుచునైనఁ
గార్యసిద్ధికి యత్నింప గడఁగవలయు
నీ నిశాకాలమంతయు నేగె వృథగ 193

తే.గీ. పురుషకారంబునం బనిఁ బూనవలయు
ఫలితము నపేక్ష జేసియు బడయకున్నఁ
జచ్చి చేసెడి పని యేమి చావకుండ
నది వి,ధివశంబ,ని తలంతు రాత్మవిదులు 194

మ. ఎట నున్నన్ సరె సీత, రావణునినే నే జంపెదన్ లేక నా
పటుబాహాబలశక్తి నీడ్చుకొని పోవంజూతు యజ్ఞార్థమై
యెటుగన్ హోమమొనర్పగా బశువు నెం దే పట్టి తో డ్తెత్తురో
యటుగన్ దెబ్బకుదెబ్బయౌనది మనం బంతం బ్రశాంతిం
గనున్ 195

ఉ. ఏమని యంగుళీయకము నిచ్చితి వీవు దయాపరుండవై
భూమిజ నేనె గాంతునను బుద్ధిని గాదొకొ! నీదుదీవనల్
స్వామి నిరర్థకంబుగుచు వమ్మగునా! కృపఁజూపి రాఘవా
నీమహితాత్మ జూపు మిక నే విడనాడితి స్వీయయత్నమున్ 196

కం. శ్రీయుతుపైఁ దా భారము
వేయుటకు న్ముందుకర్మ స్వీయకృషిం దాఁ
జేయగవలె పురుషుఁడు నా
మాయనమో యను దలఁపు మానక భక్తిన్ 197

మ. అని యేమో దలపోయుచున్ హనుమ దుఃఖాబ్ధింబడుందేలుచుం
గనుచుం బ్రక్క నశోకవృక్షవనమున్ గానంగదా దీని ము
న్ననిఁ,లో నెంచి, యటన్ వసింపఁదగుగా నాయమ్మ సీతమ్మ దై
త్యనివాసంబుగ నున్న దియ్యదియు, రోయం జెల్లునం చెంచెడిన్ 197

ఉ. పోయెద నీ వని న్వెదకఁబూనెద, నార్తిని వీడువాఁడనై
యాయమ సీతఁ గాంచి వసు ధాపతి రాముని కిచ్చువాడ నన్
వాయువు నగ్ని యా శశియు భానుఁడు రుద్ర సమస్తదేవతల్
బాయకఁ బ్రోవ మ్రొక్కిడు వాఁడ నశోకవనిన్
జయార్థినై 198

తే.గీ.పరమపూజ్యః శ్రీరామ తుభ్యంనమోస్తుః
అతులసౌమిత్రిః ధీర తుభ్యంనమోస్తు
వరపతివ్రత? సీత తుభ్యంనమోస్తు
కపివరాః రవిసూనః తుభ్యం నమోస్తు 199

ద్వి. అని యంజలి ఘటించి తనుఁ బ్రోచువారి
మననం బొనర్చుచు హనుమంతుఁ డపుడు 200

ఉ. ఎన్నడు జూతునో విమల నీప్సితసిద్ధి మఱెన్నడౌనొ రా
మన్న వచించినట్టి సతి నార్య శుచిస్మిత, పద్మనేత్ర, నా
కన్నులపండువై యెపుడు గాంతునొః దుష్టుఁడు రాక్షసేశుఁ డే
తెన్నున దాచెనో బలిమిఁ దెచ్చిన రామునిభార్య జానకిన్ 201

ద్వి. అని లోదలంచి యా హనుమ కుప్పించి
వనిగోడ పై కెక్కి వన మెల్లఁ గాంచు 202

ఆ.వె.రాక్షసేశు గృహపు ప్రాకారకుడ్యంబు
పీడి యొక్కగంతు వేసి చేరె
నా యశోకవనము నావృతంబగు గోడఁ
గపికిశోర మేరికంటఁ బడక 203

ద్వితీయాశ్వాసము సమాప్తము
ఆశ్వాసాంత పద్యములు.

తే.గీ.సర్వధర్మమ్ములను వీడి శరణమంచు
"అన్యథా శరణం నాస్తి" యనుచు, హృదిని
నిన్నె నిల్పువాడునుగూడఁ దెన్నుఁ గనఁడొ!
పొందుచు వికారంబు విజయ మందఁ డొక్కొ! 204

తే.గీ.అర్హతానర్హతలఁ గన నంతులేదొ!
నీపరీక్షకు రాఘవా! నీవె యెపుడొ
ప్రోతువని సంచితార్థంబు పోవునటకు
వేచియుండుటయే జీవి విహితగతియొ! 205

తే.గీ.జన్మజన్మము లిట్లెన్ని జరుగవలెనొ
నీ కృపాలేశముం గన నీరజాక్ష
సద్గురూపదేశంబు నీ సన్నిధిఁ గన
దారిఁజూపునె దేహికి దశరథసుత 206

ద్వి. కనఁగ నాచార్యుండు తనయంతఁదానె
పనిఁ బూనునె, తరింపవలెనంచు జీవి? 297

ద్వి. నీవె పంపెద వొక్కొ జీవులఁ బ్రోవ
దేవ? ఆచార్యుని దేహాలకడకు 208

తే.గీ.ఎందులకు నెప్పు డీవు కృ పేచ్ఛ గనెదొ
ఊహ కందని సత్యంబు నూహఁజేయఁ
గాలమును వ్యర్థ మొనరింపఁ గడఁగుటేల?
నిన్నె కై మోడ్చి తలఁపనొ నిరతభక్తి 209

తే.గీ.స్వప్రయత్నంబు విఫలమై శౌరితలఁపు
నెమ్మదిం గని సర్వంబు నీవెయంచుఁ
గరములను జేర్చి ప్రార్థింపఁగలిగినపుడె
యత్నకార్యంబులందు జయంబు గలుగు. 210

శ్రీ గోవింద రామాయణ, సుందర రామకావ్యంబున ప్రయాత్నాశ్వాసము
సంపూర్ణము

# శ్రీ గోవింద రామాయణము

## దర్శనాశ్వాసము

కం. శ్రీరఘురామా యని సీ
తారమణీహృద్విలాసః చిత్తమునం దే
వారలు నిన్నెంతురో, అ
వ్వారల పని నీవె దీర్ప వా సఫలముగాన్ 1

### మారుతి–అశోకవన ప్రవేశము

ఉ. శ్రీకరమై యశోకవని చెల్వుగ నొప్పు వసంతవేళ, శో
భాకర పుష్పసంకలిత భాసురశాఖల విస్తరిల్లి, వృ
క్షాకులమై యనేక ఖగసంకులమై వివిధస్వనోద్ధతిన్
ప్రాకటమై భవంబు గల రమ్యవనిం గని హృష్టచిత్తుఁడై 2

ఉ. శ్రీరఘురామచంద్రు సతి సీతను గాంచి కృతార్థుఁడౌట, కా
హార విహార నీమముల నాసురులంకనె యుండ నిశ్చితుం
డై రవిసూనుమంత్రి, నికటంబున నున్న యశోకవాటికం
జేర, దటాలునం దుమికెఁ జిందరవందరగాగ వృక్షముల్ 3

చం. కనుచు మహానికుంజతరు కాండ,లతాయుత వన్యవాటికన్
హనుమ హుటాహుటిం బఱఁగి యా నగశాఖల సంచరించుచున్
వనివెదుకంగ సాగె రఘువర్యుని సీతను, గాఢనిద్రఁ జొ
క్కిన విహగాళి మేల్కొనియె కీశవరుండు చరించు సవ్వడిన్ 4

ద్వి. ఖగసంచయంబెల్ల నెగయంగసాగె
మృగతతిభయమొంది మేల్కొని పాఱు 5

ద్వి. పూలప్డు జలజలఁ బుడమిని రాలె
గాలియు రివ్వునఁ గదలంగ సాగె 6

ద్వి. ఫలములు కాయలు పడినవి క్రింద
వ్రేళ్లవ్రేళ్లఁ బోవఁగ వృక్షములన్ని 7

ఆ.వె.పూలు మీదఁ బడఁగఁ బూవుల గిరి వోలె
ఆ యశోకవనిని హనుమ దోప
చెట్టు చెట్టు నెక్కి మట్టుచు నావనిఁ
దిరుగుచుండెఁ గోఁతి, దేవిఁ గనఁగ 8

తే.గీ.నియమితాహారము విహార నియతితోడ
నిరతమా సీతనే హృది నిలిపియుంచి
యోగ మూనిన వానిగ యోగసిద్ధి
గనఁగ నెంచెడి సీతాంబ యునికిఁ గాంచి 9

ఆ.వె.కొండలటనటఁ గని కోనేఱు సెలయేఱు
దిగుడుబావులఁ గని దేవి యటకు
నీటికొఱకు రాదె నేఁడో రేపో యని
వచ్చునంత, జూడ వచ్చుననుచు 10

తే.గీ.స్వర్ణ వేదిక లెన్నియో వరలుచుండి
పగడములమెట్లుఁ గైలాసపర్వతగతి
వెల్లనై కొండ కంటుచు వేయికంబ
ముల వెలయు సౌధరాజ మనిలజుఁడుఁగని 11

ద్వి. ఇందుండునా యసితేక్షణ సీత
సందెకాలమునందు సహజంబు రాక 12

ద్వి. చక్కఁగ మిన్నంటు సౌధమియ్యదియ
యిక్కడ నుండనౌ యింతి సీతమ్మ 13

ద్వి. అనుచు లో నెంచుచు నచ్చోటఁ గనియె
మునితతి కానంద మొనగూర్చు నదిని 14

తే.గీ.ఆ విలాసార్థమైయున్న యద్రినుండి
స్వచ్ఛపరిశుద్ధజలములఁ బాఱు నదిని
ముత్తెముల సైకతంబుల ముద్దు లొలుక
స్నానమాడఁగఁ దగియున్నదానిఁ గాంచె 15

చం. జనకజ స్నానమాడుటకు సంధ్యను వందనమాచరింప, వా
హిని దరిఁజేరు, బుష్పవని యిద్ది! యిటన్ విహరింప నెంచు రా
మునిసతి, హారహీనయయి పొక్కుచుఁ జిక్కిన దేహవల్లి తోఁ
దనపతినిన్ స్మరించుచు నితాంతము ప్రాణముతోడ నున్నచో 16

ద్వి. కలుముల జవరాలు కలికి నానొప్ప
లలితస్వరూపను లావణ్యవతిని 17

ద్వి. తులలేని సౌందర్య విలసిత యైన
కలువకన్నులసీతఁ గనెద నే నిచట 18

ద్వి. అని తలపోయుచుఁ దనముందె యున్న
పెను నశోకనగముఁ గనుచుండి తోడ 19

ఆ.వె.దిగుడుబావియొద్దఁ దీరుగా పెరిగిన
పెద్ద శింశుపారవృక్ష మెక్కి
నిక్కి నిలిచి చుట్టుప్రక్కలఁ గనుచుండి
వేచియుండెఁ గాంచఁ బృధివిజాత 20

తే.గీ.బొగడచెట్లను చందన భూమిజములఁ
తీయమామిడి తరువులఁ దీగె గముల
లేఁ జిగుళ్ళను మొగ్గల లీలఁ గనుచు
దట్టముగ నున్న యాకులఁ దాఁగియుండె 21

ఉ. పూలును బూలదోట మృగముల్ ఖగముల్ రుతముల్ మహాలతా
జాల నికుంజవాహినులు సంతత మోదమయంబు లీ వనీ
లీలలు కంటికింపెసఁగు రీతిగనుండె వసుంధరాసుతా
హేలకు నొప్పు నీవనమె యిచ్చట నా లలితాంగి యుండనౌ 22

చం. జనకనృపాలు కూఁతురు విశాంపతి రాఘవు ధర్మపత్నియై
యనుదిన సౌఖ్యసంపద లహర్నిశలుంగని, యున్న సీత, యీ
వని మన నరహా, సద్గుణ విభాసురమూర్తికి నిద్దియున్కియై
తనరిన, సీతయీవనికి ధాత్రిజ కీవని,యే తగుంగదా! 23

తే.గీ.కమలవాసినిగల, వాడఁ గ్రాలు కాంతి
వివిధపుష్పచయంబుల వెలుఁగుచున్న
యాయశోకవనమున సీతమ్మఁ గాంచఁ
బట్టు విడువకఁ జూచెడి వాయుసుతుఁడు

ఆ,వె.దూరదృష్టిఁ బఱపి పాఱఁజూచుచుఁ జెట్లఁ
గనఁగఁజాలడాయె జనకసుతను
యోజనమొనరించు చుండెనెటయని
ముఖమువంచికనుల మూసితెఱచి

మారుతి సీతను జూచుట

తే.గీ.అంతఁ దనచెట్టుక్రిందనే యసురవనిత
లుండుటయు, వారి,నడుమనే యొక్క సుంద
రాంగినిఁ గనుచు మారుతి రాము సతియ
యీామె యని లోన శంకించి యామెఁ జూచు

సీ. ఉపవాసములుఁజేసి తపియించుచుండుట
సన్నగిల్లినమేన నున్నదాని
మాసిన కోకతో మలినదేహంబునఁ
జెన్నఱీ రూపఱీ యున్నదాని
పెనిమిటిదరిలేని పెనుబాధతోఁ బ్రస
న్నతలేనిశశివదనంబు దాని
నేలపై గూర్చుండి నిట్టూర్పుల విడుచు
పెన్నెఱీ వ్రేలాడు చున్నదాని

తే.గీ.తనదు గుంపునుండి చెదరఁ దఱుముచున్న
శ్వానభీతి నొందు కురంగ శాబక గతి
ఆసురీకురూపల మధ్య నలయు దానిఁ
గాంచి యామెయే సీతమ్మ గాఁగ నెంచు

ఆ.వె.మున్ను చూచియున్న మూర్తిగఁదోపించు
నలసియున్న సుందరాంగినొకతె
దైత్యభీమరూపలమధ్యఁ దనరుదానిఁ
గాంచి యాయమ్మయే సీతగాగనెంచు 28

తే.గీ.మొయిలు గప్పిన శశివోలు మోహనాంగి
దీనయైముఖపద్మ దీధితితొలంగి
యానిశాచరతతిమధ్య నలియు దానిఁ
గాంచియాయమ్మయే సీత గాగ నెంచు 29

ఆ.వె.నివురు గప్పియున్న నిప్పు చందంబున
శోకమూర్తియయ్యు శోభచెడక
అసురలమధ్యదుఃఖాన నఱుగుదానిఁ
గాంచియాయమ్మయే సీత గాగ నెంచు 30

తే.గీ.విడివడి పతిని నగలను వీడెనేమొ!
చెట్టుకొమ్మనువ్రేలాడు నట్టివెగద
మున్నురాముండుగుఱుతించి యున్ననగలు
ఈమెయే రామచంద్రుని రామ నిజము 31

ఉ. రక్కసి తేఁడు వెంటఁగొని లంకకు నేగెడి మార్గమందు ము
న్నొక్క లతాంగి వే నగల నుంచిన మూటను నేల వైచుచున్
గ్రక్కున నేడ్చుచున్న గనఁ గల్గిన యామెయె యీమెగా మనం
బొక్కగతిం దలంచెడి మహోత్తమరాఘవు భార్యయీమెయే 32

తే.గీ.చెవులకుండలములు రెండు చెవులకొక్క
రీతిగనేయుండు మునుతన నాతివియని
రాఘవుఁడుగుఱుతించిన రమణికుండ
లమ్ము కొమ్మనుగల కుండలమ్ముబోలు 33

తే.గీ.హస్తమునఁదాల్చుమణివిద్రు మాభరణము
లగుఱుతులవియె; వానితుల్యములుగుఱుతుఁ
బట్టినయవియు;రాఘవుం డెట్టిగుఱుతు
లనుడివె నవియె;యీమెలోఁ గనఁగనయ్యె 34

ఆ.వె.నగలమూటనుగల నాటి వస్త్రపు రీతి
వస్త్రమే ధరించి వరలుచుండె
మలినమగుట రంగు మారెను గొలఁదిగ
సంశయింపనేల? జనకసుతయె 35

సీ. ఆపత్తునందున్న యబలను గనలేమి
కారుణ్యవశత నేకాంతఁ దలఁచు
తన్నాశ్రయించిన తన్విరక్షణమెంచి
సానుతాపమున నేసాధ్విఁదలఁచు
సహధర్మచారిణి సతినినర్ధాంగిని
వీడినచింత నే వెలఁదిఁదలఁచు
ప్రేయసినెడబాసి రేయిబవళ్ళను
మన్మథబాధ, నే మగువఁదలఁచు

తే.గీ.అపహరింపఁబడుట నగపడకుండియు,
ధ్యేయయగుటసతము దేనిగనునొ
మనసుచేత,రామ మహితాత్ముఁడా దేవి
పూతరాముభార్య సీతయీమె 36

తే.గీ.అంగసౌష్ఠవరూపంబు లందు నిరువు
రొక్క విధముగ విలసిల్లు చున్న వార
లగుట నీమెపద్మాక్షి రామయ్యకె తగుఁ
గానసీతమ్మ యీమెయే కాంచినాఁడ 37

ఉ. ఎంతటి రాతిగుండెగల దీ రఘురామున, కీమె నిట్టుగన్
వంతలపాలుసేసె నిటువంటి సతీతిలకంబుఁ బాసియున్
గాంతుఁడు పొందునట్టి వెతఁ గాంచఁక జీవముతోడనుండె ర
వ్వంతయుఁ ప్రేముడిం గనినవాఁ డిటులుండుట
సాధ్యమౌనొకో! 38

ఉ. ఎంతటి గట్టిగుండెగల దీ రఘుచంద్రున కిట్టిసుందరిన్
వింతగవీడియే బ్రతుకుఁ బ్రేముడిచే విలపించుచుండి,. వా

డెంతటిధీరుఁడో తగును నెంతటికార్యమునైనఁ జేయఁగా
నంతయు శంక లేదిపుడె చూచితి రాఘువుధర్మపత్నినిన్ 39

ద్వి. ప్రేమాతిశయులయ్యు విడివడియుండి
భూమిపై నిందాక భూజయుఁ బతియు 40

ద్వి. మనములం దొండొరుఁ గనఁగల్గుచుండి
మనఁగల్గినారలు మహితాత్ములగుట 41

కం. అనుచున్ మారుతి రామ
య్యను గొనియాడుచుఁ దనవిభు నర్కసుతుముదం
బున లోనెంచుచు సీతాం
బను గనుచున్ నతినిసల్పెఁ బ్రబలినభక్తిన్ 42

**మారుతి, సీతఁ గాంచి దుఃఖించుట**

ఉ. రాము గుణాభిరాము సకలక్షితిరాము నిటుల్ స్తుతించి యా
భూమిజ సంస్తుతించుచునె పొక్కఁగసాగెఁ దృటిన్
హృదిన్ వెసన్
రామపదాశ్రితవ్రత విలక్షణలక్ష్మణుపూజ కర్హ, యీ
ధీమతి గూడనార్త, దురతిక్రమణంబగుఁ గాల మేరికేన్ 43

ద్వి. ఈమె సుఖార్హయై బాములఁ గుందు
రామునిభార్యయై రావణువనిని 44

ఉ. రామపరాక్రమక్రమము లక్ష్మణుధీయుతు విక్రమంబు సీ
తామహితాత్మకుం దెలియు దానవుశాత్రవుఁ ద్రెళ్ళఁజేసి, వా
రామెను గైకొనంగల రటంచని క్షోభకుఁ బాలుగాదుగా
భూమిని గంగ, వర్షజలముంగని భీతి వహించుచుండునే 45

ఉ. శీలమునన్ వయస్సునను సీతయు రాముఁడుఁ దుల్యుఁలౌటభూ
పాలకవంశసంభవుఁడె వంశమునన్ సరిపోవువాఁడు సీ
తాలలితాంగికిన్, సుగుణధామకు, సద్గుణధుర్యుఁ డెంచ, సీ
తాలలితస్వరూపయును దాశరథీశుఁడు మంచి దంపతుల్ 46

శా. శ్రీరామామణితుల్యమై జగతికిన్ శ్రేయస్కరంబైన, ఆ
శ్రీరామున్, సతిఁ గాంచుచున్ హనుమ లోఁజింతింపఁగాసాగె, నీ
నారీరత్నమె హేతు వౌటనుగదా నా డానృపున్ వాలినిన్
ఖరున్ రాక్షసునిం గబంధునిని, ధాత్రింగూల్చె రాముండహో 47

తే.గీ. శంబరాసురు నింద్రుండు జంపినగతి
రాక్షసుని భీమబలుని విరాధుఁ జంపెఁ
గాననంబున దైత్యుతో గడన మూని
రాఘవుం డహో! జనకజారామకొఱకె 48

ఉ. యానమునం జతుర్దశ సహస్రనిశాచరవీరులన్ జన
స్థానమునందు గాల్చె నిజ శాత మహావిశిఖాగ్నిహోత్ర సం
ధానమునన్ రఘూత్తముఁడు దారుణ కర్మల నట్లు జంపె, నీ
జానకి హేతువౌటగదా? సల్పెను బంచవటిన్ రణం బహో! 49

తే.గీ. ఖరుని దూషణుఁ ద్రిశిరుని గర్వ మడఁచి
మడియఁజేసెను రాఘవ మహితుఁ డపుడు
జానకీనిమిత్తముగాదె దానవతతి
నటు జనస్థానమందు లయంబొనర్చె 50

తే.గీ. సుప్రసిద్ధుండు వీరుండు శూరవరుఁడు
వాలి వధియింపఁబడి రాజ్యపాలనంబు
కలిమి సుగ్రీవు డొందఁగ గారణంబ
ఈమెయే దశరథస్నుష యీమె సీత 51

ద్వి. శతయోజనంబుల సాగర మేను
హితమతి లంఘించి యిటకు వచ్చుటకు 52

ద్వి. ఏ సీత హేతువో యాసీత యీమె
వాసియు వాడయు వాసిన దీమె 53

చం. ఎటుల వసించుచున్నదియొ! యీ సుకుమారి సురారికానలో
పటుతరశక్తిమంతుఁ డగు భర్తను వీడి సజీవ యౌచునే

కటకట! జీవితేశుని నొకప్పటికైనను జూచునాశనే
యిటుగ సజీవగా మనెడి యీ సతి రాఘవులావు నెంచుచున్ 54

ద్వి. భూషణంబులఁగంటెఁ బొల్పారుచుండు
భూషణంబగు పతి పుడమిపై సతికి 55

ద్వి. పతిసన్నిధిని లేని పావన సీత
యతిరూపవతి యయ్యు నటుగాగ లేదు 56

ద్వి. రాముఁడు సౌమిత్రి రక్షించుచున్న
రామ కురూపల రక్షలోఁ బడియె 57

ద్వి. అంతఃపురంబుల నలరారు సీత
కాంతినిఁ బాసి యీ కానలో నుండె 58

ఉ. ఈమెను జూడనంతవఱ కీబిడఁజూడఁ దపించినాఁడ, ని
ట్లీమెను దుఃఖమూర్తిఁగని యేనె భరింపఁగఁ జాలనైతి నా
రాముఁడు నీమెఁ జూడఁ బడ రాని వ్యథంబడి క్రుగ్గిపోవఁడే
యేమనఁజెల్లు? గాలగతి నెవ్వరు దాటఁగలార లీఘవిన్ 59

మ. అని, లోలో, దలపోయుచున్ హనుమ చింతాక్రాంతుఁడై
యుండి సీ
తను గాంచున్ రఘురామునెంచు ద్రుమమం దాసీనుఁడై
మైథిలిన్
గనితిన్ సీతయె యీమె, యౌను, జనక క్ష్మాపాలుపెంపొందియుం
డిన సీతాసతి రాముభార్యయను రూఢిన్ నిశ్చితాత్ముండునై 60

ఉ. వాసియు వన్నె గన్న రఘు వర్యుఁడు సింధుపరీవృతావనిం
గాసిలునట్లొనర్చిన, జగంబు సమస్తము రూపుమాయఁగాఁ
జేసిన, యుక్తమేయగును సీతకుగా, జనకాత్మజాతకై
యీ సుగుణాలవాలయె మహీపతిపత్నియె పొందె బాములన్ 61

తే.గీ. ఈ త్రిలోకాధిపత్యంబు హెచ్చా? లేక
సీత జానకియే హెచ్చా సీతకుఁ గల

కళల నన్నింటి యందొక్క కళకుఁగూడ
సరిపడునె త్రిలోక రాజ్యంబ యేని? 62

చం. జనకునృపాలు పెంపును విశాంపతి రాముఁడు భర్త యౌటయున్
జననమునుండి పొందినది సౌఖ్యమె, హారవిహారలీలలన్
గనుచు సుఖంబె, కారడవి కావిడవచ్చె త్యజించి సౌఖ్యముం
బెనిమిటి వెంటనంటిన పవిత్ర పతివ్రత సీత యీమెయే 63

తే.గీ. చూచి భరియింపఁ జాలని శోకగరిమ
పలుకఁగా, నశక్యమయిన వ్యథనుగూడి
యాత్మ నూహింపఁ జాలని యార్తిఁ గనెడి
యీమె దురవస్థ నెంచఁగ నేరితరము! 64

సీ. సౌధరాజములందు చరియించు రాట్సుత
నివసించునీచెట్టు నీడయందు
షడ్రసోపేత భోజనమొందు రాట్సతి
యుపవాసముల స్రుక్కు చున్నదిటను
రాజకన్యలఁగూడి రహినుండు రాణియే
భీతావహస్త్రీల భీతి మెలఁగు
ధర్మపత్నిగ భర్త దరి నుండు భార్యయే
భర్తకు దూరమై బ్రతుక నయ్యె

తే.గీ. కాంచన దుకూలములఁ దాల్చు కాంత యిటుగ
మలిన వస్త్రంబు ధరియించి మనఁగ నయ్యె
కనివిని తలంపఁగా లేని గతిగ నీమె
యార్త! కాలంబు మీరఁగా నేర్తురెవరు 65

కం. వనచరుఁడను నేనే యీ
వనజాక్షిని గాంచి దుఃఖ భరితుఁడ నైతిన్
తనసతి గతిఁగని దీనా
వనుఁడా దాశరథి యెంత వంతం బడునో! 66

తే.గీ. సింధుమధ్యఁ దుపానునఁ జిక్కునోడ
వోలె నలజడి పాలైన యింతి యీమె
యాడ ఏనుగ తానొండె నడవి సింహ
మునకు జిక్కినగతి భీతి మునిఁగె నీమె 67

కం. అని తనలో చింతించుచు
హనుమంతుఁడు వృక్షశాఖ న్యాసుండై
గనుచుండగ సీతమ్మను
వినువీధిన్ రేవెలుంగు వెలుఁగుచునుండెన్ 68

ద్వి. రేయిచాలగడిచె రేతేఁడు వెల్గుఁ
బాయకఁ బుడమిపైఁ బ్రసరించుచుండె 69

తే.గీ. వాయుసుతునకుఁ దోడ్పడ వచ్చియున్న
విధముగ శశిమింటి నడుమ వెలుగుచుండఁ
జెట్టు నీడను సీతమ్మ చుట్టునున్న
రాక్షసులఁ గాంచు హనుమ యా రాత్రియందు 70

ఉ. కొందఱు కరాకృతులు కుబ్జలు కొందఱు దీర్ఘదేహలున్
గొందఱు భీతిగొల్పు మిడిగ్రుడ్డులవారలు నంగహీనలున్
గొందఱు ఘోరసూకరముఖుల్ ఖరవక్త్రిలు కొందఱందు వీ
రందఱు నందఱందఱును నంద విహీనలె సీతచుట్టునున్ 71

సీ. ఒకకాలు నొకచేయి నొకకన్ను నొకచెవి
గలవారి మధ్యలోఁ గలదు సీత
ఇనుపశూలముఁ దాల్చు నెనుబోతు ముఖులలో
నడుమ నున్నది నళి నాక్షిసీత
ఖరకర్ణములవారు గజనాసముల వారు
చుట్టుముట్టఁగ నుండె సుదతి సీత
రక్తమాంసములందు రహిఁదోగుచుండిన
మాంస భుక్కుల యందు మనెడిసీత
లంబోదరులు బహు లంబస్తనులు నావృ
తంబుగనుండె నీ తన్వి సీత

తే.గీ.వినఁగఁ గటువైనఁ బలుకుల వినుచు నుండె
గన నసహ్య దుర్దేహులఁ గనుచు నుండె
శుకపికారావముల సొంపుఁ జూచి, వినుచు
సౌధరాజంబులందుండు సాధ్వి యామె 72

తే.గీ.గగనమున నుండి పడిన నక్షత్రమనఁగ
బూవురాలిన, తీగెనుఁ బోలు నీమె
ఆర్తి, యారూపముంబొంది యవతరించి
నటుగ నున్నది రాము నర్ధాంగి సీత 73

తే.గీ.ఓర్పు నందీమె భూమిగా నొప్పుచుండె
సహజసౌందర్యరాశియౌ చక్కదనము
మలిన తనువయ్యు రవ్వంత మాపుఁ గనదు
కంటిఁ గనుగొంటి రాముని కమలనేత్ర 74

ఉ. కంటిని గంటి సీత నిక గర్మఫలించె, ముదావహుండనై
యింటికిఁ బోవవచ్చుఁ బృథివీశుఁడు రాముని కీసువార్త, నే
వెంటనె చెప్పఁగా వలయు వెళ్లుటకు న్మను రాము క్షేమ మే
నొంటరిఁ గాగ సీతఁగని యొప్పుగఁ దెల్పఁగ సాధ్యమౌనొకో? 75

కం. అనుచున్ మది నెంచుచు రా
ముని సౌమిత్రిని దలంచి మ్రొక్కుచు దైత్యుల్
గనఁ జాలని రీతిగ, నా
హనుమంతుఁడు దాగె నాకు లలమిన శాఖన్ 76

## రావణుని రాక

ఆ.వె.రేయి కొలఁది మిగిలె వాయుసూనుండిటు
కొమ్మఁ జేర రాము కొమ్మఁ గనఁగ
నిత్యదీక్షగ సల్పు నిగమాధ్యయనమున్న
రమ్ము వినఁగ నయ్యె లంకయందు 77

తే.గీ.అపరరాత్రంబు మిగిలె రవ్వంత నంత
నాషడంగవేదవిదులు యాగపరులు
బ్రహ్మరాక్షసతతి సుస్వరంబు తోడ
వేదమధ్యయన మొనర్ప వినఁగనయ్యె 78

ద్వి. మంగళధ్వని విని మదఘూర్ణితుండు
చంగున మేల్కాని జానకిఁ దలఁచె 79

ద్వి. వేకువ వేళను విధులను దీర్చి
సోఁకులు వేదముఁ సుస్వరయుక్తి 80

ద్వి. గానము సేయఁగఁ దానిని వినుచు
దానవనాధుఁడుఁ తక్షణమందు 81

శా. సింగారించుచుమేను దత్తరమునన్ సీతాపరుండౌచు వే
హంగుంగూర్చి యశోకవాటికకు భార్యల్ వెంటరా,వచ్చె స
ర్వాంగంబుల్ మదనోద్ధతిన్ వ్యసనబాధాక్రాంతమై బర్విసన్
భంగం బొందని యాత్మతో నసురభూపాలుండు ప్రేమార్ధియై 82

ఉ. చక్కనిచుక్క,లచ్చరలు చారణు లాదిగ వందమంది, న
ల్దిక్కులఁ బర్వియుండ సుదతీతతి వెంబడి రాగ డంబుమై
నిక్కుచు నీల్గుచున్ వనజ నేత్రలఁ గూడి యశోకవాటికన్
రక్కసిఱేడు సొచ్చెఁ గన రాఘవురామఁ ద్రిలోకసుందరిన్ 83

మాలిని

కొందఱు కాంచనదీపికలన్ మఱి కొందఱు చామరముల్ గొనిరా
కొందఱు వీవనలన్ జలపాత్రలఁ గూడుచు రావణు ముందునరా
కొందఱు కత్తుల నాసనముల్ గొని కూర్మిని ఱేనికివెన్కనురా
అందెల గజ్జల మ్రోఁతల సుందరులందఱతో వనిఁజేరెనుగా 84

తే.గీ.దీపికల కాంతి వనమెల్లఁ దేజరిల్ల
గజ్జ లందెల సవ్వడి కడలుకొనఁగ
వాయుసూనుండు ద్వారంబు వంకఁబాఱఁ
జూచు భూజాగ్రశాఖపై వేచి యుండి 85

తే.గీ.అంతఁ బరికించి గుఱుతించి యసురవిభుని
రాక, సుందరీయుతి వచ్చు రావణుండు
వీఁడె, శయనగృహంబున నేఁడె గన్న
యలపులస్త్యసూనుఁడు నపహర్త వీఁడె

కం. అని మదిఁ దలపోయుచు నా
హనుమంతుఁడు దిగువకొమ్మ కంతటఁ జేరెన్
విన నౌనని యాతని నుడిఁ
గన నెంచుచు నాతని విధిఁ గర్మ తెఱంగున్

తే.గీ.రావణుని రాకఁ బసిఁగట్టిఁ రమణి సీత
తొడల గడుపును జేతులతోడ ముమ్మఁ
గప్పికొని దీనయై వణకంగ సాఁగె
గాలి తాకునఁ గదలెడి కదళి వోలె

చం. కడలిని మున్గు యోడగతి ఖండితమౌ తరుశాఖవోలెఁ దాం
బుడమిని గూరుచుండి కడుఁ జొక్కెడిదానిని, మంత్రశక్తి
తొడరెడి పన్నగేంద్రుని వధూగతి నుండినదాని, భూవరే
శుఁడు పతియైనదానిఁ గనె సోఁకులఱేఁడు కృతార్థతంగనన్

తే.గీ.అతులసంకల్పహయముల నమరి నట్టి
హృదయరథమెక్కి పతిచెంత కేగు దాని
ధ్యాన మనన పరత విదితాత్మ రాము
సన్నిధానమునందె తా నున్నదాని

తే.గీ.మబ్బు గప్పిన చంద్రుని మాడ్కి దాని
హారమును వీడి శుష్కించి యదరు దాని
అమలరాఘవానువ్రత యైనదానిఁ
బుడమిఁ జూచుచుఁ దలవంచి పొక్కు దాని

తే.గీ సత్కులీనను దుష్కులజాతున కిడి
కాంతగాఁ జేయ శోకించు కన్య వోలె
గ్రహణమందున బూర్ణిమా కాంతి వోలె
కట్టు తెగిన నిర్జల తటాకంబు వోలె

తే.గీ రావణుఁ బరాభవింపఁగా రాఘవుండు
రాగ, నిష్టదేవత నెంచి రామచంద్రు
నెన్ని ప్రాంజలి నుండెనా యన్న దానిఁ
గనుచు మంచిమాటలఁ బలుఁకాడఁ గడఁగె 93

తే.గీ.ఆ పతివ్రత దీనను నతఁడుగాంచి
యా నిరానందతపసిని నతఁడు చూచి
మృదువు మధురంబునగు మాట విదితరీతిఁ
బలుకరింపంగ సాఁగె నా పడఁతి మిన్న 94

చం. భయము వడంగ నేల? యిటు భాసురదేహము కాలుచేతులన్
రయమునఁ గప్పికొంటివి విలాసిని? నేఁ గనఁజాలకుండ, నన్
బ్రియమునఁ జూడుమీ, వదనబింబమునెత్తి విశాలనేత్ర నే
బ్రియుఁడను వేఱలేరు నిను భీతికిఁ బాల్పడఁ జేయ సుందరీ! 95

తే.గీ.[1]సర్వలోకమనోహర? చాలు భయము
వలదు [2]సర్వాంగగుణమూర్తి భయము, నిన్న
హాో [3]విశాలాక్షి కామించి యున్న వాడ
దేవి? కృపఁజూడుమీ నీ, యకీను నన్ను 96

ఉ. నేల బరుండనేల? మఱి నీవిటు మాసిన నొక్క చీరనే
యేల ధరించుచుంటివి? మహీజ? ముదంబున నుండనొప్పు నీ
వేలకొ యేకవేణివయి యీవిధి నుంటివి శోకలాలసా?
కాల మెఱుంగలేనిగతి గా, నుపవాసములేల సుందరీ? 97

---

1. (సర్వలోకమనోహర = సర్వలోకములకుమనోహారముగ నుండఁగలిగినది దేవి మాత్రమే.
2. సర్వాంగగుణ (సంపన్న) మూర్తి = ఇట్టుండి గలిగినదియు నాదేవిమాత్రమే.
3. విశాలాక్షి = విశాలమగునేత్రములు గలదాన యనిశబ్దార్థము. కాని 'విశాలాక్షి'యను పేరుగల దేవి ధ్వనించుచున్నది- (ఇవి మూలమందలి శబ్దములు)

చం. భయము స్వభావమెక్కొ! పర భామల బొంద, హరింప వారి సం
శయ మొకయింతలేక,యే, నిశాచరధర్మము స్వీయధర్మమున్
లయమొనరింప కుండగ, ఫలప్రదమౌగతిఁ బోవ దోషమా?
అయిననుగూర్మిలేని,నిను నంటుదలంపహితంబుజానకీ 98

ద్వి. ప్రేమ విహీనను ప్రేమింపఁ జాల
గామంబు మదియందె క్షామంబు నొందు 99

ఉ. పోయిన యౌవనంబు మఱి పొందఁగఁ జాలము యౌవనస్థితిం
బాయకముందె దార్ఢ్యమున భాసిలు నప్పుడె సర్వసౌఖ్యసం
ధాయకకర్మఁ బూనఁదగుఁ ధాత్రిజ? దాన ననుజ్ఞనిమ్ము నిన్
ధ్యేయగఁ జేసి సౌఖ్యగతిఁ దేవి తరింపఁ ద్రిలోకసుందరీ! 100

తే.గీ.నీదు సుందరతమతనూ స్నిగ్ధకాంతి
మరులు గొంటినిఁ బూజింపఁ బ్రార్థన మిదె
1భార్యగా నన్నుఁబొందుచు వరలుమింక
దేవి? త్రిపురసుందరి భక్తుఁదేల్చు మింక 101

చం. పరపురుషుండు వీడనెడి భావము మోహము వీడగా దగుం,
బరు లెవరమ్మనీకు నిను బ్రహ్మ సృజించి యపూర్వరూపఁ గా
విరమణమూనె సృష్టి, యని పించుచునున్నది, నీసమాన లె
వ్వరు భువిలేరు, మోహమునె బ్రహ్మయు నిన్గను
లోకసుందరీ! 102

తే.గీ.నిన్ను జూచిన కాలఁది నీ సన్నుతాంగ
ములను దేనిఁగనిన నందె పొందుఁ బొంది
లగ్నమగుచుండె నాహృది లలితమూర్తి
దాని మఱలింపఁ జాల సుందరి! నిజమ్ము 103

తే.గీ.పెక్కు రుత్తమ స్త్రీలు నా వెంటఁ గలరు
ఎక్క డెక్కడ నుండియోఁ యేరి తెచ్చి

1 భార్య= కాంతచేపూజింపదగినవి,

యుంటి నవ్వారి యందెల్ల నుండు మీవ
అగ్రమహిషగ భార్యవై యలరుచుండి 104

ఉ. తెచ్చితిఁ బెక్కుమంది సుదతీమణులన్ బహుసుందరాంగులన్
హెచ్చిన కూర్మి వారలకు ధ్యేయగఁ బట్టపు రాణి వీవయై
యచ్చపు భక్తినిచ్చు కుసు మాంజలులం గొనిచుండి నాకడం
బుచ్చుము దేవి! నీతనువుఁ బొందుచు సౌఖ్యమె యెప్డు
సుందరీ 105

శా. నానారాజ్యచరుండనై విజయినై నానామణుల్ గొంటి న
వ్వానిన్ సర్వము నీకొసంగితిని నన్ భావింపు నీవాని గా
నే నీ దాసుఁడ రాజ్యమెల్లయును నీదేసుమ్ము నా[1]భార్యవై
పూనంజెల్లు సమస్తసౌఖ్యతతులం బూబోడిరో సుందరీ 106

ఆ.వె.నీదు తండ్రికిత్తు నీనిమిత్తంబుగాఁ
బుడమినెల్ల గెలిచి భూమిపుత్రి!
కదనమందు నన్ను గవ్వించి గెలిచెడి
వాఁడు పుట్టలేదు లేఁడు పుడమి 107

తే.గీ.అసురవారము దేవత లాది బలులు
నపజయంబునె కాంచి రాహవ మొనర్చి
నిలువఁ జాలక, వారలు నలుదెసలకుఁ
బారిపోవఁగ నితరులఁ బల్కనేల? 108

ఉ. విఱిగిన వాహనంబులను వీడుచు నాయుధముల్ త్యజించుచున్
బఱువిడినారు దేవతలభాగ్యులు, రాక్షసు లాది వైరులెం
దఱొ మును నన్నెదిర్చి రని దానవనాథుని నన్జయింపగా
దర మొకొ యేరికైనను ద్రి ధామములందుఁ ద్రిలోకసుందరీ 109

శా. గారాబంబున జూడుమీ నను భవ త్కైంకర్యముం జేతు శా
రీరంబెల్ల సలంకరించుకొనుమీ స్త్రీలోక దివ్యాంబవై

1 భార్య = కాంతిచే పూజింపనర్హురాలు

నీరోఁజేసున్నను గాంచఁ గాముకుఁడ, సందేహింపఁ గానేల
కారంబౌ భవదాజ్ఞమై నడుప నాకాంక్షించు భృత్యుండగా 110

ఉ. చూతుము నాయశస్సు, సిరి ఁజూడుము నాదు సమస్తసంపదల్
బూడిదపాలు సేయకుముఁ భూరిగుణాన్వితరూపరేఖలన్
జేడియ నన్నుఁ బూని విలసిల్లుచు నుండిన నీదుబాంధవుల్
వేడుక సంతసించెదరు వేడెద నన్గృపఁజూడు సుందరీ! 111

మ. ధనరాజ్యాది సమస్తసంపద భవత్పాదాబ్జమందుంచితిన్
దనివాఁదంగ యధేచ్ఛమై నొసఁగుమీ దానిన్ మఱెవ్వారికేన్
వినియోగింపుము నాదు సర్వమును, నివే నాకు సర్వంబహో!
వనితారత్నమ! సత్యమే బలికితిన్ వాత్సల్యముం జూపుమీ 112

తే.గీ. [1]రూపసి! శుభుఁడు చీరధరుండు వాఁడు
[2]అతఁడు నిక్షిప్తవిజయుండు [3]గత [illegible]ముండు
[4]అతఁడు వనగోచరుండును నతఁడు [5]స్థండి
ల శయనుండును రాముఁ డలంతు వేల! 113

---

(మూలము = కింకరిష్యసి రామేణ, శుభగే చీరవాససా నిక్షిప్తవిజయో రామో గతశ్రీర్వనగోచరః)

1. నారచీరలు గట్టువాఁడు. 2. గెలుపు లేనివాఁడు. 3. సంపద లేనివాఁడు. 4. అడవులలోను, నీటియందును దిరుగాడు వాఁడు. 5. నేలమీఁద పరుండువాఁడు. అని రాముని పరముగా సామాన్యార్థము, ఈశ్లోకము విశేషార్థమును గూడ ధ్వనింపుచున్నది.

1. శుభగేచీరవాససా - అనుచోట, శుభగే + అచీరవాససా, అనుపదవిభాగమున నారచీరలు లేనివాఁడు, అనఁగా పీతాంబరధరుఁడు.
2. నిక్షిప్తవిజయ = విజయమే గలవాఁడు, సహజ విజయవంతుఁడు.
3. గతశ్రీ = పొందఁబడిన లక్ష్మి గలవాఁడు
4. వనగోచరః = నీటిలో జరించువాఁడు. అనఁగా నారాయణుఁడు
5. స్థండిలశాయి = యజ్ఞభూమి యందుండువాఁడు లేక పరుండువాఁడు నారాయణుఁడు

పై పద్యము మొదటి పాదము, శుభుఁడు చీరధరుండు, అని ఒక అర్థము. శుభుఁడు + అచీరధరుండు = శుభుఁడచీరధరుండు = నారాయణ పరముగా నర్థము గ్రహింపఁదగును.

ఉ. రాముఁడుగీముఁడంచన ద లంపఁ బ్రయోజనమేమి? జీవియై
భూమి గలండొ? లేఁడొ? తల బోయుటయెట్లు? సజీవియైయేయనన్
భూమిజఁ జూడఁ జాలఁడు సముద్రము దాఁటఁగలాఁడె దాఁటినన్
నా మమకారమూర్తి నెటు నాదటినుండి గ్రహింపఁ గల్గెడిన్ 114

ఉ. సుందరమందహాసమును సొంపగు నీపనుకట్టు తీరు నీ
యిందు నిభాననంబు వనజేక్షణముల్ హృదయాపహారముల్
కందళపాటునం జిలువఁ గాళ్ల గ్రహించు సుపర్ణరీతి నీ
యందము నామనంబు నటు లాగ్రహణంబొనరించె సుందరీ! 115

ఉ. కట్టిన పట్టుబట్ట నల గం, దనువెల్లఁ గృశించి యుండియున్
నెట్టి విభూషలన్ మనెడి నిన్నిటు గాంచియు, భార్యలందు ని
ప్పట్టునఁ గూడ నేరతిని బాసితి సర్వసుఖంబు లొందఁ జేఁ
బట్టఁగఁ గోరుచుంటి నిను భార్యల కెల్లర కగ్రభార్యగా 116

ఉ. చక్కని చుక్కలైన నిజ చారువిలోచనభార్యలందు నీ
వెక్కువగాగ ధ్యేయవయి యింతిరొ యుండు మదగ్రభార్యవై
నెక్కొను భక్తి గొల్తు రను నిత్యము నాదగు భార్యలెప్డు, పెం
పెక్కిన కూర్మి, నప్సరస లిందిరఁ బూజ లొనర్చు
మాడ్కిగా 117

తే.గీ.రత్నరాసులు రాజ్యసర్వస్వము గొను
నన్నుఁ జేపట్టి సుఖియింపు సన్నుతాంగి!
బలము దపసు బరాక్రమంబులు గనంగ
రాము డెటుసాటియే నాకు రమణి గనుము 118

చం. భయముఁ ద్యజించి భూషణవిభాసురమూర్తివిగా సుమావృతం
బయి; తనరారు కొమ్మలవిహారము సల్పెడిభృంగవాటికన్
మెయి శ్రమదీర నబ్ధితటి మేదురపుష్పవనాంతరంబునన్
లయ మొనరించి దుఃఖము విలాసముగా మనుమగ్రభార్యవై 119

సీతసమాధానము

చం. అసురుఁడు రావణుం డతిభయంకరమూర్తి ధరాత్మజాతతో
వినవినఁ బల్కుఁగాఁ బ్రియము వెల్లువల్లె ప్రవహించురీతిఁ నా

రసి భయకంపితాంగియయి వాల్చిన నెమ్మొగ మెత్తకుండ, రా
క్షసపతి కాడె శాంతముగ సాధ్వి తృణం బొక టుంచి మధ్యగా 120

ఆ.వె.గడ్డిపఱకవంటి దొడ్డవాడవుసుమ
ఈవ యనుచు దెలుపనెంచియేమొ!
కనుచుఁ దృణము సీత గద్గదికంబునఁ
బలుకసాగె దైత్యపతికి మాఱు 121

ఆ.వె.పరునితోడ మాటఁ బలుక బతివ్రత
యిష్టపడమి తృణము నెంచి దానిఁ
గాంచి దీనగాగ గరినత విడనాడి
మాఱు,వలికె నసురమాట కంత 122

తే.గీ.దుఃఖమున నార్త యయ్యును దుడుకులేక
నిజ శుచిస్మితముఖమున నీరజాక్షి
ఆతపస్విని, తృణ మెంచి యనఁగడంగెఁ
జూచువారికి గడు జాలి దోచుగతిని 123

తే.గీ.కాము,కుఁడు పశు,ప్రాయుఁడు గాన వాని
కీయఁదగినది గడ్డిగా నెంచి తృణమె
నిడుచు నాతని పశుతత్త్వ మెఱుకసేయ
నెంచి, గడ్డిపఱక నొండు నెంచి పలికె 124

తే.గీ.అతిథిమర్యాదరీతిగా నవనిజాత
యసురరాజ్యాధిపతి కిడు నాసనంబు
గా నతనిముందు దృణ మిడు కారణంబొ!
యదియ తనయొద్దనుండిన దగుటవలన 125

ఉ. మానుము నాపం యిందలఁపు మళ్ళగఁజేయుము నీదుబుద్ధి నీ
మానితలౌ సతీమణుల మానసవర్తివి గమ్ము పాపుఁడౌ
వానికి మోక్ష మబ్బునొకొ; వాఁడుతదర్థము ప్రాకులాడినన్-
దానవనాథ! నే నటుగ దక్కను నీకు, దృజింపు మా మతిన్ 126

ఉ. పుట్టితి బూజ్యవంశమున బొందితి నేమహనీయవంశమున్
బుట్టిన మెట్టినట్టి కులముల్ ఘనముల్ గద; నే పతివ్రతన్
నెట్టుచు గీర్తినంతయును నిందితకార్యము సేయఁబూన నే
పట్టునఁగాని యంచని గుభాలున మేనును ద్రిప్పి వెన్కకున్ 127

కం. అన్యుని భార్యనుగద! ని
న్నన్యుని వరియింపఁదగునె! ఆర్యేతరసా
మాన్యముఁ గూడను గా దిది
వన్యమృగంబులు చరించు పద్ధతి కాదే 128

ఉ. చక్కని ధర్మమార్గమున సాధుజనంబు చరించురీతి బెం
పెక్కిన గూర్మి నీదుసతు లెల్లరఁగూడి సుఖింపనొప్పు; వా
రొక్కెడ నన్యసంగమము నొందిన నీ వెటు లార్తిఁగుందెదో!
అక్కరణిం దలంపనగు నన్యులభార్యలగూర్చి రావణా? 129

ద్వి. తనభార్యలం గూడి తని వొందలేని
మనుజు నాయువు సిరి మాయమై పోవు 130

ద్వి. పరభార్యలం గూడు పాపుండు చెడును
వరగుణహీనుఁడై సిరి యెల్లఁ దొలఁగి 131

ఉ. వినయము మంచిపెద్దల వివేకము దెల్పఁగలట్టివారలే
రును గనరారొ! నీజనము లో! వినవో యల విజ్ఞులాడు మం
చిని గన ధర్మమార్గము రుచింపక, వారల ధిక్కరించుటన్
నిను విడనాడిరో? విడిరొ నీగతి నీదని చెప్పినారలో 132

ఉ. వినయనటుండవీ వనుచు విజ్ఞు లెఱుంగక ధర్మమార్గమున్
వినుమని నీకుఁ జెప్పినను వీనులఁ బెట్టక, దైత్యవంశ, నా
శనమగురీతిఁ బూనితె నిశాచరవంశవినాశ మూలమే
యని మదిఁ దోచకున్నదికదా? అసురా? చెడె దీవు నమ్ముమీ 133

తే.గీ. దుష్టుఁ డజ్ఞాని, రాజైనదోషమునను
సకల సంపద్యుతమ్మయ్యు సమసిపోవు

నతనిరాజ్యంబు సర్వంబు నతనిముందె
నగరములుఁ బట్టణంబులు నాశమగును 134

తే.గీ.సర్వసంపత్తియుత రత్నసంకులంబు
సకలసుఖదంబు రాజ్యంబు సమసిపోవు
భూపుఁ డొనరించు నపచారమున నిజంబు
శీఘ్రగతి నీదు లంకయు జెడును సుమ్మి 135

తే.గీ.ప్రాణికోటి సంతసిలెడి పాపి, దూర
దృష్టిహీనుండయి స్వకర్మనే,నశింప
నీవు మునుజేసియుండిన నేరములనె
త్రుళ్ళ,లోకవారంబు సంతోషమొందు 136

ఉ. పొందదు సీత లోభమును బొందదు మోదము నీదుభార్య లా
నందముతోడ గొల్చినను నాపతి రాఘవుఁదప్ప నన్యు నే
డెందమునం దలంప భ్రమ లేదు రవంతయు దేనిపైన, నే
నుందు సతంబు, నెండ రవి నొప్పుగఁ బాయనిరీతి రాముతో 137

తే.గీ.వేదముల సాంగముగ నేర్చి విజ్ఞుఁ డగుచు
సాధుసంగతి, శీలంబు సత్యనిరతి
తో మనగఁజెల్లు రామభద్రునకె తగిన
భార్యనైన నే, నిను ముట్ట భ్రాంతి వీడు 138

తే.గీ.రాఘవుని లోకనాథుని రాగ మొంది
వాని కౌఁగిట జేరిన,దాన నేను
వేరొకని ముట్టనొల్ల దీ విదుషి సీత
రాముఁ డా వసుధాపతిరమణి నేను 139

తే.గీ.వీడి,రాఘవుభర్తను విపినసీమ
దుఃఖితను నన్ను గూర్పు, నాదుపతి కింక
శుభమె యగు నీకు బొంద వశుభమునేమి
రావణా? విను నామాట రాముమాట 140

ఉ. లంక సుఖింపనెంతువె, దురాగతము న్విడి రామమూర్తితోఁ
గొంకక స్నేహమున్ సలుపగోరుము దండధరుండు రాకమున్
బంకము వీడి; రాఘవుఁడు వత్సలతం గృపఁ జూచు నిన్నుభ
క్త్యంకురముల్ గ్రహించి, శరణాగతవత్సలుఁ డౌట
గూర్మిమై 141

ఉ. పొందుము రాముమైత్రి నను బొల్పుగ రామున కప్పగించి,యా
నందము నొంది యంత శరణాగతవత్సలుఁడౌట, నాతఁడున్
నింద దలంపకుండ నిను నెయ్యమునం గనఁజాలు, నేనునున్
వందన మాచరించుచు గృప న్నిను గావఁగ రాము వేడెదన్ 142

చం. శరణము నొచ్చి నీవు రఘుచంద్రుని వేడుము చిత్తశుద్ధితో
నరమర వీడి నేనును మదాత్మ విభుంగని చెప్పుదాన ని
న్గరుణమెయిన్ క్షమించి, మఱిఁ గావఁగ నా పురుషోత్తముండునా
పరహితవర్తనుండు నిను భక్తుని నంతటఁ బోఁవకుండునా? 143

చం. శరణము వేడు నంత రఘుచంద్రుఁడు ధర్మవిచక్షణుండువే
పరమహితంబుఁ జూపెడి కృపామతి, లేసియెడ న్గొనున్ననున్
దురమున నిన్నుఁ జంపి, కుపితుండగు రాముఁడు వీడ
డెప్పుడున్
దురితుల, ధర్మరక్షణమునే విదితాత్ముఁడు గాంచు రావణా 144

చం. సురపతి యాయుధంబునను, ద్రుక్కకయుండెదవేమొ!
ధర్మరాట్
శరమును గెల్తువేమొ! రఘుశస్త్రముమాత్రము, వీడఁబోదు నిన్
ద్వరితగతిన్, రఘూత్తముని ధార్మిక టాంకృతి విందులంక, భీ
కర నినదంబు నిండుచు దిగంతములందుఁ బ్రతిధ్వనించెడిన్ 145

ఉ. రాముని బాణసంచయము లక్ష్మణుతూపులు లంక నిండుచున్
వ్యోమతలంబుదాకఁ జని యుద్ధమునం దుదముట్టఁజేయు నిన్
రాముఁడు, వైనతేయుగతి రావణసర్పము బట్టిచంపుఁ గా
నేమనియెంచుచుంటివో నరేశుఁడు రాఘవతాముశక్తినిన్ 146

చం. విడువగఁజేసె నాసురుని విష్ణువు ము న్నలరాజ్యలక్ష్మి, మూఁ
డడుగుల నేలతో నటుగ నాసురరాజ? మదీయభర్త, రా
ముఁడరుగుదెంచి, స్వీయరమఁ బూనుచు గర్వమునెందు
నిన్నహో
విడివడఁజేయుఁ భూమి, నరివీరభయంకరుఁ డాతఁ డెంచుమీ 147

ఉ. కానవొ నీదుబాంధవులఁ గార్ముకవీరుఁడు రాముఁ,డాజన
స్థానమునన్ సమూలముగఁ జంపుట, దొంగిలినావు, రామరా
మానుజు లుండనట్టితఱి నావని నొంటిగ నన్నుఁ గాంచి;ఏ
మైనది నీబలంబు రఘుమాన్యులు వచ్చెడిదాఁక నిల్వవే 148

చం. తొలుతనె రామలక్ష్మణులతో నని నల్వఁగలేనిభీతి, దొం
గిలికొని తెచ్చి తీవు నను గీడ్పడకుందువె, పోరునల్వ, వా
రలిరువురున్ రణంబుననె రావణ ని న్వధియించువారు, ము
న్నల సురరాజు వృత్రరిపు నాలమునం దునుమాడినట్లుగా 149

చం. ధనదునిజేరెదో? వరుణు దగ్గర కేగెదొ; దాగ నెంచి, రా
మునిగుఱి దాటుదే? పిడుగు భూజమునం బడ దగ్ధమౌగతిన్
గనెద వసంశయంబుసుమ కాలహతుండవు కావె కానిచో
నను గొనితెత్తువే యిటకు నా కిటు పల్కెదొ చెడ్డమాటలన్ 150

రావణుఁడు క్రుద్ధుఁడగుట

ఉ. సీతమృదూక్తులన్ హితము సెప్పగ గర్ణకఠోరమై సురా
రాతియు, గ్రుద్ధుడై వలపు రాజమదిం, దిగ్రమింగుచున్ ధరా
సూతిని జూచుచుం, ద్రిపురసుందరి మోహవశంవదుండుఁగాఁ
బ్రీతిని, భీతినిం గొలుపఁ బ్రేరణ సేయుచుఁ బల్కె
నంతటన్ 151

తే.గీ. పురుషు డెంతెంత, రమణిని బుజ్జగించు
నంతగా వారిస్వాధీనుఁ డౌను వాడు
ఎంతగాఁ బ్రేమ జూపునో యంతకంత
వానిని ధిరస్కరింతురు వనిత లెపుడు 152

తే.గీ.ప్రేమపాశంబులం బట్టి కామ మణఁచి
వర్తిలుచునుంటి, నినుఁ జంప వదలినాఁడ
కానియెడ నీదు మాటొక్కటేని చాలు
నిన్ను వధియింప గ్రోధంబు తెన్నుఁబట్టి 153

తే.గీ.దారి దప్పిన రథమును సారథివలెఁ
గళ్ళెముల బట్టి హయములఁ గదలనిచ్చు
గతిగ నాకామసంగతిఁ గట్టిగాఁగఁ
బట్టి, క్రోధంబు దిగమ్రింగు వాఁడ నైతి 154

ఆ.వె.కామ మెల్లవారు కాదనదగినదే
కాని దానివెంటఁ గరుణ మైత్రి
యంటి యుండుచు దోషసంహార మొదవు
దాన నిన్నిప్పు చంపఁగాఁ బూననైతి 155

తే.గీ.కపటసన్యాసి రామునికాంక్ష దగిలి
నన్నె యవమాన మొనరించి యున్న నీవు
చంపఁదగినదా,నవె యయ్యుఁ జంప బూన
నతివ? నీమీద మోహంబె యమితమగుట 156

తే.గీ.కోరుచున్నాఁడ భార్యగాఁ గోప మేల?
పరమహితమున గని నన్ను భార్యగాఁగఁ
బూజనీయవుగా సీత పొందు సుఖము
నాదు సర్వమ్ము నీయదే నమ్ము మబల! 157

తే.గీ.[1]ఎంత వేడిన నీదయ సుంతయేనిఁ
గాంచఁజాలను నీయెడఁ గరుణ యేల?
అయిననే నిచ్చియుండిన యవధిదాక
వేచియుండెద నీకు వివేక మొదవ 158

---

[1] ద్వౌమాసౌ రక్షితవ్యౌ, మేయోవధిస్తేమయాకృతః తతశ్శయన మారోహ మమత్వం వరవర్ణిని 22 స్వ 8 శ్లో.

తే.గీ. మున్ను. గడు విడినాడగా సన్నుతాంగి
రెండు మాసంబు లాగడు వుండె నింక
గడువులోపల నన్నీవు గణనఁ జేసి
గడువు గడిచినయంత నన్గలియవలయు 159

తే.గీ.*గడువులోపల భార్యవై గ్రాలకున్న
గడువుదీరిన మఱునాడె కాంత నిన్ను
ప్రాతరాశార్థమై, చంపి వంటయింట
వండి నంజుగా నిడువారు వంటవారు 160

సీ. త్రిపురసుందరిరూప తేజంబు ధ్యేయమై
భూషణంబుల మేన బూనఁగోరె
ఇంపఱి మాసిన యేకవస్త్రము వీడి
కనకాంబరంబునఁ గ్రాలఁగోరె
నేలను విడనాడి నెమ్మిమై యందమౌ
తనసౌధరాజినిఁ దనరఁగోరె
తాను భక్షించెడి పానీయమాంసముల్
గడు వేగఁ గైకొని గడఁగఁగోరె

---

*(ఊర్ధ్వం ద్వాభ్యాం తు మాసాభ్యాం భర్తారం మా మనిచ్ఛతీం. మమ త్వాం ప్రాతరాశార్థమాలభంతే మహానసే" మూలము 22 సర్గ. శ్లో. 9)

దీనికి మహేశ్వర. వ్యాఖ్య. 8 9 శ్లో ములకు.

"హేమే ఓలక్ష్మి? సీతా? మయా నాచేత, యః = ఏ, అవధి = గడువు: కృతః చేయబడినదో, (పన్నెండు నెలలు గడువుగా నిచ్చి యుంటినో, అందు రెండు మాసములు మాత్రమే రక్షింపవగియున్నవి. ఈ రెండు మాసములు గడచిన పిమ్మట, తే = నీయొక్క, భర్తనంగీకరింపక మమ = నన్ను, అనగా నారాజ్యలక్ష్మిని; ప్రాప్స్యసిపొందగలవు. నినుఁ బ్రార్థించు చున్నాను. మమ = నాయొక్క; మహానసే = వంటయింటియందు; ప్రాతరాశార్థం = ప్రాతః కాలభోజనమునకు; ఆలభన్తే (ప్రశువులను) చంపుచున్నారు. వానిని భుజింపుమని అర్థము శయనమారోహ = హాయిగాబరుండుము. అని అర్థము)

తే.గీ. పూలమాలల ధరియించి పూజ్య గాగఁ
గోరె, ఆరాధన మొనర్చు కోర్కెఁ దెలిపె
[1]భార్యగానొప్పి సుఖశయ్య వరలు మనియె
అంత్యసందేశముగరావణాసురుండు 161

తే.గీ. రావణుం డిట్లు నినయంత రాక్షసేంద్రు
తోడ వచ్చిన దేవతాతోయజాక్షు
లందఱు విభీతలై కను లరుణము లవ
నీరు గార్చుచు దుఃఖించినార లపుడు 162

సీతకఠినవాక్కులు

మ. కుటిలభ్రూకుటి రక్తనేత్రములతో గోపంబు రూపొందగా
బటు బాహాబలగర్వితుండవయి సంభాషించితే రావణా
చటులాస్త్రప్రథితుండు రాఘవుఁడు రాచావున్ నివారింపనీ
వెట దాగం జనినన్ నినున్ విడువ కాత్మేశుండు గూల్చున్
భువిన్ 163

ఉ. నోటికి వచ్చినట్లు హృది నొవ్వగఁ బల్కితె దుష్టబుద్ధి, నా
బోటి పతివ్రతా ఘనతపోబలశక్తి గ్రహింపలేక, ఆ
రాట మదేల? నివ్వలచి రాముని వీడుచు భార్య నౌదునే?
పాటిఁ దొలంగి నన్నెవరు భార్యగఁ గోరరుగా జగత్త్రయిన్ 164

చం. కటకట! యొక్కరేని యిట గాలము వేసిన గూడలేరె! ప్రా
కట నిజధర్మముం దెలుపఁగాఁ గలవారలు నీకు రావణా?
యిటుల ననుం బతివ్రతను బాములపాలొనరింపఁబూనెదో
పటుతర దివ్యబాహుబలవంతుఁడు రాముఁడటంచు నెంచుమీ 165

తే.గీ. మదపుటేనుఁగ కుందేలుమాదిరి యగు
రాముతో నీవు పోరుట రావణుండ
మత్తగజ మేడ? శశమేడ? రిత్తకోర్కె
వీడి మసఁదగు, దైత్య వివేక మూని 166

---

1. పూజ్యురాలిగా.

ఉ. సిగ్గొక యింత లేకఁ గడుఁ జెడ్డతలంపున బింకమౌ, నుడుల్
బిగ్గర గాగ వాకొనెదు బీరములాడెదు రామలక్ష్మణుల్
దగ్గర లేనివేళనుగదా హరియించితి వీవు నన్ను నిన్
బుగ్గి యొనర్పరే కనులపుందిటు. నన్ హరియింపబూనినన్ 167

తే.గీ. ననుఁ బతివ్రత, దుర్బుద్ధిఁ గనెడి కండ్లు
భూమిపై రాలకున్నవే యేమికతమొ!
అనఁగ రానట్టిమాటల నాడు నాల్క
తెగి పఁడదో యేలనో జన్మ తెగుటకేమొ 168

ఉ. నేను పతివ్రతామహిత నిశ్చల శక్తి గలట్టిదాన, నే
బూని శపించితేనిఁ ద్రుటి బూడిదవయ్యెద వీవు, కాని, భూ
జాని యనుజ్ఞ లేక నిను శాపమొసంగుచుఁ జంప నొల్ల, న
ద్దాన పతివ్రతావిహిత ధర్మతపంబులు తగ్గిపోవుగా 169

ఉ. రాముఁడె నిన్వధించుటకు రాఁగలవాడు, శపించి చంపుచో
నామహితాత్మకీర్తి చెడు నాసురు సీతయె చంపెనంచునున్
రాముని దూరమంపుటయు రామను నగ్గొని వచ్చు బుద్ధియున్
నీమరణంబె హేతువయి నిర్ణయమాయె విధిప్రయుక్తమై 170

చం. దురితులు చావ శాప మిడుతుంచుడుకుం గలదాన గాను ప్రే
మరహిత గాను, జాపి, ససమానదయన్ క్షమియించుదానని
న్నరమర వీడి భస్మముగ నంతమొనర్చు పతివ్రతా ప్రభా
గరిమ గలట్టిదాన నగు గాక క్షమింతును నిన్ను రావణా! 171

ఉ. సీత యెఱింగి రావణుని చిత్తవిశుద్ధత, ప్రేమమూర్తియై
ఆతని మందలించె నపహారము సేసిన దుష్టబుద్ధికై
పూతచరిత్ర లోకగతిఁ బుక్కిలిఁబట్టుచు గోపతాపముల్
మాతగ లోకరీతియగు మాటల గాఁగలదాని దెల్పుచున్ 172

శా. పాతివ్రత్య తపోబలాతిశయ గర్వాయత్తచిత్తన్ ధరా
జాతం గాంచుచుఁ గ్రుద్ధుఁడై యసురరాజన్యుండు పల్కెడెగా

సీతా? చెప్పిన మాటలం బెడచెవిం జేర్పంగ నుంకించితే?
సీతార్థున్ వనవాసి నిన్ వలచియే బిట్టాడుచున్నా వౌకో? 173

మ. అనుచున్ రోషపరీతచిత్తుఁడయి, రక్తాక్షుల్ వెలిం గ్రక్కఁగా
ననలంబున్ బుసకొట్టు సర్పమనఁగా నాసీత, వీక్షించుచున్
దన రాకాసులఁ గాంచి యీధరణిజాతన్నన్నుఁ జేపట్టఁగా
బని బూనుండనె సామ దాన చతురోపాయంబులం దోడనే 174

రావణుఁడు-(ధాన్యమాలిని) మండోదరి

ఉ. మించిన కోపతావముల మేన్ విదళించుచు రావణుండు గాం
డ్రించుచు వ్యాఘ్రరీతి నదరించుచుసీతను మాటిమాటికిన్
గాంచుచు రాక్షసీజనముఁ గాలము మీఱక, సీత, తన్ను, మో
హించెడి చొప్పు నేపగిది నేని, యొనర్పఁగ నాన తిచ్చెడిన్ 175

ఆ.వె.కామమోహమయుని గాంఢ్రించు తనభర్తఁ
గాంచి ధాన్యమాలి కడపటి సతి
తన్నుఁగూడి సుఖము దనివొందఁ బొందఁగా
వేడె నాతఁడు పశమింప ప్రేమమీఱ 176

తే.గీ.సకలరాక్షసరాజ? ఓ చక్రవర్తి
మానుషాంగన నీకేల? మహితరాజ్య
వైభవ మనుభవింప నీ మనుజభామ
బ్రహ్మ లిఖియింప లేదు నీ భార్యగాగ 177

తే.గీ.తన్ను వరియింపఁ జాలని తన్వి పొందు
సుఖమొసంగునె! దేహంబు స్రుక్కుఁ గాని
ఇచ్ఛగలదాని నేనుండ స్వేచ్ఛతోడ
ననుభవింపుము సుఖముల నసురరాజ? 178

చం. తన సతి ధాన్యమాలి నుడి దైత్యకులాధిపుఁ డాలకించి, సీ
తనువిడి, దద్దరిల్ల వసు ధాస్థలి భీకరపాదఘట్టనన్

జనియె, నిజాశ్రితాంగనలు జవ్వనులౌ సురనాగదేవతా
వనితలు, వందిమాగధులు భార్యలు, రా నిజసౌధరాజికిన్ 179

సీత-రాక్షసస్త్రీలు

ఉ. రావణుఁ డాగతిన్ వెడల రాక్షసభామలు భీతరూప లా
దేవిని ముట్టడించుచుఁ బదేపది పల్కిరి ఘోరవాక్కులన్
దేవవిరోధి రాజ్యరమ దివ్యకులంబుఁ బరాక్రమంబులన్
దీ విభవంబునున్ వినుత తేజము నాయమకిచ్చపుట్టగన్ 180

చం. అతఁడు పులస్త్యవంశజుఁడు సల్ల ప్రజాపతి కోవవాఁడు గా
అతఁడు ఘనుండు విశ్రవసు నాత్మజుఁడున్ విజయుండు సర్వదా
అతఁడు మహాబలుం డరిభయంకరుఁడున్ దశకంఠుఁడుంగదా
వరలదగుంగదా యతని భార్యగ సంతతసౌఖ్యసిద్ధికై 181

తే.గీ. ఏకజట యిట్లుపల్కెడి నెట్టుకనుల
పిల్లికన్నులహరిజట పిల్లి గ్రుడ్ల
దిప్పుచు భయంబు గలుగ పృథ్వీజ డాసి
గట్టిగా పలికెడి దశకంఠుఁగూడ 182

తే.గీ. ముప్పదియు మూడు కోటుల నొప్పు సురల
రాజుఁ గెల్చి కీర్తిని గన్న రాక్షసేంద్రుఁ
దనకుఁ దానిన్ను వలచిన దానవేశు
భార్యగ సకలసుఖముల ఁబడయవేల? 183

ద్వి. అను నామె తోడుగా, నన బూనె ప్రఘస
ఘనకోపమూర్తియై చని సీతకడకు 184

ఉ. ఏల నిరాకరింతువహ యింతిరో? భర్తగ, రావణేశు నీ
వేల తిరస్కరించెదు మహీస్థలియందసమానశౌర్యు ని
న్నేలఁదలంచెగా, నవతు లెల్లరు మిన్నగఁ జూచురీ గా
బాలధరించి త్రావి మధువున్ సుఖమొందుము ర్యమై సదా 185

ఉ. ఆ దరహాసచంద్రికల నా సురనాథుని ప్రేమగొన్నసుం
దోదరిఁ గూడవీడుచుఁ గడున్ నిను బ్రేముడిఁ బొందువాఁడు వే
లాదిగ స్త్రీజనంబుగల యంతిపురంబుఁ ద్యజించి కూడ నీ
పాదము లాశ్రయించి మను వాఁడసురాగ్రణి గూడు భార్యవై 186

గీ. నాగగంధర్వదానవుల్ రాగ ననికి
నెవఁడు నిర్జించెనో వాఁడె యిపుడు, ప్రేమ
నాశ్రయించెడి నిన్ను, నీ వతని కేల
భార్యగా నుండనొల్లవు పాడుదాన! 187

గీ. రావణుఁడు మహాత్ముఁడు సకలముఁగలాఁడు
సర్వసంపత్కరుండు రాక్షసవిభుండు
నీ వతని భార్యవై యుండ నీసడింపఁ
దలఁతె యధమబుద్ధినిఁ గాల ఁదన్ని సిరిని 188

ఆ. అనుచు వికట బల్కె నంత దుర్ముఖి వచ్చి
సీత కంత హితము నెప్పఁ గడఁగె
ప్రీతి భయముఁ గొలుపు విధముగ నామెకు
దానవేశుఘనతఁ బూని పలికె 189

చం. ఎవనిభయంబుచే రవియు నెప్పుడు వేడి దపింపఁజేయఁడో
ఎవని భయంబుచే ననిలుఁ డెప్డు ప్రచండ గతిం జరింపఁడో
ఎవని భయంబునన్ వరుణుఁడిచ్చు సమృద్ధిగ మాత్రమే జలం
బెవని భయంబుచే తరువు లిట్లాదవున్ సుమవృష్టి నెవ్వఁడీ
భువి నగు రాజరాజతనిఁ బొందఁగ భార్యగ సంశయింతువే 190

గీ. చెప్పితిమిగా యథార్థంబు సీత!నీకు
దేవి? మామాటవినుము సందేహమేల?
వేరు గతినెంతువేని జీవింప వీవు
చిఱునగవుసీత! మామాటఁ జెవినిఁ బెట్టు 191

ఉ. అంతిపురంబు నందు సుఖమందగ శయ్యగలట్టిచోట, దే
వాంతకుఁడుంచ నెంచు నిను నందులకేల ననుగ్రహింపవో

యింతగ రాముమీఁద మనసేలనె? మానవుభార్యగాఁ దలం
పంతయు వీడుమింక గన వాతని మూర్తినిగూడ నీ వికన్ 192

గే. మూఁడు లోకాలగల సిరిఁ గూడియున్న
రావణేశ్వరు భార్యవై, రమణి!, వసుధ
సర్వసుఖముల విహరింపఁ జాలవౌకొ
వినుము మామాటఁ బెడచెవిఁ బెట్టవలదు 193

గీ. మహితమంగళరూపిణీ మానుషివయి
మనుజు, వాంఛితార్థంబులఁ గనఁగ లేని
రాజ్యహీనుని కోరెదో రావణుండు
వేడుచున్నను నుంతేని వినవదేల? 194

గీ. అనుచు నటనున్న రాక్షస వనితలెల్ల
భీకరాకృతి బెదిరించి భీతిఁ గొల్పి
చెప్పు మాటల నన్నింటి సీత వినుచుఁ
గనులఁ దడిబెట్టి మాటాడఁ గడఁగెనంత 195

సీత మాటాడుట

గీ. లోకవిద్విష్టకార్యంబు నాకు చెప్పి
నారలె యొకటిగాఁ జేరి మీరలెల్ల
పాపమిటులాడ, గా వెరఁవదొ? మనంబు
పాపపుంబని చేయు భావంబు లేదు 196

తే.గీ.మీర లందఱు నేకమై మ్రింగఁదలఁతు
రేని, నను మ్రింగివేయుఁడు కానిపనికిఁ
బూననొల్ల నా రాముఁడు దీనుఁడె యగు
రాజ్య హీనుండె యగుఁ గాని రాము వీడ 197

తే.గీ.దైత్యుభార్యగ, నరనారి తగదు తగదు
రామువీడను భానుమ్మ రవినిగూడి
యెటులనుండునొ నేఁగూడ నటుల నుందు
నా కధికుఁ డాతఁడేయని నమ్మియుంటి 198

ఆ.వె. వేయికండ్లవాని వేల్పులఱేఁనిని
గూడియుండు శచిగ గూడియుందు
రాము నాదుభర్త రాజీవలోచను
దీనుఁడైన రాజ్య హీనుఁడైన

మాలిక

గీ. గ్రుడ్డివాని భర్తగ తండ్రి కూర్చియుండ
నా చ్యవనమహర్షిని సుకన్యకొలుచుగతిఁ
పలువు రిల్లాండ్ర గూడుచు జలినొసంగు
శశిని గూడిన రోహిణీ చారువదన
వోలె నా రాము రఘురాము పొందు దాన
నడవి యందున్న నేమి? యతఁడె ఘనుఁడు
రాఘవుని వీడనొల్ల దీ రామ వినుఁడు
చావు దరినున్నదని విని సత్యవంతు
పతిగఁ గైకొని సావిత్రి వరలినట్లు
యోగి కపిలుని శ్రీమతి రాగమూని
సేవఁ జేసిన గతి రాము సేవ నుందు
ఆ యగస్త్యు దరిద్రుని యవనినాథు
పుత్రియయ్యు లోపాముద్ర పూర్ణభక్తి
నతని వీడకుండినగతి నా రఘువరు
వీడఁబోవను రావణు నీడఁ బోను
ఆ వసిష్ఠశాపంబున నసురుఁడైన
భర్త, సౌధామ వీడని భార్యవోలె
నడవి యందున్ననేమి? నా యనఘు రాము
వీడనొల్లను, రావణు వాడఁ జేర
రాజ్యరమ జూదమందోడి రమణిఁగూడి
యడవి దిరుగాడు నలు, విగతాంబరు, సతి
మున్ను దమయంతి యిడుముల నెన్నొ గాంచి
పతినిఁ గనినట్లు, నేను నా పతిని రాము
ధర్మవీరునిఁ జేరెద దైత్యునొల్ల

గీ. ఆ కురూపుల బెదిరింపు లన్ని వినుచు
శింశుపావృక్షమందు వసించి యున్న
హనుమ, సీతాసమాధాన మంత వినుచు
సర్వమును జూచుచుండెఁ బ్రశాంతవృత్తి 201

రాక్షస స్త్రీలవిజృంభణము

ఉ. కాని నిశాచరీభయద కాంతలు భీకరమూర్తులై సమా
ధానము విన్నయంత వెస ధాత్రిజఁ జూచుచుఁ జుట్టిముట్టి కో
పానలరక్తనేత్రలయి హస్తములంగొని గండ్రగొడ్డలుల్
జానకి పైఁ బయింబడుచుఁ జంపెదమంచనినార రెల్లరున్ 202

ద్వి. తగదీమె భార్యగా దైత్యనాథునకు
వగలేకఁ జంపఁగాఁ దగినదే యనుచు 203

ద్వి. విలయతాండవమూని విఱ్ఱ వీగుచును
గలయఁ ద్రొక్కుచు గానఁ బలుకాడు వారి 204

ద్వి. నడుమ నుండిన సీత వడివడిఁ జేరె
కడుఁదరి శింశుపా కాండంబు కడకు 205

ఆ.వె. కనుల నిండు నీరు కమలాక్షి తుడుచుచు
శింశుపాద్రుమంబుఁ జేరి నిలిచె
నటనె శాఖనున్న హనుమంతుఁ డిదియెల్లఁ
గనుచునుండె గిన్క గనుచు హృదిని 206

తే.గీ. మరల దైత్యకురూపలు ధరణిజ దరి
వచ్చి చుట్టుముట్టుచు భీతి వడిన యామెఁ
గాంచి పలికిరి తొలిరీతిఁ గాగ నంత
వినరయనురక్కసి నయాన వినుతిఁ బలుకు 207

తే.గీ. భర్తయెడఁగల స్నేహంబు పరమభక్తి
వెల్లడించితి వీవిటు విశద మయ్యె

కాని యేదేని మిక్కుటమైన కొలఁది
వ్యసన హేతువె యగు సుమ్మి వనజనేత్ర 208

ఉ. సీతరో? నీవు మానవులు చెప్పు పతివ్రతధర్మమెల్ల వి
ఖ్యాతిగఁ జూపినావు ముద మందితి నంతియ చాలు నింక సం
ప్రీతిని నానుడిన్ జెవినిఁ బెట్టుము నీ హితురాల నంతయుం
జాతముగాదు ధర్మము రవంతయు దోషము లేదు నీ కిలన్ 209

ఉ. రాక్షసభర్తయై తనరు రావణు భర్తగ నింక గొమ్ము సం
రక్షణ మూనఁగాఁదగుఁ బరాక్రమవంతుఁడు రూపవంతుఁడున్
దక్షిణుఁడైనవాడుఁగడుఁ ద్యాగము శీలముగాఁగలాఁడు నీ
వక్షయసౌఖ్యసంపదల నందగ రావణు నాశ్రయింపుమీ 210

తే.గీ. అంగరాగంబులన్ బూని యతివమిన్న
దివ్యభూషల దాల్చి వైదేహి! కనుము
మనుజు రాముని విడనాడి మహితమూర్తి
రావణేశుని భార్యవై రాణిఁ గనుము 211

ఉ. ఇంతటినుంచి సర్వజగదీశ్వరివౌచు మనంగ నొప్పు నే
పంతును దైత్యులెల్లరును పెద్దలు పిన్నలు పూజ సల్పుచున్
గాంతరో! యగ్ని దేవునకు గాంతగ స్వాహా చెలంగునట్లు దే
వాంతకు గొల్వుమీ శచి సురాధిపు చెంత వసించు రీతిగా 212

తే.గీ. వీడు మిక రాముఁ గృపణుని వీడు మింత
వాడు గతజీవి, రావణువైరి యగుచు
నింపుగా నాహితంబు జాటింపవేని
యిప్పుడే మేము నిన్ను భక్షింతు మబల! 213

తే.గీ. వికట యను నామె పిడికిలి బిగియఁబట్టి
సీతపై దూకి గర్జించి చెప్పఁగడఁగె
నోర్చితే మిక నిన్ను నీ వొప్పుకొనమి
నీదు మేలును గోరియే నే వచింతు 214

తే.గీ.జలధి దాఁటించి తెచ్చె రాక్షసవిభుండు
సంద్రమును దాఁట, నరునకు సాధ్యమగునె?
పరులు చొరబడలేనట్టి పురమునందు
సంతిపురమున నుంటి వయ్యది యెఱుంగు 215

తే.గీ,దైత్యరాజింట, దాచిన దాని నిన్ను
మేము కాపల గాయఁగా మెలగు నిన్ను
సురవిభునకైనఁ గొనిపోవఁ దరముగాదు
వినుము మామాట శుభమెంచి యనెడి మాట 216

తే.గీ.ఇటుల కన్నీరుఁ గార్చెద వేల చెపుమ
దుఃఖమును వీడు సుఖమునం దుండఁగలవు
యౌవనము నశింపకయె సౌఖ్యంబుఁ గనుము
యౌవన మనిత్యమైపోవు నని యెఱుంగు 217

తే.గీ.పర్వతోపవనంబులఁ బ్రమదమొందఁ
బూలదోఁటల విహరింపు పూవుఁబోఁడి
రాక్షసేశ్వరుకవ విహారంబు సలిపి
సుందరీ! సర్వసుఖములఁ బొందుమింక 218

ఆ.వె.ఏడువేలమంది యింపైన స్త్రీ లెప్డు
నిన్నుఁ గొల్చువారు నీరజాక్షి
ప్రభుఁడు రాక్షసేంద్రు భార్యగా రాణింప
విభవ మందగలవు విహితరీతి 219

ఆ.వె.నామమాట వినవొ నలినాయతాక్షిరొ
నీదుగుండె, నీకి నే వినెదను
చావొ సుఖమొ యేదొ సకలవిధంబులఁ
దలఁచుఁడిగొను వచ్చె తరుణ మిపుడె 220

తే.గీ.అంత మందోదరి యనెడి యామె శూలి
మాని వేగ ప్రస్ఫుట కోపమూర్ఛితయయి
పలికె, సీత రావణుపాలఁ బడినదాదిఁ
గాంచినకొలంది, తనుకోర్కి గలుగుచుండె 221

తే.గీ. ఈమెఁ జంపి హృదయమాంస మెల్లఁ దినఁగఁ
దలను బ్రేగుల దిన మదిఁ దలఁపు గలదు
మెడఁ బిసికి చంపి మానుషి విడిచె భువిన
టంచు జెనికిఁజెప్పగా నతఁడు తినఁగ 222

తే.గీ. నాజ్ఞ నిడునంచు మన మెల్ల ర మంత నీమె
తినఁగవచ్చు నటంచని తెలిపె బ్రఘస
ఖండములుగాగఁజేయుడీ కాంత నిపుడె
తగవు రాకుండ సమముగా తమిని దినఁగ 223

తే.గీ. తేనెయును మద్యమును రెండు వానిఁగలిపి
తృప్తి తీరగ భుజియించి త్రేన్చవచ్చు
ననుచుఁ బలికె యజాముఖి యసుర యొకతె
అదె తగునని శూర్పణఖయు నాడెనంత 224

తే.గీ. ఈమెమాంసమ్ము దిని మద్య మపుడె త్రాగి
శోకనాశన మౌగతి శోభతోడ
నృత్యము నికుంభిలాదేవి నెంచి చేయఁ
దగు ననుచు శూర్పణఖయు మోదంబుఁ దెలిపె 225

ఉ. ఈమెయిఁ బల్కు నయ్యసుర లెల్లరమాటల వించు భీతిమై
భూమిజ ధైర్యమున్ విడిచి పొక్కుచు, మానుషి దైత్యభార్యగా
నేమనియెంచు, మీరిపుడె యీనరమూర్తి భుజింపవచ్చునే
భూమిని వీడినన్ సరియె పొందను భార్యగ రాక్షసాధిపున్ 226

తే.గీ. తినఁదలంచిన, నను జంపి తినుడు మీరు
చచ్చుభీతిని నేను రాక్షసు వరింప
దైత్యపతిభార్యనై మన దలఁపఁబోను
వీడనొల్లను నా రాము వీడ నెపుడు 227

తే.గీ. అనుచు శింశుపాతరుశాఖ నదిమిపట్టి
శోకమయమూర్తి దీనయై శోభఁ గనుచు

స్వీయనాథుని రాముని జిత్తమందు
నిలిపి మననంబు సేయుచు నిలిచియుండె 228

## సీత-ఉరిబోసుకొను యత్నము

ఆ.వె. అయినసేమి సీత యాదుఃఖవారిధిఁ
దరణ మొందలేకఁ దనువు వణఁకఁ
బడమిఁ బడియు లేచి ముఖము తెల్లఁబడఁగ
దైత్యవనితల గను ధైర్యము విడి 229

ఆ.వె. చావఁదలఁచి యేడ్చు జానకీసతి యంత
శోకజలధి దాఁటు చొప్పుఁ గనక
రామరామ యనియు లక్ష్మణా యనియును
గొంతునెత్తి యేడ్చి క్రుంగిపోవు 230

తే.గీ. పిలుదు లంటుచు వ్రేలాడు పెన్నెరి జడఁ
గనుచు సవరించుకొంచు నా కమలనేత్ర
కనుగొనలనుండి నీటిని గార్చుచుండి
కడుపు తడవగ నేడ్చు బిగ్గరగ నామె 231

ద్వి. నారాము నానాధు నలినాయతాక్షుఁ
జేరఁగా నోనాకా జీవంబుతోడ 232

ద్వి. ఏనాడు జూతునో ఇందీవరాక్షుఁ
గానఁగాఁగలవారె కడు ధన్యులుగద 233

ద్వి. పవితాత్ము మృగరాజ విక్రమతేజు
ముదముతో గననోచు పుణ్యంబు లేదా 234

ద్వి. ఏ జన్మమున గలయెట్టి పాపంబొ
యీ జన్మమందు నన్నీరీతిఁ జేసె 235

ద్వి. రాకాసక్రూరుల రక్షణనుండి
విడిపించనెట్లగు వీరరాఘవుని 236

ద్వి. ఏవిధి మరణంబు నే నెంచఁగలను
జీవితేశుఁడు పతి సెలవు లేకుండ 237

ద్వి. పతియాజ్ఞ లేక, నే ప్రాణంబు విడుట
సతి ధర్మమగునొక్కో, చావగా దలఁప 238

ద్వి. నరజన్మమెత్తుట, పరవశమగుట
భరియింపఁజాలని పరమదుఃఖంబు 239

తే.గీ. బ్రదికియుండిన ఫలమేమి? రాముఁ గనక
రాదుగా చావుగూడఁ దలంచు సంత
భగవదిచ్ఛయె యదిగూడ ప్రకృతియందు
మరణ మొందంగఁజాల రెవ్వరును స్వేచ్ఛ 240

ఆ.వె. చెట్టుకొమ్మపట్టు చేజారిపడి భూమి
పొరలుచుండి యేడ్చు పొక్కిపొక్కి
ధరణిజాత యంత తల్లియొడిని జేరి
వ్యథనుబొందు కర్మవిధిఁ దలంచి 241

ఉ. రాముఁడు లేనికాలమున రాక్షసుఁ డీతఁడు కామరూపుఁడై
యీమహిఁ జేర్చె నన్ను గడు నేడ్చెడివానను బల్మిఁబట్టి నే
నా మహితాత్ముఁ గాన కిటు లార్తిని గుందుచు నుండజాల, నే
నేమి యొనర్చుదాన గతి యేమియుఁ దోచదు కర్మమెట్టిదో 242

ఆ.వె. పదియు నాల్గువేలు బలియులౌ విలుకాండ్ర
నొకడె పోరి జంపి యున్న రాముఁ
బాసి, యార్తిబడియు బ్రదుకగా ఫలమేమి?
సొమ్మదేల? భూషణమ్ములేల. 243

ద్వి. అతిఘోరవాక్కుల నసురు లాడంగ
బ్రదుకేల ప్రాణాలఁ బాయుట మేలు 244

ఉ. ఇంతటి ఘోరదుఃఖమును నే విగ్రమింగి సజీవనౌచు నే
చింతిలుచుంటి నా హృదయసీమ శిలామయమా: నశింపదే

వింతగదా? జరామరణభీతి యొకింతయులేమి నిత్యమా?
యెంతగఁ బ్రాణరక్షణము నే వహియించితి రాముఁ
బాసియున్ 245

తే.గీ. సాగరాంతంబు వసుధకు చక్రవర్తి
యైన రాముఁ బ్రియుండవదు నాత్మసఖుని
బాసి, జీవితార్థము సుఖప్రాప్తికొఱకు
పెనగులాడఁగనేల యీ పృథ్విఁ బ్రదికి 246

ఉ. ఖండలుగాగఁ గోసినను, గాయముఁ గోయుడు ముక్క-
ముక్కలన్
జెండిన జెండు డీతనువు శీఘ్రముగా తినివేయు డింకనే
నుండఁ దలంప బ్రాణముల నోర్వఁగఁజాల వియోగమింక రా
ముండు ప్రియుండు, నావిభుఁడు నమోఘబలుండగు వాని
బొందమిన్ 247

ఆ.వె. తాఁక నొల్ల, దాఁక దైత్యేశు రావణు
నెడమకాలిచేత నేని వినుడు
ఎటుగఁజేసిన సరి యేదేనిఁ జేయుడు
మీర లిపుడు నన్ను మేరమీరి 248

ఉ. పూని వధింప రావణుని బూరుషసింహుఁడు రాఁడుగా, జన
స్థానమునన్ వధించెగద దైత్యుల వేలకొలందిగాగ మున్
దానవనాథుఁ డల్పుఁడుగదా రఘునందనుతోడఁ బోరఁగా
దీనజనావనుండయిన ధీరుఁడు నన్నికఁ బ్రోవ రాడొకో 249

ద్వి. కాన విరాధుని గడతేర్చియున్న
నా నాథుఁ డిపు డేలఁ బూనడు రక్ష! 250

ఉ. ఇంతసముద్రమధ్యమున రాజిలుచుండుట రాకకష్టమా?
జంకొక యింతలేని రఘుచంద్రుని బాణపరంపరాగతిన్
బింకముతోడ నడ్డగల వీరు, దెవం డిల లేఁడుగా, ననున్
జంకను బెట్టికొంచుఁ గొనఁ జాలడుగా దృఢవిక్రముండుగా 251

మ. తనభార్యన్ హరియించి రావణుఁడు దైత్యాధీశు డీ లంకలో
నునిచెన్, దీని సహించి యూరకొనునే యుర్వీశుఁడా రాఘవుం
డనిలో వీని దహింప జేయకయె, రా నాలస్యమేలయ్యె నో!
వినలేదో, యిట నున్నవార్త యెవరీ విద్రోహముంజెప్పరే 252

గీ. అకట! జంపె జటాయువు నసురుఁ డపుడె
నన్ను హరియించె రావణుం డన్న నిజముఁ
దెలుపఁగాఁగలవానిని, దెలియడొక్కొ-
రామలక్ష్మణు లెఱిఁగిన రాకపోరు 253

చం. జలనిధి నింకసేయగల శస్త్రము లస్త్రములున్నరాముఁడే
యిలఁగుపితుండెయైననెడ నీ యసురాలయ మంత పీన్గుపెం
టలు గల వల్లకాడగు క్షణంబున, దైత్యులనెల్ల వారలన్
విలయ మొనర్చు, రావణుని వీటిని, నేఁగలవార్తవిన్నచో 254

ఉ. నేనిట నుండుటన్ వినుట నే యసురాంగన లెల్లవారలున్
బీనుఁగులైన భర్తలనె పేగను వారలు దుఃఖితాత్మలై
నేనిపు డేడ్చుచున్నగతి నే, విలపింపవె రాక్షసీతతుల్
కానరె భర్తృకాయముల గ్రద్దలు వే, దినుచుండ లంకలో 255

గీ. కానఁగలదాన లంక శ్మశానమగుట
మీర లిపుడు దుర్మార్గులై మీరియుంట
లంకఁగల దైత్యులెల్లరు లయము గాంత్రు
పావనంబగు లంక మీపాప ముడిగి 256

తే.గీ. రావణుఁడు చచ్చు మేటులో రాక్షసాళి
మడియు, నీలంక యెల్ల దుమ్మగును గాదె
చీకటులు గ్రమ్మి రోదన చెవుల బడెడి
యెపుడొ రక్తాంతలోచనుం డిటకు రాగ 257

ఉ. క్రూరుఁడు రావణుండు నను గూల్పఁదలంచిన కాల మింతలో
దీరును, మంచిచెడ్డలగతిన్ గమనింపని సాహసుల్ నిశా

చారులు మాంసహారులు వెసన్ నను జంపిన జంపువారు,నే
వీరునిభార్యనై యటుల భీరువు కత్తికిఁ జిక్కి చత్తునా? 258

తే.గీ.గడువు రెండుసెలలుగూడఁ గడువనుండె
వరలఁ బ్రాతరాశార్థమా సురవిభుండు
నన్నుఁ జంపించి శిక్షింప నున్నవాఁడు
జీవితేశుని గనలేనొ జీవముండ 259

చం. కటకట! జీవితేశు విడి కాయముతోడ సజీవఁగాఁగ, నుం
డుట సహియింపజాలను గడుంభరమాయెనుజన్మ,లేరె యి
చ్చటవిష మీయ నెవ్వరును చావును గోరుచుమ్రింగనెంచినన్
బటుతర శౌర్యశాలి, రఘువర్యుఁ డెటుంగఁడొ
నాదుజాడయేన్ 260

గీ. కాక దివ్యసుందరమూర్తి కాన నెల్ల
వెదకి ననుగాన లేమిని విసిగివిసిగి
ప్రాణముల జారవిడిచె నా రాఘవుండు?
లేనిమెద రాడొకో, నన్నుఁ గాన నిటకు 261

ఆ.వె.నన్ను గానలేక నళినాయతాక్షుఁడు
స్వర్గమేగ నచటి వారు, మునులు
గరుడ దేవ సిద్ధ గంధర్వులెల్లరుఁ
గూడ ధన్యతములు జూడ రాము 262

గీ. అటుగగాక రాజర్షియై అడవియందె
ఫలిత్రకాముడై వైరాగ్యధర్మనిరతి
నుండిరో, పరమాత్ముడై యుండియుంట
నానిమిత్తంబు వారలు రానికతమొ 263

ద్వి. పతిపాటుఁ గనినంత మెదడఁ బ్రేమంబు
విడిపోవునో నేమొ విహితులమధ్య 264

ద్వి. శ్రీరాముఁడటువంటి వాఁడౌనొ? కాఁడు
పరులమేలు మఱచువాఁడును గాఁడు 265

ద్వి. ప్రీతిఁగల్గిన వారి ప్రేమించువాడె
ఆత డెన్నడు వీడ దట్టి వారలను 266

ద్వి. ఆడుదాని నిటుల నగచాట్లఁ బడుచు
తోడునీడయు లేక దుఃఖించుచుండ 267

ద్వి. విడనాడ డెప్పుడు వీరరాముండు
తడవు సేయక వచ్చుఁ దన్వి, నన్గావ 268

మ. మును నేఁ జేసిన పాపదుష్ఫలితమా మూర్తీభవించెంగడా
యెనలేకుండిన కష్టసంతతులు, నా యీజీవితంబందు,తా
దనప్రాప్తించినదో యిటుల్ పుటుకనే దౌర్భాగ్యమేనాకు,లే
క,నరేశుం డరిసూదనుం డతులుడున్ గంజాక్షుడే, రా
డహో! 269

ద్వి. నారాము జలజాక్ష నాప్రియంవదుని
వీరాధివీరుని విడియుండి బ్రదుక 270

ద్వి. మునివృత్తి ఫలమూల భోజనంబునను
వని వీడినారలో వారిశస్త్రముల 271

ద్వి. అరిరావణుండంత నా నిరాయుధులఁ
బరిమార్చియుండెనా వారల వనిని 272

ద్వి. కాల మీరీతిగా గడుచుచునుండ
నేల సజీవనై యిలయందునుందు 273

ద్వి. ప్రియమప్రియమనెడి భేదంబు లేక
భయమును విడనాడి బ్రతికెడి మునులు 274

ద్వి. ఆమహాత్ములనములాజితాత్మకులె
యీమహి ధన్యులై యిక్కట్లు బడరు 275

ద్వి. పొందరు సుఖదుఃఖముల నెప్పుడేని
గుందరుగా నెద్ది గోలుపోయినను 276

ద్వి. ప్రియము సుఖంబు, నప్రియము దుఃఖంబు
మయములు నటుగ సామాన్యులకగునొ 277

ద్వి. ఏఁబ్రియు రాముని నెడబాసి మనెడి
యీ బ్రదుకేల లయించుట మేలు 278

గీ. అనుచు రాక్షసేశునిపొందుఁ గనుటకంటె
మరణమే మేలుగా నెంచు ధరణిజాత
పల్కు లాలించి రాక్షసవనిత లపుడె
కుపితలై రాజునకు దెల్పఁగోరి జనిరి 279

## త్రిజట స్వప్నము

తే.గీ. కొందఱటుల నేగగ, మఱికొందఱంత
సీతదరి జేరి మామూలు రీతిగాగ
పరుషవాక్యంబులాడిరి బ్రదుకు సున్న
యంచు మాంసంబు భక్షింతుమంచు వారు 280

ఉ. ఇంతట మేల్కొనెం ద్రిజట, యెంతయొ తత్తరపాటుతోడ నీ
కాంతను గూర్చి యొక్క కల గంటిని పోవల దామెజోలి కం
చెంతయొ భీతిమై పలికె నీమెను భక్షణ సేయరాదు, దై
త్యాంతము జూడఁగాఁగలదు తథ్యము నా కల దెల్పె
సత్యమున్ 281

ఆ.వె. తెల్లవారువేళ తేటతెల్లముగాఁగఁ
గన్న కలలు త్వరితగతిని జరుగు
రాముజయ మసుర పరాజయంబుఁగూడ
దెలుపుచున్నది కలతీరు వినుడు 282

చం. జనకునిపుత్రి కోసలవిశాంపతికిన్ స్నుష పూత సీత, యీ
వనితను, మ్రింగబోవకుఁడు పల్కగరాదిక జెడ్డమాటలన్
నను దిను డామెకుంబదులు, నా నుడి నాలనసేయఁగాఁదగున్
వినుడిక స్వప్నమెల్ల వినిపించెద, సీత శుభంబె గాంచెడిన్ 283

ఆ.వె.అని ముదుసలి త్రిజట యారాక్షసస్త్రీలఁ
గాంచి బలుక, నామె గన్న కలను
దెలుపఁగోరవారు త్రిజట చెప్పఁగఁడంగెఁ
దోటివారితోడఁ దొట్రుపడుచు 284

చం, అది యొక రమ్యమౌ శిబిక హంసలు వేయిటిబూన్చియున్న దా
మద గజ దంత నిర్మితము మాన్యుఁడు రాముఁడు లక్ష్మణాన్వితుం
డది వినువీథి రాగ ధవళాంబరమాల్యములన్ ధరించి యీ
యుదధిని దాటి లంక కిట కొప్పుగ వచ్చెనుసుండి దానిపై 285

గీ. అపుడె స్వప్నమందుసనె, సీతమ్మఁ గంటి
నబ్ధిమధ్యంబున గల శ్వేతాద్రిపైన
శుక్లవస్త్రావృత మహాశోభ దనరి
ప్రభ రవిని గూడుగతిఁ జేరె రాము నీమె 286

శా, కంటిన్ నాలుగుదంతముల్ గల మహాకంఠీరవారూఢుఁడై
జంటన్ రాముఁడు లక్ష్మణుండు పురిలో సంచారముం జేయుచో
వెంటం దోడ్కొనిపోయె జానకిని, బృథ్వీజాతతో వారల
న్మింటన్ శ్వేత నగాగ్రమం దిభముపై నేఁ గంటి
స్వప్నంబునన్ 287

గీ. ఇభముపై పెనిమిటితోడ నెక్కి వరలు
చుండి దిగ్గున లేచి యా కొండనున్న
చంద్రసూర్యులఁ బట్ట హస్తములఁ జాచు
కమలలోచన సీతమ్మ గాననయ్యె 288

తే.గీ.రామలక్ష్మణు లాసీనులైన గజము
నీరజాక్షి సీతను గూడి నింగియందు
లంక, పైభాగమందున రాజిలంగఁ
గంటిఁ గలయందు, గంటి, రక్కసులు వినుఁడు 289

చం. ఎనిమిది తెల్లయెడ్లరథమెక్కి దివిన్ చరియించుచుండ లం
కను రఘురామలక్ష్మణుల గాంచితి. సత్యపరాక్రముండు తె

ల్లని వసనంబు దాల్చి సహ లక్ష్మణుఁడై గనుపించె స్వప్నమం
దున, శుభచిహ్న మియ్యదియు దోయజనేత్రకు సీత
కింతపై 290

ద్వి. అక్లిష్టకర్ముఁడౌ నా రామవిభుఁడు
లోకంబు లన్నింటి, లోఁగొనినట్లు 291

ద్వి. కనియుంటి నింతలో గలయందు వినుఁడు
ఘన సద్భుతంబయ్యెఁ గాకుత్స్థవరుని 292

ద్వి. పాలకడలి నీట పాండురాద్రిఁ గలి
పాలవన్నెగజముఁ బాగుగ గంటి 293

ద్వి. దానిమూపున రామధాత్రీశు డుండె
వానియంకమునందు జానకి యుండె 294

ద్వి. రాగంబుతో సీత రాఘవుం డంతఁ
గౌఁగిలించినయట్లు కల యందుఁ గంటి 295

ద్వి. మఱియొక దృశ్యంబు మహితాద్భుతంబు
పరమపవిత్రుండు భద్రాసనమున 296

ద్వి. తూర్పుమొగంబున దోచుచునుండుఁ
గర్పూరహారతుల్ కరములఁ బట్టి 297

ద్వి. మునులును దేవతల్ కనిపించినారు
కొనితెచ్చి తీర్థాల వనముతో రాముఁ 298

ద్వి. నభిషేక మొనరించి రంతట వారు
శుభమూర్తి సీతమ్మ సొంపుగా నచట 299

ద్వి. చల్లని గంధంబు చక్కగా నలది
తెల్లచీరను దాల్చి తేజుతో వెలుఁగు 300

ద్వి. పూలను ధరియించి పూజార్హ గాగ
లీలగా వెలుగొందు శ్రీయన దోచి 301

ద్వి. వచ్చిన దేవతల్ బ్రహ్మతోఁ గూడి
యచ్చపు భక్తిమై యారాము మ్రొక్కి 302

ద్వి. వెదలుట నే గంటి వేకువయందు
తడవుండ దీ కల తథ్యంబు గాగ 303

ద్వి. వేరొక్క దృశ్యంబు వేగనన్నైతి
శ్రీరామవిభు డంత శ్రీవిష్ణువగుచు 304

ద్వి. సహజరూపంబున సాక్షాత్కరించె
తహతహలాడుచుఁ దమిఁ గొల్వ మునులు 305

ద్వి. శ్రీశంఖచక్రాది చిహ్నసంయుతుని
శ్రీశుని దేవతల్ చేరి మ్రొక్కిడిరి 306

ద్వి. వైకుంఠవాసిని పరతత్త్వరూపు
లోకసముహంబు లోనున్నవాని 307

ద్వి. శ్రీవత్సవక్షుని సింహాసనస్థు
సేవింప శ్రీ సదా శ్రీలిచ్చువాని 308

ద్వి. సర్వలోకేశుని సర్వకారకుని
సర్వకారణమూర్తి జగదేకవిభుని 309

ద్వి. పరమేశుఁ గనుచు రంభాద్యప్సరసలు
వర నృత్య గానాల వరలిరి కంటి 310

ఉ. మానవనాథు లంతట విమానము పుష్పక మెక్కిపోయి రీ
జానకి గూడి యుత్తరదిశన్, బురుషోత్తముఁ డౌరఘూద్వహున్
బూని రణంబునన్ గెలువఁ బోరుట వ్యర్థము దేవతాసురుల్
గాని మరెవ్వరేనియు, జగంబుల గెల్వగ నేర రాతనిన్ 311

ఉ. అంతియ కాదు రావణుని కంతయు, దోషము దెల్పు స్వప్నమున్
వింతగఁ గాంచియుంటి, మన వీరుఁడు గన్నెరుపూల దాల్చి మే
నంతయు నూనెఁ బూసికొని యంతట తైలముఁ ద్రావి కైపుమై
సుంతయుఁ దెల్వితేకయె, వసుంధరపైఁ బడె రక్తవస్త్రుఁడై 312

గీ. ముండనము గాఁగ తల దితిపుత్రుఁ డంత
బుష్పకవిమానమున నుండి పుడమిఁ బడియె
కృష్ణవస్త్రంబులను దాల్చి క్రిందఁబడిన
దైత్యనాథుని స్త్రీ యొండు ధాత్రి నీడ్చె 3

ఆ. ఎఱ్ఱపూలమాల లెఱ్ఱని గంధంబుఁ
దాల్చి రావణుండు ద్రావి నూనె
భ్రాంతచిత్తుఁ డగుచు బారుచుండుటఁ గంటి
ఖరము లూన్చియున్న యరద మెక్కి 31

గీ. మరల గాడిదపై నెక్కి మనవిభుండు
దక్షిణదిశ కరుగుచుండి దానినుండి
నేలపైఁ దలక్రిందుగాఁ గూలఁగంటి
విహ్వలత జెంది స్మృతి వీడి వెడలఁగంటి 31

గీ. భూమి పడి లేచి యమదిశ బోయిపోయి
పిచ్చి యెత్తినవానిగఁ బ్రేలుచుండి
నరకతుల్యంబు ఘోరతిమిరమయంబు
దుస్సహ, మలపంకముఁ జొచ్చి దొర్లుచుండె 316

ఆ. బురద మేన, నెఱ్ఱపుట్టంబు దాల్చిన
నలుపురంగు వనితఁ, గల,నొక ర్తు
త్రాడు మెడనుగట్టి దక్షిణదిశవైపు
నీడ్చుచుండె రావణేశు నంత 317

గీ. కుంభకర్ణుండు నిట్లుండఁ గూడఁగంటి
రాక్షసేంద్రుని సుతులు తైలాభిషేక
మానియుండుటఁ గంటిని యువిదలార!
అన్నియు నశుభచిహ్నలే యెన్నిచూడ 318

గీ. పందివాహనం బెక్కి రావణుఁడు వెడలు
ఇంద్రజిత్తు పెన్మొసలిపై నెక్కియుండె
కుంభకర్ణుండు నొంటెపై గూరుచుండె
ముగ్గు రేగిరి దక్షిణముఖముగాఁగ 319

ఆ.వె. ఎఱుపుపూలచెండ్ల నెఱ్ఱని బట్టల
దాల్చి నూనె ద్రావి దైత్యతతులు
ఆడి పాడి లంకయందున దిరుగాడు
చుంటఁ గాంచియుంటి జుమ్మి కలను 320

మ. రమణీయంబగు లంకయెల్ల జలధిన్ రాలెన్‌గదా గుఱ్ఱముల్
కమనీయంబగు ద్వారముల్, రథములున్ గంభీరమత్తేభముల్
సమతం జెందెను సింధువుం గలిసి, రక్షస్త్రీలు భస్మావశి
ష్టము లంకం దిరుగాడుచుండుటయు నే స్వప్నంబునం
గంటిగా 321

గీ. రావణుని రక్షనుండిన లంక యెల్ల
వీర్యవంతుఁడు వానరవీరవరుఁడు
రాఘవునిదూత గాల్చుట రామలార
కంటిఁ గలయందుఁ, గంటిని కలను నిటుగ 322

గీ. రక్తవస్త్రంబులను దాల్చి రాక్షసాళి
కుంభకర్ణాది రాక్షసకూటమెల్ల
పేడగుంటలో బడి మున్గి వెలికి రారు
గాంచితినిఁ గల నీగతిఁ గాంతలార 323

ఉ. చూచితి శుక్లమాల్యధరుఁ జూచితి తెల్లని వస్త్రధారునిన్
చూచితి నాల్గుదంతములశుభ్రపుదేహముపై విభీషణున్
జూచితి మంత్రియుక్తుఁడయి శోభిలు వానిని నృత్యగానముల్
జూచు విభీషణుండొకనిఁ జోద్యముగాఁ గల వాని
లంకలోన్ 324

చం. అవలికి బొందు మీర లిక అట్లొనరింపరయేని నాశమే
ధ్రువమగు మీకు, సీతయును దుఃఖసముద్రముదాటు నింక, రా
ఘవుఁ డరుదెంచు సీతఁ గొనుఁ గంటకు రావణుఁ ద్రుంచివైచు నీ
యువిదను బాధపెట్ట మిము నొప్పుగనుంచదు వీసఁబోడుగా 325

ఉ. ప్రేయసి, తోడునీడగఁ జరింపగఁ గాసకు వచ్చె సీత, నా
ప్యాయముగాగఁ జూచుసతిఁ బార్థివసూనుఁడు గూడు సంతతో

జాయ యొకండ.గుండ.నగ నాట్లొనరించినవారి నెల్లరన్
బాయగఁ జేయుఁ బ్రాణములఁ బాపము పండిన దింక
వారికిన్ 326

ఉ. కావున నా హితంబు వినఁగాఁదగు, మీ రభయంబు వేఁడుడీ
దేవిని, నాడు స్వప్నమునఁ, దీరెను చింత యొకింత యామెకున్
నా విధు చేయ నిశ్చలమనంబున, మిమ్ము క్షమించు నీమె యా
భీవిభుఁడైన రాఘవుఁడు దేవిని గూడి కృపామయుండగున్ 327

చం. జనకసుపుత్రి సీత సతి సల్పినయంతఁ గృపామయాత్మయౌ
కననగు సద్గుణంబులవె, క్ష్మాసుతయందవలక్షణంబులే
కనబడకుండె, నంగములఁ గాంచ, విపత్తిటు, హేతువేమొకో!
తను వొక యింత రంగుచెడె దానవజాములఁ బొందె
నీగతిన్ 328

గీ. దానవాసురనాశంబు రాముజయము
సీత, పతివెంట జనుటయు సిద్ధ మింక
అదిగొ పద్మాక్షి యెడమ కన్నదురుచుండె
వామభుజమును దొడయుఁ గంపంబునొందె 329

గీ. చెట్టుకొమ్మను గూర్చుండి చెప్పుచుండె
ప్రమదముగఁ గూసి పింగళ పక్షిగూడ
గరుడపక్షియు, జుట్టును దిరిగి, శాఖఁ
జేరి, మధురనిస్వనమున జెప్పుచుండె 330

తే.గీ. రాముఁ దరుదెంచు జానకీరమణిగానఁగ
నిన్ననెడిరీతిఁ బక్షుల నిస్వనంబు
మధురమై శుభసూచకమై దనర్చు
సీత సుఖియించు రాఘవువెంతఁ జేరు 331

ద్వి. అనుమానంబాలించి యటఁగాయువారు
కనికిరి వెడనాడి జనకజ నంత 332

శుభ సూచకములు

తే,గీ. శింశుపావృక్షశాఖను చేతఁబట్టి
దైత్యహుంకారముల విని ధైర్యము విడి
దుఃఖశోకార్తయై, కడుఁ దొట్రుపడుచు
జీవితాశను విడనాడె సీత యంత 333

ఉ. పాయక ధర్మమార్గ ముపవాసము లూని పతివ్రతాగతిన్
కాయము డస్సిపోవ నిటు కష్టములం బడుచుంటి, రాముఁడే
మాయెనొ! లక్ష్మణుండు ననమానుఁడు నం దలపెట్టడేమొ? ఏ
లా యిటువంటి జన్మ మురిత్రాడయినన్ లభియింప దిచ్చటన్ 334

ఉ. రామ! సుమిత్రపట్టి! రఘురాముని గాంచిన కోసలాత్మజా!
యేమి తలంచుచుండిరొకొ యీ యబలన్ విడి, నేపతివ్రతన్
రాము ననువ్రతన్ నియమ రాజిఁ బ్రవర్తిలుచున్నదానగా,
నీమెయి ధర్మమార్గగతి నిష్ఫలమాయెను జావె మేలుగా 335

ఉ. హారఘురామ! కోసలసుతా వరలక్ష్మణుఁడా సుమిత్ర యి
ట్లూరకయుండిరే విడిచి యుర్విసుతన్ నను మాయలేడికై
మారసమానుఁ బంపి యిటు మాయలమారికి జిక్కనేల? యీ
క్రూరునిచెంత బాధఁ బడి కుంపగనేల? విధిప్రయుక్తమా? 336

గీ. రెండు మాసంబు లిక గడువుండె నాకు
గడువు గడిచినయంతనే విడువ డితఁడు
కండకండలుగాఁ గోయు గఱుకకత్తి
నట్టి చావుకంటెను నాత్మహత్య మేలు 337

గీ. అసువులను వీడుటయె, యాత్మ హత్యవలన
బ్రహ్మవిధియేమొ, యేమైన బ్రదుకఁజాల
రాఘవుని బాసి కనులార రాము గనక
బ్రదుకగానేల? బాములఁ బడయనేల? 338

గీ. అనుచు బొడవైన తనజడ నంటబట్టి
మెడకు బిగఁజుట్టి నురిబోసి విడఁగఁటలచెఁ

ప్రాణముల, నాత్మహత్యకుఁ బాపమయ్యుఁ
బూనఁదలపోసె సీత, యపూర్వగతిని 339

శా. హారామా! రఘునందనా! వనజనేత్రా! దీర్ఘబాహుండ హా
హారామానుజ కోసలాత్మజ సుమిత్రా! మిమ్ముఁజూడంగదా
హా, రామా! నిను వీడి యార్తిఁగను భార్యన్ గావ రావేలకో!
గారాబంబున నొక్కమాట పలుకంగా రావ? నాకర్మమా! 340

తే.గీ. పుణ్యమో పాపమో యేది గణ్యమైనఁ
గానిఁ మన సిడ జాల, రాక్షసున కేను,
దైత్యపతి కత్తిచే చావు తథ్యమగుట
నాత్మహత్యయె, తక్కువ యఘము కాదె 341

ఉ. వన్నెయు వాసియుం గనిన వంశమునన్ జనియించితేను, దీ
ర్ఘోన్నత బాహు రాఘవుని గూరిమిభార్యను, నాత్మహత్యనే
యెన్నగవచ్చె రామధరణీశున కియ్యది కీర్తిహేతువే
సన్నుతిగాంచునే యనుచు జానకి యేడ్చెడి నార్తయై కడున్ 342

గీ. అంత శుభసూచకంబుగ నదరసాగె
వామనేత్రంబు, వడకెను వామభుజము
ఎడమతొడగూడఁ గంపించె నెదుట నుండె
రాముడనురీతి నరసి యా లక్షణముల 343

గీ. ఇట్టి శుభచిహ్నములు మున్నె యెఱుకయౌట
జానకీదేవి,కనివాని సంతసిల్లె
ఆర్తి నెద వీడి రాఘవుఁ డండఁగాగ
వచ్చియుండిన గతి నొందె పరమముదము 344

ద్వి. దొండపండునుబోలు తోరంపుపెదవి
గండు మీనునుబోలు కనుగవ గలిగి 345

ద్వి. శశిబింబవదన యీ చక్కని సీత
యశమునే గణియించు నారాముపత్ని 346

ద్వి. నిండుచందురు బోలు నెమ్మోము కాంతి
పండు వెన్నెల తీరు వరలు పల్వరున 347

ద్వి. సకలాంగసుందర సర్వదేహంబు
వికసింప శాంతిమై విశ్రాంతి బొంది 348

ద్వి. శ్రీరామశరణంబు శ్రీరామశరణు
నారామ రావయ్య నన్నుబ్రోవంగ 349

ద్వి. అని రామసన్నిధి యమరినరీతిఁ
గని; ఆత్మహత్యను బనివడి నిలిపె 350

## హనుమంతుని స్వగతము

ద్వి. చెట్టుపై గూర్చుండి చెనఁటి రక్కసుల
కట్టిడి నుడి విని కని సీతయార్తి 351

ద్వి. ఇదియెల్లఁ గనుచుండి యీప్సితార్థంబు
మది నెంచినది లభ్య మాయె నటంచు 352

ద్వి. తనరాకఁ దెలుప నంతట సీత నెంచి
హనుమంతుఁ డాత్మ నయ్యదను దలఁచు 353

ద్వి. సూర్యోదయముగాక చుక్కలుండంగ
నార్యతో పలుకాడ నగునంచు నెంచి 354

కం. రాక్షసవనితలు విన నా
దీక్షయె చెడు తమవిభునకుఁ దెలుపరె వారల్
రక్షను ననుఁ బట్టగ నా
రాక్షసపతి యెంచు నాదు రాకయె వితయౌ 355

కం. వీరలు నిదురించెడితఱి
నారసి పలుకాడవలయు నా ఘూసుతతోన్
దీరుగ నను నమ్మునొ లే
దో! రాక్షసమాయగఁ గనునేమో నన్నున్ 356

30 వసర్గ

కం. భాషింపగ, నే సంస్కృత
భాషను నమ్మక మొదవునె భయపడి నన్నున్
వేషము మార్చిన రాక్షస
దోషిగఁ దలపెట్టునేమొ? తొందర యేలా? 357

ఆ.వె.అదియు నిదియు నేల నామెతో మాటాడ
సహజ వాక్కు మధుర సరసగతిని
రాష్ట్రభాషతోడనె రామయ్యకథ నెల్ల
వినఁగఁ బలుకఁదగును విహితరీతి 358

ఉ. చూచితి లంక రాక్షసులఁ జూచితి రాక్షసనాథు రావణున్
జూచితి వానికీర్తిఁ గడుఁ జూచితి, జానకి రాఘవేశ్వరిన్
జూచితి, ఆమెపొందు వ్యథ జూచితి దైత్యులు పెట్టు కష్టముల్
జూచితి, శాంతి సీతఁ గన జూచెద నన్నెఱిగించియామెకున్ 359

ఆ.వె.ఇపుడు రామువార్త నే నెఱిగించియే
యూరడింపనొప్పు నుర్వీసుతను
నటులఁ జేయకున్న నఘమె వాటిల్లును
నాగకుండ నాత్మహత్యఁ బూను 360

ద్వి. అని యెంచి మదిలోన హనుమంతుఁ డంత
తనరాక నెఱిగింప జనకజ కపుడు 361

ద్వి. చెట్టుపై గూర్చుండి చెనటిరక్కసుల
కట్టిడిమాటలు కఠినవర్తనము 362

ద్వి. విని కని పలుకాడ జనకజతోడ
అనువగు సమయమ్మై హనుమ చింతించె 363

ద్వి. సూర్యోదయముగాక చక్క యుండంగ
నార్యతో మాటాడ నగునంచు నెంచె 364

ఆ.వె.సీత క్షేమవార్త చెప్పి వేసికొనకుంట
మంచిపోయి, యామె మాట, నేమి

చెపుదు రాఘవునకు క్షితితనూజ!
వార్త వినిన శాంతి వరలఁగలఁడు 365

తే.గీ. దితికులజులగు వీరికి దేవభాష
రాదు, నామాట వినఁగాని రాముపత్ని
వానరుఁడు నేను సంస్కృతభాషఁ బలుక
నమ్మనే జానకీదేవి నమ్మలేదు 366

ఉ. మానవభాషయందె, నరుమాడ్కిని చెప్పినఁగూడ నమ్మనే
మానిని, నన్ను, రావణుఁడె మాఱుగ వేషము బూనివచ్చెనం
చానన మెత్తబోదు నను నారయబోవదు భీతి జెంది, రా
మా నను గావుమీ యనుచు మానక బిట్టుగ నేడ్చునేమొకో 367

ఆ.వె. త్రిజటస్వప్నము విని రేగంగ భయమంత
గాఢనిద్రవీరు గాంచినారు
సీత సవ్వడి వినఁ జెడి నిద్ర దైత్యులు
మేలుకొనరె! కార్యమే చెడుగద 368

ఆ.వె. సీతఁ గాయువారు చెరచెర వెడలరే
అసురపతికిఁ దెల్ప నంత వాఁడు
తనదు వాడనున్న ననుఁ బట్టి జూడఁడే
దానవేశుఁ డేమి బూనువాడొ? 369

తే.గీ. రాఘవునికథాలోలయై రాముపత్ని
భీతి విడనాడి సర్వంబు వినెడియంత
నమ్మకము గల్గు నాపైన నమ్మఁగాదు
రామకార్యంబు పల్కెద లలితగతిని 370

ద్వి. ఇపుడె సమర్పింతు నిక్ష్వాకుపరుని
విపులకథాస్పద విదితవాక్కులను 371

గీ. అనుచు కొమ్మలమఱుగున నల్లె యుండి
మధురమగురీతి సాగించె మాటలాడ

మెల్లమెల్లగ మృదువుగ నెల్ల కథను
వినఁగ రాఘవానువ్రత విమలచరిత 372

ఉ. చంపిన చంపవచ్చు నను జంపకయున్నను యుద్ధమౌను, నన్
బంపిన రామకార్యమును బాడగుఁ బోర జయంబె యెప్డు సా
ధింపగనౌనె, దస్ని యుదధిన్ దుది దాఁటగలాఁడనొక్కొ, కా
మింపగరా దనిశ్చితము మీరగరానిది దూతకార్యమున్ 373

తే.గీ. దూత సరియగు పనిచేయ చేతగామి
చెడెడు ఘనకార్యమైనను జెడదలేని
రీతి మాటాడదగు రాజ రీతి నెంచి
మాటలాడెద కోసల మాటరీతి 374

రామాయణము చెప్పుట

ద్వి. దశరథుండనురాజు ధార్మికుండుండె
యశముఁగడించిన యవనిపాలకుఁడు 375

ద్వి. యజ్ఞయాగాది మహాధ్వరరతుఁడు
ప్రజ్ఞతో ధర్మంబు పాలించువాఁడు 376

ద్వి. రాజర్షిగణమున రాణించువాఁడు
రాజరాజయిన బురందరసముఁడు 377

గీ. శంఖచక్రరేఖలు గల్గి చక్రవర్తి
లక్షణంబుల, సుఖియించు రాజతండు
నమితసంపద గలవాఁడు నతులబలుఁడు
నాల్గు జలధులమధ్య గుణాకరుండు 378

ద్వి. దశరథు తొలిపట్టి ధర్మపరుండు
విశదపరాక్రమవీరరాముండు 379

ద్వి. విలుకాండ్ర శ్రేష్ఠుండు విదితాత్ముఁ డతఁడు
లలితచంద్రాననలావణ్యమయుఁడు 380

ద్వి. క్షత్రియధర్మరక్షణనిరతుండు
క్షాత్రవంతుండును సకలార్థదాత 381

ద్వి. నిజధర్మ రక్షణ నిజభక్తరక్ష
విజయుండు రాముండు వీడ దెప్పుడును 382

ద్వి. సకలజీవులరక్ష సత్యవిక్రమము
వికలమనంబున వీడ దెప్పుడును 383

ద్వి. అతఁడు పరంతపుం డగునట్టివాఁడు
సతతదీనావన సత్కర్మరతుఁడు 384

ద్వి. పరపురవిజయుండు వైరిభీకరుఁడు
శరణాగతత్రాణ సత్యవ్రతుండు 385

ద్వి. తన తండ్రియానచే తమ్మునిసతిని
వెను వెంట గొనిపోయి వెడలెగా వనికి 386

ద్వి. కామరూపులగు రాక్షసశూరవరుల
సామర్థ్యమున నొండె చంపెగా వనిని 387

ద్వి. ఖరదూషణాదుల కాలంబు దీర్చె
వరరాముడఁనుచు రావణుఁ దాలకించి 388

ద్వి. మాయలేడిగఁ బంపి మారీచు, రాము
జాయను గొనియె రాక్షసవిభుండు 389

ద్వి. వనిని బతివ్రత భార్యకై వెదుక
జనుచుండి సుగ్రీవు సఖ్యముఁగాంచె. 390

ద్వి వనచరరాజైన వాలినిం జంపి
తనమిత్రు సుగ్రీవు వనచరపతిగ 391

ద్వి. నొనరించి కిష్కింధ నొసగెఁ పాలింప
జనకజ వెదుకంగ వనచరకోటి 392

ద్వి. వనచరపతి పంపె వారి సే నొకడ
వననిధి దాటుచు వచ్చితి నిటకు 393

ద్వి. సంపాతి చెప్పిన జాడను బట్టి
పెంపొంద నమ్మికత వే వచ్చినాడ 394

ద్వి. ఏరూప మే వర్ణ మే లక్ష్మి గుఱుతు
లేరీతి చెప్పెనో యా రామవిభుఁడు 395

ద్వి. కనినాడ నే నట్టి కల్యాణి సీత
అనిపల్కి విరమించె హనుమంతుఁడంత 396

సీత కంగారుపడుట

ద్వి. శ్రీరామనామంబు చెవులార వింట
నా రామ విస్మయం బంతటనొంది 397

ద్వి. ఉరిజోసికొనసున్న విరిసిన జుట్టు
సరిజేసికొని మోము సరిగ పైకెత్తి 398

ఆ.వె. పలుకువారి గనంగ పలుమూలలకుఁ జూచి
మేలుతేమి రాము నెంచి హృదిని
పరమహృష్ట యగుచుఁ బరికించె చెట్టుపై
చిన్న కోతిపిల్ల సీత యపుడు. 399

ద్వి. తెల్లబట్టవాని తేజంబువాని
చల్లనిదృష్టితో మెల్లగా బలుకు 400

ద్వి. ప్రియవాక్యములవాని వినయంబువాని
పియజూపు హేమనేత్రంబులవాని 401

ద్వి. సుమపత్రములమధ్య సొరిగినవాని
సుమకాంతి వెలుగొందు చోద్యంపువాని 402

ద్వి. వానరు నొక్కని జానకిగాంచి
పూని విస్మయమప్డు పులకించ మేను 403

ద్వి. అపశకునంబుగా నాత్మలోఁ దలఁచి
సుఫలంబు. కాదని సుందరి యెంచి 404

ద్వి. మూర్ఛిల్లె భయ మొంది మోదంబువీడి
మూర్ఛఁ దెప్పరిలి.నమో నమో యనుచు 405

ద్వి. శ్రీరామలక్ష్మణుల్ చెంతనున్నటుల
రామునే యెంచి ప్రణామంబుఁజెప్పి 406

ఉ. ఇది యసురాళి లంక యెవ రిందుఁ గలారిహ రామసంస్మృతిన్
మదిఁ దలపెట్టగన్ గల రుమా యిది కోతిని గంటి నే గదన్
విదితము దుఃఖహేతు వట వీనరుఁగాంచుట స్వప్నమందునన్
సదమలరామభద్రునకు స్వస్తియె, స్వస్తి సుమిత్రపుత్త్రకున్. 407

ఉ. జనకుఁడు నాదు, తండ్రికగు స్వస్తి; కలంగను చెట్టు నిద్రలోన్
దనుగద రాఘవేంద్రు విడి దైత్యుల బాధలఁ జెందుచుంటినన్
దనుజవిరోధిరాము సతతంబు హృదిన్ దలపోయుచుండ నా
ముని కథయే వినంబడియె ముందు గనంబడు
రామమూర్తియే 408

తే.గీ. మనన మొనరించు విషయంబె వినఁగ నగును
ధ్యాన మొనరించు మూర్తినే గాన నగును
అటుల చెవిసోఁకె నేమొ నా యతుల గాథ
కాదు కాదది కనులార గంటిఁ గోఁతి 409

తే.గీ. వానరుని కంఠనాదంబు నేను వింటి
నతఁడు పలుకంగఁ జెవులార నాలకించి
భ్రమగఁ దలపెట్టరాదిది భ్రమయు కాదు
వానరుం డెవ్వఁడో నన్నుఁ గాన బలికె. 410

తే.గీ అని వితర్కించి హృదిని "నమోస్తు" యనుచు
నగ్ని గురు నింద్రు బ్రహ్మల నాత్మఁ దలఁచు
వానరుని పల్కు తథ్యమై వరలు గాత
మిథ్య గాకుండు గావుత మేలె యగుచు 411

తే.గీ.అనుచు శాంతించి తలపోయు నామె ముందు
చెట్టుపై నుండి దూఁకి యా గుట్టుగాగ
హనుమ నిలబడి జోడించి హస్తయుగము
శిరస్సుపై నిడుకొని నతిఁ జేసి పలుకు 412

ఉ. ఎవ్వరి దానవీవుః వన జేక్షణః మాసిన పట్టుబట్టతో
నివ్వని శాఖఁబూని వ్యథ నీగతి నుంటి వహో పతివ్రతా!
ఎవ్వగఁ బద్మనేత్రముల నిట్టుగ నీరము నింపుచుంటివో
చివ్వ మనెన్ మనంబు గన శిష్టను శోకమయాత్మవౌనినున్ 413

తే.గీ.నాగ గంధర్వ రాక్షస నారి వాకొ-
యక్ష కిన్నర సుర నారి వౌదు వాకొ-
వాయు, వసు, రుద్ర, గణముల వనిత వాకొ-
దేవతవు గాగఁదోచెడి దేవి! నాకు. 414

తే.గీ.చంద్రు విడనాడి దివి నుండి జారి నట్టి
రోహిణీతారవాకొ- యరుంధతి వాకొ
భర్తపై కోపమున భూమి పడితి వాకొ-
తెల్పుమీ యేకిదానవో తెల్లముగను 415

ఆ.వె.నీదు తండ్రి యెవరుః నీ సోదరుఁడెవండు
ఎవరు నీదుభర్త! యెవఁడు కొడుకు
రాజచిహ్నలంట రాణివిగాఁ దోచు
సీతవేమొ చెపుమి శీఘ్రగతిని 416

తే.గీ.రాఘవుని భార్యవా నీవుః రాక్షసేశుఁ
డా జనస్థానమందున నపహరింపఁ
బడిన సీతమ్మవే కాదె పలుకు మింక
మంగళంబగు నీకు సుమంగళంబు 417

ఆ.వె.నిన్నుఁ జోల్చగంటి నీ యాకృతిని బట్టి
సన్నగాంగి, తపసి తెన్ను బట్టి
జానకి వనియె యతి మానుషాకారము
చెప్పుచుండె రాము దేవి నీవ 418

ఆ.వె. రాము వార్త వినుట రాజీవముఖి యంత
శాంత చిత్త యగుచు సంతసిల్లి
వాయు సూనుఁ గాంచి పలుకాడ మొదలిడె
స్వీయ గాథ నెల్లఁ జెప్పఁ గడఁగె 419

## సీత స్వీయగాథఁ జెప్పుట

ద్వి. అరి భయంకరుఁడైన యాదశరథుని
వరపుత్రుఁడౌ రాము భార్యను నేనె 420

ద్వి. ఆ విదేహనృపుని యాత్మజ నేనె
శ్రీ వీరరాముని సీతను నేనె 421

ద్వి. ద్వాదశవత్సర పర్యంత మేను
మోదాన బతిఁగూడి పొంది సౌఖ్యంబు 422

ద్వి. సకలకామసమృద్ధి సంసార మందు
వికలంబు గాకుండ వీట నే నుంటి 423

ద్వి. పదియు మూఁడవ యేట పట్టాభిషిక్తు
విదితాత్మ రాఘవు వేఁ జేయతండ్రి 424

ద్వి. గురుఁడు వసిష్ఠుని గూడి యోజించి
వర ముహూర్తంబొండు స్థిరముగాఁ బెట్టె 425

ద్వి. ఆమాట విని కైక యతి కోప మూని
భూమీశు భర్తను ముందిడియున్న 426

ద్వి. వరముల దెలుపుచు వనికంప రాము
స్థిరమతి జెప్పెను స్వీయనాధునకు 427

ద్వి. నీరముల్ ద్రావ నాహారంబు ముట్ట
నీ రాము వనికంప నిర్లక్ష్య మూన 428

ద్వి. అని కైక కోరంగ నవనీశుఁడంతఁ
దన సత్యధర్మ వర్తనమునే యెంచె 429

ద్వి. రాముని విలిపించి రాజ్య దానంబు
భూమీశుఁ డడుగంగ రాఘవుం డిడుచు 430

ద్వి. నార చీరలఁ గట్టి నన్ను లక్ష్మణుని
ఘోరాటవికిఁ తోడఁ గొనిపోయినాఁడు 431

ద్వి. వలదన్న వినకుండ భర్తతో వనికిఁ
వలవని తలఁపుగాఁ దరలి వచ్చితిని 432

ద్వి. సౌమిత్రి యన్నకు సహాకరింపంగ
రాముతోఁ గదఁ గూడి రా వనియందు 433

ద్వి. పట్టాభిషేకంబుఁ గట్టఁగనుండ
నెట్టకేలకు వనిఁ బట్టె రాముండు 434

ద్వి. ఎవ్వారు కోరిన యేది యేమైన
నవ్వారి కిడు దాత యారామ విభుఁడు 435

ద్వి. ప్రతిగ్రహీతగఁ గాఁడు ప్రాణభయమునను
అతిమృదువుగ పలు కాడు నెల్లరకు 436

ద్వి. సత్యపరాక్రమ సంగతివాడు
సత్యవంతుని గాగ చరియింపఁ దండ్రి 437

ద్వి. వనిఁ జేరె నా భర్త వనజనేత్రుండు
కని పౌరులెల్లరుఁ గంట నీరిడగ 438

ద్వి. దండకాటవియందు నుండగా మేము
అండ లేకుండిన యబలను నన్ను 439

ద్వి. ఈ రావణాసురుఁ డీ దురాత్ముండు
మాయవేషంబూని మాయగా నన్ను 440

ద్వి. అపహరించెను లంక యందున బెట్టి
రిపుభయంకర రాముఁ డపుడట లేడు 441

ద్వి. నెలలు రెండెగడువు నీకంచుఁ జంప
విలపించు నాకు దైత్యుల ఫేఁడు, చెప్పె 442

ద్వి. గడువంతయును దీర గా నను జంపు
విడువక దైత్యుండు చెడువాడు వీడు 443

ద్వి. అని పల్క సీతమ్మ హనుమంతు తోడ
విని వాయు సూనుండు గనియె దుఃఖంబు 444

హనుమంతుఁడు-రాఘవుని-క్షేమము దెల్పుట

ఉ. వచ్చితి దూతగాగ రఘువర్యుని పంపున నిన్నుఁ జూడ, నా
సచ్చరితుండు, రాఘవుఁడు సాంతము వేదవిదుండు క్షేమమే
యొచ్చెము లేక నీ కుశలముం గని తెల్పఁగఁ బంపె దేవి నే
నిచ్చటి నుండి యేగి వచియించెడు నంతకు వేచి యుండెడిన్ 445

తే.గీ. ఆ పరాక్రమాఢ్యుఁ డతుల తేజుండును
రాఘవప్రియుఁడును లక్ష్మణుండు
చెల్పె భక్తితోడ సాష్టాంగ వినతిని
దెల్పుచుంటి సీత దేవి వినుము 446

ఆ.వె. బ్రతికి యున్నయెడల బలుసాకు దినియైన
నూరువత్సరంబు లేరు గాని
యమితసుఖము బొంద నగు నన్న సామెత
తథ్యమాయె నాకు తథ్యమాయె! 447

ద్వి. అని సంతసించె నా హనుమంతు నుడుల
విని నంత సీతమ్మ వీడి శోకంబు 448

ద్వి. హనుమపై సందేహమును వీడి సీత
జనకజయే యని హనుమ నమ్మెచును. 449

ద్వి. దజీఁ జేరు హనుమను ధాత్రిజ గనుచు
వెఱపొందు మాయావి వేషంబు గాఁగ 450

తే.గీ.వానరుని రీతి రాక్షస పతియె వచ్చె
నాడ రానట్టి మాటలు నాడి నాఁడు
దరికి వచ్చుచుండె నటించు దాల్మి వీడి
శోకతప్తగ మారె సశోకము దరి 451

గీ. బుద్ధిమంతుండు హనుమంతు భూమి పుత్రి
సంశయంబుఁ గనుచు, నమస్కార మిడెను
మాటలాడ నుండిన హను మంతుఁ గనక
భయము గదురుగ సీతమ్మ పలుక దొడఁగె 452

ఉ. కానఁగ వచ్చినావె యిటు గా నిజరూపము మార్చి, యా జన
స్థానమునందు మున్నిటుగ సల్పిరె, దానన దుఃఖితన్ గదా
వానరరూపమూని నను వంచనఁ జేయఁగ వచ్చినావె, నేఁ
బూన మదించె దుఃఖమును బొమ్మిక వీడుచు
మాయవేషమున్ 453

మ. కలయా నిక్కువమా! సురారినటనా! కాకున్న నేమౌను గ
న్నులకుం దోచెడి వానరుండె యితడెంతో ప్రీతిమైబల్కు మా
టలహో సమ్మతి! నింతకంటె వ్యధగాఢంబౌనె! యేమైనఁ గా
గలవానినిం జవదాటఁగాఁ గలనె నా కర్మాను బంధమ్మనన్ 454

తే.గీ.పొరబడుచునుంటి నినుఁ గన్నఁ బరమ శాంతి
హృదయసీమను నెలకొనె విదిత మిద్ది
రాము దూతవు నీవైన రాము కృపను
మంగళంబగు నీకు సు మంగళమ్ము 455

తే.గీ.స్వప్నమందైన రామలక్ష్మణులఁ గనిన
శాంతినొందెద శోకంబు సమయు నాకు
నే నిపుడు స్వప్నమునఁ గోతిఁ గాన నైన
దుఃఖమే కూడు రామ సంతోష మిట్లు 456

తే.గీ.చిత్తవిభ్రాంతియా యిది! చేరువ నినుఁ
గాంచఁ గల్గుచు మాటాడఁ గల్గుచుంటి

నెండమావులఁ గను రీతి యేమొ యిదియు
ననుచు సంశయించెడి సీత హనుమ గనుచు 457

తే.గీ.రాఘవ గుణానుభవ మంత రమణి హృదికి
రంజకంబగు చొప్పున రాముఁ గూర్చి
పలుక మొదలిడె జానకి భయము దీరఁ
జెవుల కింపుగ వినుచుండ సీత రహిని 458

సీ. రవిఁబోలు కాంతిమై రాజిల్లువాఁడును
కమనీయ చంద్ర ముఖంబు వాఁడు
అలకుబేరుఁడన రాజాధిరాజగు వాఁడు
విష్ణువుతో సరి వీర వరుఁడు
వాచస్పతిగ సత్య వాదిగ మనువాఁడు
ఆత్మ కింపుగ మాట లాడు వాఁడు
మన్మధాకారుండు మహిత దీప్తి యుతుండు
లోకాశ్రితుండు ముల్లోక నుతుఁడు

తే.గీ.ఆ మహాత్ముని కోపంబు వ్యర్థ మగునె
ఆ మహారథుఁ డాశ్రమ మందు నుండి
వెడల మాయఁ బూనుచు, దైత్య విభుఁడు నిన్ను
దొంగిలించిన ఫలముఁ జూతువు గదమ్మ 459

ఉ. పావకు రీతివెల్గు తన బాణపరంపరచే నెవండహో
రావణుఁ జంపువాఁడొ రణ రంగమునం దతఁడంప, దూతనై
నీవు గలట్టి లంక కెటు నే, జనుదెంచితి; నిన్ను వీడి దుః
ఖావిలుఁడైన రాఘవుఁడు క్ష్మాసుత క్షేమ మెఱుంగఁ
గోరెడిన్ 460

తే:గీ.ఆ బలాఢ్యుండు లక్ష్మణుఁ డతుల గుణుఁడు
వీరవరుఁడు దేవికినమస్కార మిడుచు
క్షేమ మడిగెడు సుమ్మి సుగ్రీవ రాజుఁ
గూడ నీక్షేమమడిగెడు కూర్మి తోడ 461

ఉ. దేవిరో! నిన్దలంతురు పదింబది రాముఁడు లక్ష్మణుండు సు
గ్రీవుఁడు దైత్యవారమిటు కీడొనరింపఁగ బాధకొద్దుచున్
జీవముతోడ నుండుట విశేషము. భాగ్యవశంబునం గదా
నీవిక రాము లక్ష్మణు వనేచరరాజునుఁ జూతు వింతలో 462

ద్వి. హనుమంతుఁడను వాడ సంబుధి దాటి
నినుఁ గాంచ వచ్చితి నే లంక కిపుడు 463

ద్వి. మాయావిఁ గాను నే మాయావిఁ గాను
వాయుసూనుఁడ దేవి ప్రార్థింతు వినుము 464

ద్వి. పాపి రావణునెత్తి పాదంబు నుంచి
నీపంచఁ గని నాద నే నమ్మదేవి 465

ద్వి. విని వాయుసూనుని విన్నప మెల్ల
జనకజ ప్రశ్నించె హనుమంతు నపుడు 466

తే.గీ. వానరులకు నరులకు సంబంధ మెటుల
నెచట సమకూడె మైత్రి నీ కెచటఁ గలిగె
రామ రామానుజులతోడ రాము లక్ష్మ
ణు గుణుతులఁ దెల్పుమీ విన. వగ. శమించు 467

ద్వి. హనుమంతుఁ డామాట వినునంతఁ దెల్పెఁ
గనియున్న వారిరేఖల రూపములను 468

హనుమంతుఁడు రామాభివర్ణనము

ఉ. ఓకమలాక్షి! రాఘవు మహోన్నత సద్గుణ రూప రేఖలన్
నీకు వినంగఁ జెప్పుమన నేను కృతార్థుఁడనైతి, రాఘవా
లోకనమూని వాని గుణ లోకమెఱింగిన యంతవట్టు నే
వాకొనువాఁ నమ్మ రఘువర్యుఁ డతుల్యుఁడుగా జగంబునన్ 469

ద్వి. శ్రీరామ సద్గుణ శ్రేణిఁ గీర్తింప
ఆ రూపురేఖల నభివర్ణనమున 470

దర్శనాశ్వాసము - హనుమంతుఁడు రామాభివర్ణనము

ద్వి. ధన్యుండ నేనౌదు ధన్యుండ నౌదు
అన్యుండు గాడతఁ డాత్మీయుఁడేసుమ

ద్వి. లక్షించి తెల్పెద లక్ష్మణు రూపు
వీక్షించినదియెల్ల విడువక దేవి

ఉ. రాముఁడు రూపవంతుఁడు, విరాజిత దివ్యసులక్షణుండు, సు
త్రాముని కంటె వీరుఁడగు రాముఁడు సర్వశుభంకరుండు నా
సోమ నిభాననుండు మఱి సూర్యునిఁ బోలెడి కాంతిమంతుఁడు
శ్యామలవర్ణమూర్తి వనజాక్షుఁడునై యువతాంమెత్రైగా

ద్వి. సౌందర్య దాక్షిణ్య సకల పూర్ణుండు
విందగు కనుదోయి వీక్షించు వాడు

ద్వి. సకల జీవంబుల సంరక్షకుండు
సకల ధర్మంబుల సాకెడి వాడు

ద్వి. భూమిని నోర్పునఁ బోలెడి వాఁడు
రాముఁడు గురురీతి రాజిల్లు బుద్ధి

ద్వి. మార్గదర్శకుఁడౌచు మనుజ కోటికిని
దీర్ఘదృష్టిని మను ధీశక్తి తోడ

ద్వి. స్వీయధర్మము వీడి చేయఁ డేదియును
బాయండు కులధర్మ పథము నెన్నండు

ద్వి. ఉపదేశమాత్రుఁడే యూరక కాఁడు
తపసి యనుష్ఠాన తత్పరుం డతఁడు

ద్వి. ఆశ్రితావనమూర్తి యతుల గుణుండు
ఆశ్రమవర్తి సదాచారవర్తి

ద్వి. బ్రహ్మచర్యంబునే పాటించు వాడు
బ్రాహ్మీ ముహూర్తాన పనులూను వాడు

ద్వి. వేదవేదాంగాది విద్యాధికుండు
మోదంబుతో ధనుర్వేదంబు నేర్చె

ద్వి. శిష్టుల రక్షించు శ్రేష్ఠుఁ డాతండు
దుష్టుల శిక్షించు దోర్బలశాలి 483

ద్వి. ఆజానుబాహుఁడౌ నందగాఁ డతఁడు
వ్యాజంబు లేని కృపాపరుం డతఁడు 484

ద్వి. దాన వీరుండును ధర్మ వీరుండు
పూని యర్థినిఁ దృప్తిఁ బొందించు వాడు 485

ద్వి. యుద్ధ వీరుండు రణోద్ధతుం డతఁడు
సిద్ధచరితుఁడు మహేశ్వరుం డతఁడు 486

తే.గీ. శంఖమును బోలు మెడయు విశాలమైన
మూపులును దుందుభిస్వనమును సమాంగ
సమ విభక్తాంగముల నుండు, శ్యామలుండు
రామచంద్రుండు సౌందర్య రాశి గాఁగ 487

తే.గీ. కనుగొనలు నఖములు నఱ గాళ్లను నఱ
చేతులును నెఱ్ఱనై యుండు చెలువు వాడు
తొమ్మ మణికట్టు పిడికిలి యమ్మ! దిటవు
గాఁగఁ గనుబొమ్మలుండు దీర్ఘములు గాగ 488

తే.గీ. కంఠమున నాభిమూఁడు రేఖలు ను గలవు
పొద వతని వెంట్రుకలు పాద ములఁ గలట్టి
రేఖలు సునువుతై తగు రీతి వరల
నాతఁడు మనోహరుండయి యలరు వాఁడు 489

తే.గీ. పిక్కలును బిడ్డలును గూడ నొక్క రీతి
హ్రస్వములు, తలయందు నమరి యున్న
నరయ మూడు సుళ్ళం గుష్ఠ మందు నాల్గు
రేఖలున్నవి లక్షణ రీతిఁ గాగ 490

తే.గీ.వెడఁదయురమును నిడుదలౌ తొడలు గలవు
నుదుట నఱచేతులందునఁ బదయుగంబు
లందు నొక్కొక్క దానిలో నమరి యున్న
వాతనికి నాల్గురేఖలత్యమిత దీప్తి 491

తే.గీ.ఎనిమి వడుగుల పొడవునఁ దనువు గలదు
దంష్ట్రిలనఁబడు నాలుగు దంతములును
లక్షితములైనఁ గడు శుభలక్షణ యుతి
గలవు హనువులున్నతములై గ్రాలు వాఁడు 492

ఆ.వె.కండ్లు పండ్లు, గేశ కరములు బదములు
కాంతి మంతములయి గ్రాలు వాఁడు
యశము తేజు సిరుల నసమానమగు వాఁడు
చూపు, బుద్ధి మిగుల సూక్ష్మములును 493

తే.గీ.అతఁడు పూర్వాహ్ణమున ధర్మ మరయు వాఁడు
అతఁడు మధ్యాహ్నకాలాన నర్థ మరయు
అతఁ డపరాహ్ణమున కామ మరయుచుండు
వరుస కాలక్రమంబున నరయు విధుల 494

ఉ. రాముఁడు సత్యసంధుఁడు నిరంతర ధర్మపరుండు వీరుఁడున్
శ్రీమహితుండు దానగుణ సిద్ధుఁడు నర్థి జనాశ్రితుండునున్
గామముఁ గ్రోధముం గనని కర్మతుఁ డౌచు సకాలమందునన్
నేమముతోడఁ ధర్మవిధి నేర్పున దీర్చెడి విజ్ఞుఁడున్ సదా 495

తే.గీ.సకలగుణమూర్తి రాముండు శ్యామలుండు
లక్ష్మణుఁడు స్వర్ణకాంతి విలక్షణుండు
నన్నయును దమ్ముఁడును సక లార్థగతుల
సములు నిజ రూప సంపద సములు వారు 496

తే.గీ.అందగాడన రాముఁడే యంద గాడు
పూరుషులె వాని మోహించు పురుషుఁ డతఁడు

వాని యందచందము లేను వాకొనంగఁ
జాల ననుభవవేద్యమే యాత్మ కెపుడు 497

## మైత్రి విధానము

ఉ. జానకి జాడఁ దీయ రఘు చంద్రుఁడు లక్ష్మణుఁడుం జరించుచున్
గానను, ఋష్యమూక గిరిఁ గాంచిరి వారటనుండు వేళ, నా
వానరరాజు వారిఁ గని వారల మైత్రిని, బొందె, మంత్రినై
నే నటనుంటి నప్పుడు వనీచరనాధుని సేవఁ జేయుచున్ 498

ఉ. లావును చేవయుం గలిగి రాజగు వాలి సహోదరుండు సు
గ్రీవుని బారఁ దోల వనికిన్ విడి భార్యను వీటి సంపదన్
జీవిగఁ ఋష్యమూకగిరిఁ జేరి వసించు నతండు శ్రేష్ఠులన్
భూవరు పుత్రులం గనుచు బొంది భయంబును భీతచిత్తుఁడై 499

ద్వి. వీరమూర్తులు ధర్మ ధారులు వారు
ధీరులై నడిచెడి తీరును జూచి 500

ద్వి. గజ సింహ శార్దూల గమనంబు కరణి
నిజపాదఘట్టన నేల యద్రువఁగఁ 501

ద్వి. నార చీరలఁ గట్టి వీరులౌ వారు
మారు వేషము తోడ మసలుటఁ గాంచి 502

ద్వి. వాలి పంపున వారు వచ్చి రటంచు
లోలోన సుగ్రీవుఁ డాలోచనమున 503

తే.గీ. కొండ కొనసుండి కని వారి కోతిఱేడు
మంత్రులను బిల్చి మదిఁ గల మాటఁ జెప్పి
వార లెవ్వారొ కన నన్ను వారి కడకుఁ
బంపె నే జని వారల ప్రాపుఁ గాంచి 504

తే.గీ. వారి యపురూపములఁ గాంచి ప్రణతి సల్పి
వారల యదార్థతత్వమ్ము దాఁపగఁ గని

మూఁపుపై వారి సుగ్రీవఁ జూపు కడకుఁ
దెచ్చి యుంటిని సంతుష్టిని మెచ్చ నతఁడు 505

తే.గీ.అతుల మైత్రిఁ గనిరి సమానార్థు లగుట
నొండొరుని బాధ విని వార లుండి యచటఁ
బ్లవఁగపతియు నరేశ్వర రాఘవుండు
నొకరి నొకరు సమాశ్వాస మూని రపుడు 506

తే.గీ.వాలిఁ బరిమార్చి సుగ్రీవుఁ బాలకునిగ
వరలఁ జేయుచు నిజసతి వాడు గూడ
రాముఁ డొనరించెఁ సుగ్రీవ రాజు మాఱు
గ మముఁబంపెజానకి జాడఁ గనఁగ నిటుగ 507

చం. విసిరితివీవు నీ నగలుఁ బృద్వి పయింబడ మూట గట్టి,ఆ
యసురుఁడు నిన్ హరించి కడు నాతురతం గొనిపోవుచుండ నీ
వ్యసనము వించు భూమిఁ బడ వైచిన మూటఁ గ్రహించి
దాచి, యి
చ్చె సరిఁ గనంగఁ గీశపతి చేఁ గొని రాముఁడు మూట
విప్పుచున్ 508

చం. నగలను గాంచు నంతటనె నాసతి భూషలె యివ్వి యంచు గు
ర్తుగఁ గని యేడ్చియేడ్చి కడు రోయుచు మూర్ఛిలి తెప్పరిల్లె నా
సుగుణవరుండు లక్ష్మణుఁడుఁ జూచుచు భూషల దుఃఖమొందె నా
నగ లిపుడన్నియుం బ్లవగ నాథుఁడు జాగృతి తోడదాచెబో 509

తే.గీ.రాము సుగ్రీవు లిర్వురు రాజు లయ్యు
వీడి నిజవాసముల, వీడి విమల సతుల
రెండిటను సమానార్థులై యుండు కతన
సుస్థిరస్నేహపరులైరి సుమ్మి దేవి! 510

మ. సురరాజాత్మజుఁ జంపి, రాజ్యము సతిన్ సుగ్రీవుచేఁ బెట్టఁగా
వరరాముండు ప్రతిజ్ఞ సేసె ప్రభువై పద్మాక్షి సీతన్ వసీ
చరనాథుండు కనుంగొనం దలఁచి బాసం జేసె దీప్తాగ్నితో
బరిమార్చెన్ రఘునందనుండటుగనే వాలిం బ్లవంగేశ్వరున్ 511

ద్వి. ముష్కరుఁడా వాలి పుడమిని వీడ
కిష్కింధ కధిపు సుగ్రీవునిఁ జేసె 512

ద్వి పరనారిఁ గొనియున్న దురితుండు వాలిఁ
బరిమార్చె సద్ధర్మ పరుఁడు నీ భర్త 513

తే,గీ.సూర్య సుతుఁడు కృతజ్ఞుఁడై సుదతి సీత
వెదుకఁ బంపెను నిజసైన్య వీరవరుల
దిక్కు లన్నింటికిని యామ్య దిశకు నంగ
దుండు రాగ నాతని వెంట నుండి నాడ 514

ఉ. వేనకు వేలుగాఁ బ్లవగ వీరవరుల్ గల రెందఱెందరో
జానకి జాడఁ దీయఁగ దిశాంతములం గననేగి నారలా
వానరులందు నంగదుని వర్గముఁ గూడుచు దక్షిణాపథం
బేను చరించుచుండ, గడు వెల్లయు దీరెను రెండు
మాసముల్ 515

ఆ.వె.రెండు నెలలు ముగియ కుండఁగ మరలిరా
గడు వాసంగె ఱేఁడు గడువు మీర
మరణ శిక్షయంచు మఱిమఱి దెల్పెను
వెదుకుచుండ దారి వెడలె గడువు 516

ఆ.వె.మరణశిక్ష భీతి మఱలి పోఁనొల్లక
యంగదుండు తానె యంతరింపఁ
బట్టుపట్టి పూనె ప్రాయోపవేశంబు
కోతిమూక యతని రీతిని జనె 517

ద్వి. ఇంతలో సంపాతి యిట కేగుదెంచి
వింతగా మము దిన వేడుకనుండి 518

తే.గీ.పక్షిరాజగు సంపాతి భ్రాతయే సుమ
అల జటాయువు రావణుఁ డపుడు నిన్ను
దెచ్చు చుండంగ రణమూని చచ్చె ననిన
మాటవినె యంగదుండాడు మాటలందు 519

ద్వి. ఆతఁడు సంపాతి కనుజుఁడే యగుటఁ
జేతంబు తపియింప సీతమ్మ జాడ 520

ద్వి. కోపంబు తోఁదెల్పె కొండంత యాశ
మా పుణ్యఫలమున మాకు జన్మించె 521

ద్వి. సుడి గాలివలె సీతఁ జూచెడి కోర్కి
వడివడి వచ్చెను ప్లవగు లందఱకు 522

ద్వి. ప్రాయోపవేశంబు వదలి నారంత
ధ్యేయమూర్తిగ నీవ దేవిరో యగుట 523

ద్వి. కాని కడలి దాటఁ గలవా డెవండు
పూని లంకకుఁ జేరి భూమిజఁ గనఁగ 524

ద్వి. అను ప్రశ్న యుదయించి హనుమంతు నన్ను
వనచరులెల్లరుఁ బంప వచ్చితిని 525

ద్వి. నినుఁ గని నీ క్షేమ మును దెల్పు వఱకు
వనచరతతి వేచు వననిధి చెంత 526

ద్వి. సెలవిచ్చి పంపుమీ సీతమ్మ నన్ను
జలనిధి దాటుచుఁ జయ్యన వెడలి 527

ద్వి. జనకజ క్షేమంబు మనుజాధిపతికి
వనచర తతికిని మనవి నేయంగ 528

ద్వి. మాయావిఁగాను నే మాయావిఁ గాను
పాయుమీ నీశంకఁ బావన నన్ను 529

ద్వి. శతయోజనంబుల జలనిధి దాటి
అతులపతివ్రతా! యమల! నిన్గంటి 530

ద్వి. రామ నామాంకిత రమణీయ ముద్రి
రాముండు నీకిడ భూసుత యిచ్చె 531

ద్వి. కొనుముంగరమ్మ శంకను దక్కి యిదిగొ
అని తానుదెచ్చిన యంగుళీయకము 532

ద్వి. జనకజకిడె భక్తి వినతి సల్పుచును
గనుమిక నమ్మికఁ గనుమనె హనుమ 533

ద్వి. రాహు విముక్త చంద్రానన సీత
యా హనుమ యిడిన యంగుళీయకము 534

ద్వి. భర్తను గనినట్లు పరమ సంతుష్టి
నార్తిని విడనాడి యంతటఁ గాంచి 535

ఆ.వె. తనువు పులకరింపఁ దమితోడ మఱిమఱి
యుంగరంబుఁ జూచి యువిద పొంగు
కొంత విస్మరించి చింతను సీతమ్మ
పలుకఁ గడఁగెఁ బ్రీతి వాయుజునకు 536

ఉ. నీవొకరుండవే హనుమ యీ యసురేశ్వరులంకఁ జొచ్చితే
ఈవె పరాక్రముండవు సుమీ కొనియాడఁగ నాకు శక్యమే
నీవహ బుద్ధిశాలివి, వనీచరవీరుఁడ! ధైర్యశాలివై
ఈవెటు లబ్ధిదాటితివొ! యీ శతయోజనముల్ సుధీనిధీ? 537

ఉ. వానరముఖ్య! నీబలము వాయుసమం బసమానముం గదా
కానఁగఁ జొప్పు నీవిటను గష్టములన్ విదితాత్ముఁడైన భూ
జాని రఘూద్వహుండని, సర్వము నీ మహనీయశక్తినిం
గానక విన్న నన్నుఁ గనఁ గాఁ బనుపండిటు, రాము
దూతవే 538

ఉ. రాముఁడు లక్ష్మణుండు కుశలంబని వింటి శుభప్రదంబుఁగా
ఏమనువాడు లక్ష్మణుఁ డహీన పరాక్రముఁడైన వాఁడు నా
మాట వెలింగియుండెనొకొ; పార్థివసూను లెఱింగియున్నచో
భీమబలాఢ్యులైన రఘు వీరులు స్తబ్ధులు గాగ నుందురే! 539

ఉ. రాముఁడు ఘోరరాక్షసవిరాముఁడు కోపము నొందకుండెనా?
భూమి దహింపఁ జేయఁగల భూరి బలం బెటులూరకుండెనో!
ఏమనుదాన నాదువ్యథ కింక వినాశము లేదొ? కాని చో
నా మనుజేశ్వరుండు తన యాలి హరించిన దైత్యుఁ
జంపఁడే 540

ఉ. ఆపురుషోత్తముల్ సురలనైన జయింప సమర్థులే వగం
గోపము నెందఁ జాలమి దిగుల్పడి వీడిరె సర్వ యత్నమున్
నాపయిఁ బ్రేముడిన్ విడిచెనా? రఘురాముఁడు; వీడకున్న చో
నోపఁ గలాడె; నన్విడిచి యుండఁగలాఁడె క్షణం బొకండయేన్ 541

చం. జనకజ క్షేమమేయనుము క్ష్మాసుత క్షేమమటంచు దెల్పుమీ
యినకులవంశ రాఘవనరేశుని భార్య సజీవి యంచు, రా
మునె మదినిల్పుచుండి తలపోయుచు భక్తిని, మ్రొక్కుచున్నదం
చును బెను జాములం బడుచు నార్తిఁ దపించెడి నంచుఁ
దెల్పుమీ 542

తే.గీ. నన్ను వీడిన శోకాన నా విభుండు
పరితపించుచు దీనుఁడై పరిభవంబు
మఱువఁ జాలునె? రణమూని యరుల జంపు
యత్న మొనరించుచుండడె యాంజనేయ! 543

తే.గీ. హితులయెడ సామ దానంబు లెపుడుఁ బూని
వారి లాలించుచుండునా? వైరియెడల
దాన భేద దండోపాయఁ తతులఁ బూని
సమయ మెంచుచు మెలఁగు నా విమలమూర్తి? 544

తే.గీ. రాముఁడే సఖుడంచుఁ దలంచివచ్చు
వారిసఖ్యము నొందునా యేరిఁ గాని
విడువకుండునె? సద్గుణ వీరవరుఁడు
రాము స్నేహంబుఁ గోరుచు రారె విదులు? 545

తే.గీ.రాకుమారుండు కోసల రాణి సుతుఁడు
దేవతానుగ్రహంబూని ధృతినిఁ జేయు
నెట్టి పనినైన నాపతి యెటుగ వీడె
నాడు దుఃఖమ్ము? మఱచెనా? నన్ను వీడి 546

తే.గీ.వినమె కౌసల్యయు సుమిత్ర వీరభరతు
క్షేమ వార్త లప్పుడపుడు శుభకరుండు
భాతృ వత్సలుండైన నా భరతుఁడంప
కుండునె యొకయక్షౌహిణి దండు నైన 547

తే.గీ.వచ్చునాయేమి సుగ్రీవ వానరపతి!
దంతముల నఖాయుధముల దైత్యుఁ జంపు
వానరబలగంబుఁ గొనుచు వసధి దాటి
రావణు నెదిర్చి విజయుండె రాముఁడు గన 548

తే.గీ.అతులబాణాస్త్రవిదుఁడు రామానుజుండు
లంక లోఁగల రాక్షస రాజినెల్ల
దునుమునాయేమి? కనెదనా దనుజపతియు
నతని బాంధవులు మరణ మందు సపుడు 549

తే.గీ.ఎవఁడు ధర్మార్థమై వని కేగుచుండి
కాలి నడకను ననుగొనె కాన కపుడు
భయము దుఃఖంబుఁ గాంచని పద్మముఖము
నేడు వాడినదా? నన్ను వీడియుండు? 550

తే.గీ.రాఘవుని తల్లి దండ్రుల రాగ మెంచ
నాడు స్నేహంబునకు మించి నదియ కాదు
రాముఁ డికనన్ను గొనిపోవ రా గలండో
లేదొ యెఱుగు నందాక నే వీడఁ దనువు 551

తే.గీ.మధురముగఁ బల్కనేర్చిన మంజువాణి
సీత హనుమంతుతో నిట్లు సెప్పి యూర

కున్నది హనుమ మారాట నొప్ప గతిని
వాయుజుండంతఁ జేమోడ్చి ఫాలమందు 552

చం. జనకజ! నీ విధుం దెఱుఁగఁ జాలమి నీవిటనుండియుంట వే
జని తెలుపంగ నీయునికిఁ జయ్యన రాఁగలవాఁడు లంకకున్
నినుఁ గొనిపోవునంతట వనీచరవర్గము గూడి రావణున్
దునిమి సురారు లెల్లరును దూల భువిన్, వినుమీ పతివ్రతా! 553

ద్వి. నినుఁ గనఁ జాలక నీభర్త వ్యథను
మునిఁగి తేలుచునుండె వనజాక్షి! దేవి!! 554

ఉ. అందము చిందులాడు వదనాబ్జముఁ జూతువు; దొండపండనన్
విందొన గూర్చు మోవిగల వీనుల కుండలముల్ ధరించు పూ
ర్ణేందు నిభాననుం గనుదు వీవిక, నీలతనూ విలాసునిన్
సుందరమూర్తి రాఘవుని జూతువు నిశ్చయ మిద్ది దేవిరో! 555

చం. ఫలములఁ గందమూలముల భక్షణ సేయుచునున్న రాఘవుం
దలఘుమతిన్ నినుం గలియు నాన, యిదేసుమ, నేఁ జరించు నా
మలయ గిరీంద్ర వింధ్యముల మందర దుర్దుర మేరుభూధరం
బుల పయి, బూనుదున్ శపథముం దినుబండ్లపయిం
బతివ్రతా! 556

మ. నిను నేకాగ్రమనంబునం దలఁయచున్ నిన్నే స్మరించున్ సదా
కనఁ జాలందుసుప్తి నొకక్షణమేన్ గానంగ నిద్రన్ దిగా
లున లేచున్ వ్యసనంబుఁ జెందుచును నీ రూపంబె లోనెంచుచుం
దన మేనన్ వని మూగు నీగలను జేతం దోల డెన్నండునున్ 557

తే.గీ.ఫలము పుష్పంబు మొదలగు లలితవస్తు
చయముఁ గాంచిన యంతనే ప్రియ యటంచు
విడుచుటను నిన్ను నిట్టూర్పు వీడుచుండు
సీత! నినుఁ బొందు యత్నంబె సేయుచుండె 558

ద్వి. రాముఁడు కొనిపోవ రాఁగలఁడంచుఁ
ప్రేమమిడిఁ దన్నెంచు రీతి నాలించి 559

ద్వి. మిగుల సంతృప్తిమై దిగులు వీడుచును
వగనుండెఁ బ్రియుఁడని వాయుజుం డనుట 560

ద్వి. తన భర్త తన్నెంచి కనె వ్యధనంచు
విని జానకియు దుఃఖ మును గాంచి పలికె 561

ఉ. సంతస మందఁగల్గి రఘు చంద్రుఁడు రాఁగలఁడంచు వింట నే
నెంతయొ దుఃఖితాత్మను సుమీ, ప్రియుఁడిప్పుడు నా నిమిత్తమై
చింతఁ గడంగె యుండెనని చెప్పుటచే నమృతంబునన్ విషం
బెంతయొ తేలియుండుగతి నే గనియుంటి ముదంబు
దుఃఖమున్ 562

తే.గీ.దారుణ వ్యసనంబున, మేర లేని
సిరి తటస్థించి నప్పుడుఁ బురుషుఁ డరయ
దైవ విధి తాఁడు మెడఁగట్టి తరలఁ జేయు
వాడె కాని స్వేచ్ఛఁ బఱగెడి వాడు కాడు 563

తే.గీ.ప్రాణులకు దైవ విధి దాట వశము గాదు
నిశ్చయంబిద్ది వాయుజా నిశ్చయ మిది
అమల రాముండు నేను రామానుజుండు
ముగ్వురము గూడ వ్యసనంబుఁ బొందినాము 564

తే.గీ.అబ్ధిలో నోడ మునుఁగఁగాఁ నలనటఁ గని
యీదులాడుచుఁ గట్టున కేగు వాని
వలెఁ బరమదుఃఖితుఁడు రామపార్థివుండు
కడచునే దుఃఖ సింధువు గట్టుఁ జేర 565

తే.గీ.వత్సరంబొందె యిడియె రావణుఁడు గడువు
గడువు దాటిన నను జంపఁ గలఁడు వాడు
గడువు మీరక మున్నె రాఘవుఁడు రాగ
విన్నవించితి నసుము నా విభున కీవు 566

తే.గీ. నాకుఁ దెలియు రాఘవుని గుణంబులన్ని
లక్ష్మణుఁడు తోడు లేకుండ రామ వీరుఁ
డా జనస్థానమందున నాసురతతిఁ
జంపెఁ బదినాల్గువేలను జంకు లేక 567

తే.గీ. భీతిలేనివాడు బీభత్సమొనరించు
శత్రుసైన్యమెల్ల క్షణికమందె
ఎపుడువచ్చి రాముఁ డీలంకచెరనుండి
వీడఁజేయువాడొ వేచియుంటి 568

ఉ. చెప్పె విభీషణుండు ననుఁజెచ్చెర రాముని కప్పగించుచుం
దప్పును దిద్దుకొమ్మనుచు దైత్యవిభుండటుసేయనొల్ల డా
డెప్పుడుగాడు దుష్టులు లయింపఁగ నుండిన వారికిన్ హితం
బొప్పునె యేరుచెప్పినను నొప్పడురావణుఁడెంతమాత్రమున్ 569

తే.గీ. చెవులకెక్కునె సజ్జనుల్ చెప్పుహితము
దుష్టులావారలటుసేయ నిష్టపడరు
ననల యను విభీషణసుత నాకుఁజెప్పె
తల్లి పంపున ననుఁగనఁ దానెవచ్చి 570

ఉ. వేరు మార్గంబు లేదిక (బోరుఁ సలిపి
దైత్యరాజును వధియించి దాశరథియె
నన్నుఁ దోడ్కొని పోయెడి తెన్ను, దప్ప
రాముఁ డెప్పుడువచ్చు! వీరాంజనేయ! 571

హనుమ సీతను మూపుపై నెక్కి రమ్మనుట

ద్వి. అని కృశించిన సీత హనుమతో ననఁగ
వినుచుఁ బల్కెడి వీర హనుమంతుఁ డపుడు 572

తే.గీ. దివ్య మంగళ విగ్రహ దీప్తి వాడు
చేతనోద్ధారకుండు విశిష్ట గుణుఁడు

రామచంద్రుండు సీతమ్మ రాఁగలండు
నిన్ను రక్షింప నీతెన్ను విన్న యంత 573

మ. అనఘా! చింతిలకమ్మ రాముఁడు సునాయాసంబుఁగా నిన్నుఁ దో
డ్కొని పోవంగలవాడు విష్ణువనఁగాఁ గోదండపాణిన్ సురా
రినిఁ జంపంగలవాని రాఘవుని నారీరత్నమా జూతు వీ
వనియందుం దృటివేచియుండు మటు కాదంచుం దలంపూనుదే! 574

ఉ. మూపున నెక్కి రమ్మ రఘు పుంగవుఁ జేర్చెద నిన్ను దేవిరో
వీపున మోసికొంచు నిను వేగముగాఁ గడలిం దరింపఁగా
నోపుదు శక్తివంతుఁడ రఘూత్తము పావనపాదసన్నిధిం
జూపుదుఁ బాయఁగా గలవు శోకము నీ సుమనోహరుంగనన్ 575

శా. శంకం దక్కుము మూపుపైన గొనిపోశక్తుండఁ గానంచు నీ
లంకన్ రావణుతోడ మోసికొని పో లావుంగలాడన్ సుమా
కొంకొక్కింతయులేకఁ బ్రస్రవణమున్ గొండం బతింగూడుమీ
జంకేలా! బహుస్వల్పకాలముననే సంద్రంబు లంఘింపనే 576

తే.గీ. జాగు సేయక రావమ్మ జానకి యిక
గగనమార్గాన లంఘింతుఁ గడలి నెల్ల
చంద్రునిం గూడు రోహిణి చందమునను
రాముఁ జేర్తుఁ బతివ్రతఁ రాగదమ్మ 577

తే.గీ. రాక్షసులు నన్నుఁబట్టుచు లంఘునమ్ము
సేయ నడ్డెద రంచని స్త్రీవిఁ గానఁ
దలతువేమొ! అటుగ నీవు దలఁపరాదు
నాకు సములేరు చరియింప నాకసమున! 578

ఆ.వె. ఎటుగఁ గడలి దాటి యిటఁజేరి యుంటినో
అటుగ నిన్నుఁ గూడి యబ్ధి దాటఁ
గలుగు వాడ సుమ్మి కష్టమేమి పడక
శంక వీడి రమ్ము జానకి యిక 579

## సీత సమాధానము

ఉ. వానరయోధుడైన హరి వాక్కులి హర్షముఁ బొంది విస్మృతిన్
జానకి వాయుజుం గనుచుఁ జయ్యనఁ బల్కెను గోతిపీవ నీ
మే నతిస్వల్పమే! కడలి మీదను దాటుచు నాదు భారముం
బూనుదె! దూరమందుఁ గల భూపునిఁ జూపఁగ మోయ
నెంతువే 580

ఉ. వింతగు మాటచే పరిభవించినదే వనజాయతాక్షి కా
సంతయు నాప్రభావమును సత్వ మెఱుంగమిఁ బల్కె నాదు లా
వంత నిజస్వరూపము ధరాత్మజ కిప్పుడె చూపువాడ, న
న్నంత గ్రహించుఁ నంచు గపియామెకుఁ జూపె నిజస్వరూప
మున్ 581

ఉ. భీకర మేరుమందర విభీషణ రూపుని దివ్యవజ్రదం
ష్ట్రాకర తామ్రవక్త్రుని మహాబలు భీమ నఖప్రదీప్తునిన్
నాకము నంటి పావకుఁడనన్ జ్వలియించెడి తేజువాని, తా
నాకులపాటు వీడి కనె నాధరణీసుత స్వీయ సన్నిధిన్ 582

ఉ. చూపుచు స్వస్వరూపము వసుంధరపుత్రికి! గొండ కోన తో
యేపగు కోటలుం గలిపి నీ యసురేశునితోడ లంకనే
మూపునఁ జేర్చి కొంచుఁ గొని పోవఁ గలాడను నమ్ము దేవి! నా
వీపున నెక్కివచ్చి రఘువీరుల యార్తినిఁ బాపు జానకీ 583

## సీత నిరాకరణము

ద్వి. అను పర్వతాకారు హనుమంతుఁ జూచి
జనకజ పలుకాడె సంతోష మొంది 584

తే.గీ. రాఘవుని గోము వింటి నీ రాక వలన
నీదు దివ్యస్వరూపంబు నేనుగంటి
నేను దుఃఖాబ్ధిఁ దరియింప నీవె నావ
ఘాచు నాచార్యగతిఁ జేర్పు మాత్మపతిని 585

తే.గీ. కాని పావని నీమూపు పైన నెక్కి
కడలి వేగాన లంఘింప నడల నొక్క!
జారి పడుదాన నేమొ నే జలధి యందు
తిములు నక్రములును జంపి తినవె నన్ను 586

మ. హనుమా! శత్రువినాశనుండవేసుమా! యైనన్ ననుం గావఁ బూ
నిన నీకాపద సంభవింపనగు నెంతే స్వీయసంరక్షణం
గనుచున్ నన్నును గావఁ జూడవలెగా కష్టంబగున్ దాన, నీ
కును నాకున్ దనుజాధిపుండు గనుచో గొంపోవుటన్
నన్నహో! 587

ఉ. పెక్కురు ఘోరరాక్షసులు వేగముగా నిను జుట్టిముట్టరే
నెక్కొని వారితో ననికి నీవెటు రక్షణ సేతునన్ను! మూ
పెక్కిన నేను గూలనొకొ యీభువి దైత్యులచేతఁ జిక్కినన్
ముక్కలుగాగఁ గోసి తినఁబూనరె వారలు వానరోత్తమా! 588

ఉ. ఇంతకు యుద్ధమూన నెవడెట్లు జయాపజయంబు లొందునో
యింతయుఁ జెప్పఁజాల మొకచొప్పున నీకు జయంబు లేనిచోఁ
బంతముఁ బూని రాక్షసులు బల్మిని నన్గొనిపోయి చంపరే
యంతట రాము కార్యమది వ్యర్థమగుంగద!లోఁ దలంపుమీ 589

శా. నీవే దైత్యులనెల్లరన్ దునుముచున్ నీవే జయంబందుచున్
నీవే రాముని కీయనన్నుఁ బరువౌనే యద్ది హర్షించునే
నా వీరుండు రఘూత్తముం డతఁడె దా నా లక్ష్మణుంగూడి, ర
క్షోవారంబును దున్మనెంచును సుమీ సుక్షాత్రకీర్త్యర్థమై 590

మ. వినుమోయీ పరిశుద్ధవర్తనుఁడ నీ వీపేనియుం దాక న
న్యుని ముట్టన్ మును రావణుండిటకు నన్నుం గొంచురా దాకడే
యని వాకొందువొ! అప్పుడే నబలనై ఆర్తిం బడం దెచ్చె, రా
ముని దక్కన్ మఱి యేనిముట్ట ననఘా ముమ్మాటికిం
జెప్పితిన్ 591

ోయి రాఘవుని నీ పతిసూర్యతనూజు లక్ష్మణున్
ంటవచ్చు కపిసేతలఁ దోడ్కొని రాగ రాముఁడే
బంధయుక్తు రణరంగమునం దునుమాడి నన్నుగొం
యుక్తమౌనుగద పొందు యశంబె రఘూత్తముండు
సున్ 592

హనుమ గుఱుతుఁ గోరుట

ంట లాలించి యానంద మొంది
హారి బల్కఁ వినఁగ సీతమ్మ 593

వ్రతాగరిమ దెల్పిన మాటల సంతసించితిన్
ల్లవీరుల వసిచపలంగొని లక్ష్మణాన్వితుం
ాస్త్రశస్త్రయుతుఁడై చనుదెంచెడి లంక కింక నీ
జంపువాడు రణరంగమునన్ నిను స్వీకరింపఁగా
ప సర్వమిట నే విని. చూచిన దానినెల్లయున్ 594

బునన్ వినుట నిప్పుడె రావణుఁడేగుదెంచి తా
యున్న మాటలను వానికిఁ జెప్పిన నీజవాబులున్
యూచకున్ బెదరి క్షోభనుఁ బొందుచు నాత్మహత్యనే
బూనియుండుటయుఁ జెప్పెదఁ దెచ్చెద రాము
లంకకున్ 595

యోజనాబ్ధిని దైత్యపతినిఁ
నుఁగాంచి లంకను గాంచినాడ
ండ నినుఁజేర్ప నీదుపతిని
దెల్పంగఁ గొనిపోదునంటి దేవి 596

యస్నేహమునఁ జేసి పల్కినాడ
తలంపకు మమ్మ? యనఘ? సీత
సతీపతుల నేకంబు సేయఁ
తినిఁ దలంచియే పల్కి యుంటి 597

తే.గీ. దేవి నావెంటరా సమ్మతించవుగద
ఇంక నేనేగి రాముని కెఱుకఁజేతు
నిన్ను నేగని మాటాడి యున్న నిజము
నమ్మ రాముండు గుఱుతీయవమ్మ నాకు 598

సీత గుఱుతు లిచ్చుట

ద్వి. సీతమ్మ, రాముండు చిత్రకూటాద్రి
ఘాతకుఁ గృపఁ గన్న కాకాసురకథ 599

ద్వి. వినిపించి హనుమకు, వీరరామునకు
మనవి సేయుము దీని వినినంత నమ్మ 600

ద్వి. శరణన్న రక్షించు సంప్రదాయమ్ము
మరువ రాదనుచు నా మాటగా నసుము 601

ద్వి. ముక్కుతో నసుఁ గాకి బొడిచిన యంత
దిక్కుల కెగఁబ్రాకి దిక్కేమి గనక 602

ద్వి. గ్రక్కున నీపాద కమలంబు లంటి
మ్రొక్కు కాకాసురు దిక్కైన నీవు 603

ద్వి. నాదిక్కుగా వేమి నళినాయతాక్ష
ఏది నీబ్రహ్మాస్త్ర మిప్పుడు లేదె 604

ఆ.వె. ముక్కు తోడ కాకి పొడిచిన మాత్రాన
పీకవాక్కు పక్కి వెంట బడఁగఁ
బరక దీసి యొందు బ్రహ్మాస్త్రముగఁ జేసి
నేడు దైత్యరాజు వీడి తేల 605

ఆ.వె. అపహరించి దైత్యు డపరాధియై యుండ
వీడినావ వాని వీరరామ!
నన్ను బొడిచి శరణ మన్న కాకిని బ్రోచి
దయను జూపియున్న దాశరథివి 606

ఆ.వె.దయను జూపి నీదు దాసినిఁ గరుణించి
పుటుక మొదలు నీకె మ్రొక్కు దానిఁ
గావ రావదేల? బ్రోవవాశరణార్థ!
రా దయాసముద్ర రక్షనిమ్మ 607

ద్వి. నిన్నె నాథుని గాగ నెఱనమ్మి యున్న
నన్ననాథను జేయు టెన్నను విడము 608

చం. అసురుల బాధనోపను మహాస్త్రచయుండవు రాక్షసాళిపై
విసరవదేల యస్త్రముల వీరుఁడ వీవు పరాక్రముండవున్
బస చెడకుండఁగా మెలఁగువాడవు కష్ట పరంపరాగతిన్
విసిగి యనర్థముల్ గనుట వీడితి వాక్కొ యనంతశక్తులన్ 609

చం. నిను నని గెల్వఁగాఁ గలుగు నేర్పరు లెవ్వరులేరు సృష్టిలోన్
ననుఁ గృపఁగాంచ నీమనసునంగలదేని, యలక్ష్యమూనుదే
దనుజుల నస్త్రశస్త్రముల దారుణరీతిని, జంప కుందువే
యినకులదీపకా! రఘుమహేశ్వర సత్యపరాక్రమా పతీ! 610

తే.గీ.వీరమూర్తియు క్షాత్రప మారకుండు
అన్నయాదర్శమున లక్ష్మణార్యుఁ డేని
వచ్చి రక్షింపకుండెనే వైరి దునిమి
పాపఫల మిట్టిదే యొక్కొ పట్టి కుడుపు 611

తే.గీ.అగ్ని వాయుసమానులా యన్న దమ్ము
లిర్వురును నూరకుండిరే హేతువేమొ!
ఒకరి నొక్కరు వీడక యుందు రేని
వార లిపుడైన నాయార్తి బాప రొక్కొ" 612

తే.గీ.అనుచు దుఃఖాశ్రుపూర్ణ యై యనిన ఆమె
మాట లాలించి వాయుకుమారుఁ డంత
ఆమె నోదార్చె దుఃఖింప నగునె దేవి
యనతి కాలంబులోన రామయ్య వచ్చు 613

తే.గీ.నీదు దుఃఖంబు వారించి నిన్నుఁ గొనును
అమల! నీదు వియోగా_ర్తి విముఖుఁడయ్యె
రాఘవుండన్ని పనులను, రాఁ గలండు
వైరి దునుమాడి నినుఁ గొనువాఁ డతండు 614

తే.గీ.రాఘవుఁడు దుఃఖమొందిన లక్ష్మణుండు
నార్తిఁ గనుచుండు నేకమై యలరు వారు
కష్టపడి నిన్నుఁ గాంచితిఁ గనల వలదు
భస్మముగఁ జేతు రీలంక వారు వచ్చి 615

ఉ. క్రూరుని రాక్షసాధముని గూల్చి యయోధ్యకు నిన్ను గొంచు నీ
వారలు రామలక్ష్మణులు వారు మహాబలులేను వార ల
వ్వారికి వానరేశునకు వానర కోటికిఁ జెప్పనున్న దే
మో రహిఁ జెప్పుమమ్మ! యిక పోయెదఁ జూచెద రాము
పాదముల్ 616

ద్వి. అను హనుమంతుని యా సీత గనుచు
విస్మయంబుతోఁ బల్కె వీడుచు నార్తి 617

సీత-ఎల్లర క్షేమ మడుగుట

ఆ.వె.కనియె లోకనాథుఁ గౌసల్య సుతునిగ
అతని నేను సౌఖ్య మడిగితినని
సల్పుచుంటి ననుచు సాష్టాంగ వినతిని
భక్తురాలు సీత పలుకుఁ దెలుపు 618

ఉ. తల్లిని దండ్రినివ్విడిచి దార నయోధ్యను వీడి సౌఖ్యముల్
డుల్లగ నన్నువెంట వనిలో దిరుగాడుచు మమ్ము నిద్దరన్
దల్లిగఁ దండ్రిగా గని సతంబుఁ జరించెడి ప్రీతి లక్ష్మణుం
డెల్లపుడున్ రఘూత్తముని నే హృది నిల్పెడి వాఁడు మారుతీ 619

తే.గీ.అన్న యాస మమ్మాటికి నాచరించు
వాఁడు, రామునకు ప్రియుండు వాని క్షేమ

మడిగితి ననుచు వాయుజా యతని కనుము
నాదు మాటగ నతనికి మోద మలర 620

ఉ. వానరముఖ్య! నాదు వ్యథఁ బాప సమర్థుఁడ వీవె కర్తవున్
దీనికి నీవె. రామునకు దీని నెఱుంగగఁ జెప్పి వెంటనే
పూనఁగఁ జేయుమీ కృషిని బూజ్యుఁడు వచ్చి ననుంగొనంగ వే
మానక చచ్చు సీత యొక మాసము దాటిన నంచుఁదెల్పుమీ 621

తే.గీ. వరసురేశు లక్ష్మి పాతాళమునఁ జేర
విష్ణు వంత నామె వెదకి దెచ్చి
నటుగ దైత్యనాథుఁ డపహరించిన భార్య
తన్నుఁ బ్రోవ గోరుచున్న దనుము 622

మ. అని చూడామణి విప్పి కొంగుముడి సీతమ్మంతటన్ వాయుపు
త్రునకిచ్చెన్ విభుఁడంత గుర్తుఁగని సంతోషించి, తన్ జ్ఞప్తికిం
గొనఁగా మారుతి సూక్ష్మరూపుఁడగుచున్ గొంపోవఁగానెంచి దా
నిని వ్రేలన్ బిగిఁబెట్టఁగా విఫలుఁడై నిర్లిప్తుఁడై భక్తిమై 623

ఆ.వె. సీత కంత మ్రొక్కి చేమోడ్చి శిరముపై
తమిని జానకికి బ్రదక్షిణమ్ము
సలిపి దశరథు స్నుష సన్నిధి నిలిచియు
మనసుచేత రాము మహితుఁ జేరె 624

తే.గీ. మణి నొసంగుచు సీతమ్మ మారుతి కనె
దానఁ గననౌను, నాతల్లి దశరథుండు
రామునకు జ్ఞప్తివత్తురీ రత్నమిచ్చెఁ
గాన్కగాఁ దల్లి పరిణయ కాలమందు 625

మ. హనుమా! రాముఁడు వచ్చి నన్నుఁ గొనఁగా యత్నంబ దేమున్నదో
గను భారంబిక నీదియేసుమ! మహాకష్టాబ్ధి యందుంటి రా
మునిఁ బ్రోత్సాహము సేసి యొడ్డుఁగనఁగా బూనంగ గర్తవ్యముం
గొనవే దాన సహించు దుఃఖమిక నాకుం దోడ్పడం గోరెదన్ 626

తే.గీ.అవనిజాత పల్కుల విని యటు లొనర్ప
బాసఁ జేసి పయనమూను ప్లవఁగవరుని
కనియె రాము లక్ష్మణు క్షేమ మరసితి నని
తెలుపు మంచు దగ్గుత్తిక పలుకు తోడ 627

ఉ. వానరరాజునుం ప్లవఁగ వర్యుల వృద్ధుల నెల్ల కీచులన్
గానఁగనుండి క్షేమము వినం దలపోయుచునుంటి నంచునున్
నానుడిగాగ వారలకన న్నిను గోరెద ధర్మరీతిగాఁ
బూనిక సేయు మీవ నను బొందఁగ సత్యపరాక్రముండికన్ 628

శా. నిన్నుం జూచితి నీహితంబు విని శాంతింబొందితింగొంత రా
మున్నారంచు రఘూద్వహుల్ వినుచు సంతోషించితిం గాని ఆ
పన్నన్ నన్దరిఁ జేర్పఁ గల్గు గురుదేవా నీవుఁ నన్వీడుచో
మున్నున్నట్టిగతిం దపించెదను నీ వుంబోయి వే రానిచో 629

మ. హనుమా యిచ్చితిఁ బెండ్లికాలమున లభ్యంబైనఁ జూడామణిన్
గొనుచుం జూపుము రామభూవిభునకున్ గుర్తించు నిన్నున్ శిరం
బున నేదాల్చుచుఁ జూచుచుండియె సతంబుంబొందుదుం
గొంత శాం
తిని దీనిన్ విడనాడుచుంటినిసుమా! నీకోర్కి కార్యార్థమై 630

తే.గీ.ఇంత వఱకేరెఱుంగని వింతగాధ
దాని గాకాసురుని కథ దాచకుండ
నీకుఁ జెప్పితి రాముండు నిన్ను గుఱుతు
సేయఁ జెప్పుము జానకి చెప్పినదని 631

ఆ.వె.మఱలి కడలిదాట మారుతీ రేపుండి
యలపుఁ దీర వెడల నౌను గాదె!
పడియుఁ బడుచు దైత్యబాధల నినుఁ గాంచి
కొంత యోర్మిఁ బొంది శాంతిఁ గంటి 632

వ. అని వాయుజుని రాక నాత్మలోఁ దలఁచి
జనకజ పలుకాడ హనుమంతుఁ డనియె 633

తే.గీ.రాముఁడు ప్లవగాధిపుఁడును లక్ష్మణుండు
వానరతతుల భల్లూక వారములను
వెంటఁ గొనివచ్చి లంకకుఁ ముంటఁ బెట్టి
రావణునిఁ జంపి నినుగొనిఁ పోవ గలరు 634

తే.గీ.కనెద వీవమ్మ మన బలగంబు నెల్ల
లంక ద్వారంబుకడ నగ్ని రాజుచుండ
లంక భస్మంబుగాగ నా రావణుండు
మడియఁ గనఁ గల్గుదానవు మైథిలి విను 635

ద్వి. అని యూరడించెడి హనుమంతుఁ గనుచు
జనకజ వెలిబుచ్చె శంక నొకండు 636

జనకజశంక

ద్వి. ప్లవగులు భల్లూక వర్గసంతతులు
జవమున్న వారలె జలనిధి దాట 637

ద్వి. శతయోజనాబ్ధిని శక్యమా రాజ
సుతులకు దాటంగఁ జూడఁగా నన్ను 638

ఆ.వె.వాయు దేవుడరయ వైనతేయుండును
నీవు దక్క నితరు లీ వననిధి
దాటఁ గల్గువారె దాటుదురని
నమ్మఁ జాలకుంటి సుమ్మి హనుమ 639

తే.గీ.అయిన నీ వొక్కరుండవె యసురపతిని
జంపి నను రాఘవున కప్ప గింపఁ గలుగు
శక్తిఁ గలవాడవే కాని శత్రువిజయ
కీర్తి నీకె దక్కును నాకుఁ కీర్తి చెడును 640

ఉ. రాముఁడు స్వీయబాణతతి రావణు నాహవమందు జంపుచున్
క్షేమము గాగ నన్నుఁ గొని చేర నయోధ్యకు గీర్తిదాయకం
బౌమహితాత్ముఁడైన రఘుపర్యునకున్ జనకాత్మజాతకున్
భీమబలుండు రామునకుఁ బేరిడఁగల్గిన మార్గమయ్యదే 641

చం. ప్లవగవరుండ సర్వగుణవంతుఁడు బాహుబలాధికుండు.రా
జవరుఁడు రాఘవుం డరులఁ జంపియె నన్నుఁ గొనంగ నొప్పు బా
ణవితతి యెల్లఁగుంటువడు నా అరిఁజంపఁగఁ జాలకుండునా
అవనిజఁ బొంది కీర్తిఁ గను యత్నమె రాముని బూనఁ
జేయుమీ 642

హనుమశంక-నివారించుట

ఉ. వానరరాజు సూర్యసుతవర్యుఁడు వాయుసమానవేగముం
బూని చరింపఁగాఁ గలుగు భూమిని నాకసమందుఁగూడ రా
మానుజుఁ బోలె నీపతికిఁ నండగ దండగ నున్నవాడు వే
సేనలఁగూడి రావణునిఁ జేడ్పడఁ జేయఁగవచ్చు జానకీ 643

మ. ప్లవగాధీశ్వరువాహినీతతులలో వారాశి లంఘింపఁగా
జవముం గల్గి మనోగతిం బఱగఁగా సామర్థ్యమున్నట్టి ధీ
రవరుల్ వేనకువేలుగాఁ గలరు వా రడ్డంబుగా నిల్వఁగా
దివియందుం జరియింపనోపెద రహో! దేవీ! ధరాపుత్రికా! 644

తే.గీ. అతుల సత్వసంపన్నుఁడా అర్కసుతుఁడు
వచ్చి భల్లూకములతోడ వనధి దాటి
నీదు కార్యంబు సాధింప నిశ్చితుండు
అమ్మ వైదేహి! వీడుమీ యార్తి నింక 645

తే.గీ. కలరు సుగ్రీవనృప బలగమ్ము నందు
పెక్కు వారలు దిక్కుల ద్రొక్కియున్న
వీరవరులెందఱో నన్ను మీఱు వారు
నా సమానులు లొజ్జు వానరులు లేరు 646

శా. నాకంటెం గడు నుత్తముల్ బలియులున్నారెంచ సుగ్రీవసే
నాకూటంబున నాయదృష్టమున ధన్యంబంద నాజన్మ నీ
తాకళ్యాణిని గాంచనోచితిని సంద్రంబెల్ల లంఘించి,రా
సాకల్యంబుగ వింటి నామె నుడి నే సామాన్యుఁడన్ మైథిలీ 647

ఉ. జానకి! యా ర్తివీడు మిక చయ్యన వానరు లబ్ధిదాటి లం
కానగరంబు ద్వారమునఁ గాలిడఁజూతువు రాములక్ష్మణుం
బూనుచు నాదు మూపుపయి బొందుగ వచ్చిన నన్ను వారలం
గానఁగ నౌను నీకు రఘుకాంతుని బొందెద వీవు నమ్ముమీ 648

శా. పురుషశ్రేష్ఠులు రామలక్ష్మణులనింబూనన్ మహాశంకృతిం
బరగంజేయఁగ బాణసంచయము దివ్యాస్త్రంబులన్, రావణా
సురుఁడున్ లంకయు, బంధుమిత్రసుతులున్ స్రుక్కంగ వే జూచి, నీ
పురముం జేరఁగ లెక్కపెట్టుము దినంబుల్ గొన్నియే సుమ్మికన్ 649

ద్వి. నేవెళ్లి వేవేగ నీనాధు తోడ
నీవార్తఁ దెల్పుచు నేఁ గనియున్న 650

ద్వి. నీగతి వివరించి నీనుడి దెల్పి
వేగమే కొనివత్తు వీరరాఘవుని 651

ద్వి. అనతికాలము లోననని గన నీవు
జనకజా యోర్మిమై మననగు సుమ్మి 652

ద్వి. అనుచు వాయుజుఁడాడ జనకాత్మజాత
హనుమంతుఁ గని పల్కె నానంద గఁరిమ 653

## హనుమవెడల-సీత-అనుమతి

ఉ. రాముఁడు గుర్తుఁబట్టఁగలఁ రాక్షస వాయసగాధఁ జెప్పి, చూ
డామణి నిచ్చితిన్ గుఱుతులన్ ద్వయముంగని విశ్వసించుఁ గా
దా మఱియొండు గుర్తు హనుమా! యిడుదాన, గ్రహింప దెల్పునా
రామునకీవు, భూధవ లలాముఁడు తోషనె సంతసించెడిన్ 654

తే. మున్ను నెమ్మోమునం గల బొట్టు చెదర
మణిశిలను బూని యమర్చె బొట్టు

నే రెఱుంగని గుఱుతిద్ది యెఱుకసేయ
నమ్మ. నీమాట లేవిఁను నమ్మ గావు 655

తే.గీ.ఎదురు తెన్నులు జూచును మది సతంబు
రామలక్ష్మణసుగ్రీవ రాజవరుల
నిన్నుఁ దలఁచుచు మీరాక నెన్నుచుండు
వెళ్ళి రమ్మింక శుభమగు వీరహనుమ 656

తే.గీ.సీత మంగళాశీస్సులఁ జిత్తమలర
నామెకుఁ బ్రణామ మొసరించి ధీమహితుడు
కొలఁది దవ్వేగి మైబెంచి తలఁపసాగె
వచ్చియుండిన పనిదీరఁ బ్రమదమొంది 657

ఆశ్వాసాంత పద్యములు

ఆ.వె.శ్రీకరుండవగుచు శ్రీశ నారాయణ
రామమూర్తిగా ధరణి జనించి
మహి నరోత్తమగతి మాయఁజేఁ బూనుచు
శరణమం చనంగ సాకువాడ 658

ద్వి. రామ! యాపన్నివారణ రావదేమి!
వేమారు బిల్చిన వినవేమి దేవ! 695

ద్వి. మహిపుత్రి పీడుట మామాట వినవా!
భూజపై దృష్టిని బూని యున్నావా! 660

ద్వి. రక్షింపఁగా సిఫారసుఁ జేయ నీకు
దక్షుండు వేలేరు దశరథపుత్ర 661

ద్వి. క్షమియింపవే యపచార చయమ్ము
శమియింపఁ జేయుమీ రామయ్యతండ్రి 662

ద్వి. కావుమీరామ నం గావఁగా రమ్మ
కావుమీ యని యేరిఁ గలనైనఁ గోర 663

ద్వి. నిను నమ్మి శరణన్న నీవారిఁ బ్రోవఁ
దీక్ష లేదాకొ్క దీవింప దేవ! 664

ద్వి. యాచించుచున్నాడ నాలింప వేమి!
బ్రోచుట కేవెగా బూనిన వాడ 665

శ్రీ గోవింద రామాయణమున, సుందరరాముడను కావ్యంబున
దర్శనాశ్వాసము సంపూర్ణము

# శ్రీ గో విం ద రా మా య ణ ము

## ఉపదేశాఖ్యానము

కం. శ్రీవర! రామా యనుచున్
భావించెడి భక్తుఁడెట్టి బాముల నున్నన్
బ్రోవఁగఁ దహతహఁబడు భ
క్తావన! భక్తప్రియుండ అవనీజాప్తా 1

## అశోకవనధ్వంసము

ఉ. చక్కని జానకీ పరమసాధ్విని గాంచితి మాటలాడితిన్
రక్కసితేనిఁ జూచితిని రాక్షసకోటిని గాంచినాఁడ స
ద్దిక్కుల లంకఁ గాంచితిని దేజము వీర్యము సాహసంబులం
దెక్కువవార లెవ్వరో కపీశుఁడో! రావణుఁడో! గ్రహింపనౌ 2

చం. అసురుఁడు కాన సామము, మహాధనవంతుఁడు కాన దానమున్
మెసవుచు ద్రాగుచుండుట నమేయబలాధికుఁడౌట భేదమున్
వెస జయియింప దైత్యు నివి వీలగునా! విఫలీకృతంబులౌ
పసగల దండనంబునె యుపాయముగాఁ గొనఁ గార్యసిద్ధియే 3

తే.గీ. కార్యసాధనమునఁ బరాక్రమము కన్న
వేఱుపాయంబుఁ గన, దైత్య వీరవరులఁ
గొందఱను నేనె చంపిన గొడవతీరు
కండ్లు క్రిందకుఁ దిగవె రాక్షసులకంత 4

తే.గీ. ఆజ్ఞగల కార్యమొనరింప నలవి యగునె
దాని కనువగు కార్యముల్ బూనని యెడ
నసలు పని కడ్డులేని కార్యంబు లెల్లఁ
జేయు నపుడు మాత్రము కార్యసిద్ధి గలుగు 5

తే.గీ.సీతఁ గనినాఁడ నంతట సిద్ధి యగునె
కార్యమెల్లయు ( గార్యసంగతము గాఁగ
వివిధకార్యంబు లూను వివేకి యొకఁడె
కార్యసాధకుఁడగుఁ బొందుఁ గర్మఫలము 6

కం. నేనే రావణుని బలముఁ
గానందగు నెంచిచూడఁ గపివరబలమున్
వానరపతికిం దెల్పఁగ
దానవ వానరుల తారతమ్యము తెల్లన్ 7

తే.గీ.అపుడె సుగ్రీవు నాన నే ననుసరించు
వాఁడ నగుదును రణమూనువాఁడ దాన
నెఱుఁగఁగా నగు రావణు నింగితమ్ము
దర్పమును గూడ మఱివేరు దారిలేదు 8

కం. పూనక యుద్ధంబెటుగా
దానవనాథుం డెఱుంగు దైత్యుల శక్తిన్
వానరుఁడనగు నాబలమును
గానన్ యుద్ధంబుఁ బూనఁగావలె నిపుడే 9

ఉ. పోవఁగ నెంతు యుద్ధమును బూనుచు నేనె స్వమంత్రియుక్తుఁడై
సేనలతోడఁ గూడి రణసీమ నెదుర్కొను రావణాసురున్
వాని మనఃప్రవృత్తి నిజబంధుబలంబును సైన్యశక్తినిన్
మానుగ సంగ్రహించిన కపిమాన్యునకుం దెలుపన్
యథార్థమున్ 10

ద్వి. అటుపైన కిష్కింధ కరుగఁగా నెంతు
పటుతరశక్తిమై వరలఁగా జయము 11

చం. కనులకు నెమ్మనంబునకు గాంచ నశోకవనంబు సంతసం
బొనరుచు నందనంబనఁగ నొప్పుగఁ బుష్పలతానికుంజవృ
క్షనికరయుక్తమై, యిది వికావికలై చనునట్లు సేయఁగా
దనుజవరుండు పంపెడిగదా నిజసైన్యము నంతఁ బోరఁగా 12

ఉ. మక్కువఁ బెంచియున్న వన మంతయు ధ్వంసమొనర్చఁ బూనెదన్
గ్రక్కున రావణుం డనుపుఁగా బలమశ్వరథేభయుక్తమున్
స్రుక్కఁగఁ జేయఁగా ననుఁ ద్రిశూలము లాదిగ నాయుధాళితో
నెక్కొన, నంత వారి ననినే దునుమాడి జయంబు నొందనౌ 13

ఉ. కోరిక మీఱ యుద్ధమునకుం దిగనొప్పు నుపాయమేమి ఏ
దారినిఁ ద్రొక్కఁగా వలయు దైత్యబలంబు నశింపఁజేసి నే
పోరి మదీయసత్త్వము సమూలముగా నిక రావణాసురుం
డారయ వాని సైన్యబల మారసి సింధువు దాఁటి పోయెదన్ 14

తే.గీ.అసురనాథుని సొంపగు నతులవనము
దీనిఁ బాడొనరింపఁగ వాని కపుడు
కోప మొదవుట తప్పదు కోపగించి
నన్నుఁబట్టనెంచి నిజసైన్యమును బంపు 15

కం. ఇదియగు దగుపని రావణు
మదిఁని గలంప రణమున మానక వనముం
దుదముట్టించెద నంచని
యెద నెంచుచు మారుతి వని నెల్లయుఁ జెఱపెన్ 16

తే,గీ.చెట్టు చెట్టునఁ దూకుచుఁ గుట్టువీడి
వాని భువిఁగూల్చి వనమెల్లఁ బాడుసేసె
వీరవాయుజుఁ డప్పుడు విచ్చలవిడి
నా యశోకవనంబు లయంబుఁజేసె 17

ఆ.వె.ఎండు కట్టె యగ్ని మండి కూలెడి రీతి
పెఱికి విఱిచి వృక్ష వితతి నెల్ల
సుమచయంబు లతలు సొంపఱి నేలపైఁ
బడినవి హనుమ వనిఁ బడి చెలంగ 18

శా. వృక్షాగ్రంబులనున్న పక్షివితతుల్ భీతిల్లి వేపాఱుచున్
రక్షోనాథు పురీనివాసులు వినన్ రావంబు సల్పెన్ వనీ
రక్షన్ హాయిగ నిద్రఁజెందు మృగవారంబెల్ల వేలేచుచుం
గక్షల్ దాటుచుఁ బర్వులెత్తె రొద నాకంబంటఁగాఁజేయుచున్ 19

తే.గీ. క్రీడలకుఁ గట్టియుండిన గిరియుఁ గూలె
వనవిహారార్థ మలరెడి వనచయంబు
నేలమట్టముగా భువిఁ గూలి పోయెఁ
గొలకులన్నియుఁ జెడిచెడె సలిలమెల్ల 20

ఆ.వె. భగ్నమాయెనుగద ప్రమదావనంబెల్ల
నింపు సొంపు లేక యించు కేని
దహనమైన దాని చందంబుఁ గానుండె
సకలవనము చెడియె వికలమగుచు 21

ఆ.వె. వనముఁ బాడు జేసి ద్వారంబు కడనిల్చెఁ
బ్రళయకాల రుద్రు భంగి హనుమ
మేరు పర్వతమన ధీరుఁడై నిలబడి
చూడ భయముఁ గొల్పు [1]సుందరుండు 22

తే.గీ. జానకీదేవి కాపలా బూని యుండి
యప్పుడే నిద్రఁ గాంచిన యసుర లెల్ల
పక్షిమృగసమూహంబు వేపారు రవము
వినుచు మేల్కాంచి వనియెల్ల విఱుగుట కని 23

రక్కసలు-సీత

ఉ. ద్వారమున స్వయంకరుని వాయుజు వానరుఁ గొండఁబోలు భీ
తారుణనేత్రునిం గనుచు నంతట గుంపులు గాగ నిట్టటుల్
పారిరి భీతచిత్తలయి పర్వునఁ గొందఱు జేని యొద్దకుం
జేరిరి కొందఱంత వెస సీతను డాసిరి ప్రశ్నఁ జేయుచున్ 24

ఉ. ఎవ్వఁడె సీత వీడు కపి యీవని నంతయుఁ బాడుసేసె వీ
డివ్వని నెప్డుసేరె మఱి యేరి నిమిత్తము వచ్చె వానరుం
డెవ్వడు పంపఁగావచ్చె నిను నిచ్చట గాంచుచు మాటలాడెగా
యవ్విధమంతయుం దెలుపుమా భయమేల వచింపు సుందరీ 25

1. సుందరుండు-హనుమంతుఁడు

ద్వి. అనఁగఁ బతివ్రత యవనిజ బలికెఁ
దనకేమి తెలియని దానిగా నపుడు 26

ద్వి. మీమాయ యెల్లయు మీకెగాఁ దెలియు
సామాన్యమొక్కొ రాక్షసమాయ నెఱుఁగ 27

ఆ.వె. పాము పాదములను బామెగా యెఱుఁగును
దైత్యమాయ నెంచ దైత్యులె తగు
నెవఁడొ యీవనచర మెటనుండి వచ్చెనో
యేలవచ్చెఁ జెప్పు డెల్ల మీరె 28

ఉ. ఇచ్చకు వచ్చు రూపము యథేచ్ఛగఁ దాల్చఁ గలట్టి దైత్యుఁడే
వచ్చెను గోతిగాగ యని భావమునం దలపోయుచుంటి నే
నచ్చెరు వొందితిన్ భయము నందితి వానినిఁ జూచి కోతి కొ
మ్మచ్చులఁ జూపి యీవనము నంతయు బాడొనరించినాఁడహో 29

ద్వి. అని సీత పలుకాడ వినుచు రక్కసులు
జనకజ రక్షకై వనివీడి రపుడు 30

## రక్కసులు-రావణునకు-దెలుపుట

కం. కొందఱు తమ రాజును గని
కొందల మందుచు వనంబు గోతి యొకండే
చిందర వందర సేయుచు
నందంబెల్లయుఁ జెరిచె నటంచని రంతన్ 31

కం. తరువుల విఱిచెను లతలను
ధరఁ బడవైచెఁ బొదరిండ్ల ధాత్రింగూల్చెన్
గిరియును గొలఁకులు రూపఱె
పరగంగాఁజేసె వనము వానరు డొండే 32

ఆ.వె. దండి మగఁడు వాఁడు కొండంత మేనితో
దీర్ఘ బాహుయుతుడు తేజు వాఁడు
చెట్టు చేమలన్ని చేతితోఁ బెఱికిన
బలయుతుండు ధైర్యవంతుఁ డతఁడు 33

ఆ.వె.వనముఁ బాడు సేసి ద్వారంబు కడనిల్చె
భీతిఁ గొల్పుచుండి భీకరుండు
కాని వాడు సీత కమలాక్షి యుండిన
చెట్టుఁ దాక లేదు చెఱుప లేదు 34

ఆ.వె.సీత నడుగ నామె చెప్ప దొక్కింతయు
దైత్యమాయ గాగఁ దలఁచితి ననె
సీత కొఱకె వాఁడు చేరె నీపురి సీత
తోడ మాటలాడె వాఁడు రాజ 35

ఆ.వె.శ్రమ యనంగ నెఱుఁగఁ జాలని వాఁడయ్యు
సీత యున్న చెట్టు చెఱుప లేదు
శింశుపాతరువును జేరియుండెను సీత
దాని మాత్రముంచె దానవేంద్ర! 36

ఉ. నీవు హృదిన్ గ్రహించితివి నీరజనేత్రను దానితోడ నే
మో వచియించి యామెనుడి మోదముతో విని పాడుఁ జేయఁగా
నీ వనిఁబూనె నీవు గ్రహియించిన యామెతొ మాటలాడె వీ
డీవిధి రెండు తప్పిదము లేర్పడఁ జేసెను శిక్షకర్హుఁడై 37

ఉ. వీఁడహొ రాముదూతయొ కుబేరుని దూతయొ ఇంద్రు దూతయో
పోఁడిమి గల్గి ధీరుగతిఁ బోరికి సిద్ధముగాగ నుండె నీ
తోడుత వీని వానరుని దొందరగా బరిమార్చి వేయుమీ
చూడ నితండు భీకరుఁడు శూరుఁడుగా గనిపించుచుండెగా 38

కం. అని రక్కెస లాడిన మా
టను విని యుగ్రుండగుచుఁ ఎడయుటేలకొ వీ
నిని వెంటనె చంపించెద
వని విధ్వంసకు విడువను బట్టుచుఁ గొట్టన్ 39

హనుమ కింకరులు

తే.గీ.కోపమున మండిపడుచుండి కోతి యెపుఁడొ
వచ్చి యంతఃపురవనంబుఁ బాడు సేసె

వాని నిగ్రహించుచు రండు వానరుండు
వాఁడనుచుఁ గింకరులను రావణుఁడు పంపె 40

ఉ. కత్తులు శూలముల్ మఱియుఁ గార్ముకముల్ గొని కింకరుల్ హరిన్
మొత్తగ వేగమే చనిరి భూపతి రావణు నాజ్ఞ చొప్పునన్
జిత్తము రామపాదసరసీరుహసన్నిధినుంచి పోరుకై
హత్తిన చిత్తవృత్తి ననిలాత్మజుఁడంతట వారి డీకొనెన్ 41

ఉ. వాలముఁ ద్రిప్పుచున్ హనుమ పట్టున నేలను గొట్టి భూమి గ
గ్గోలయి లంకనెల్లరును ఘోషిలునట్లు భుజంబుఁదట్టి వే
యాలము సల్పఁగా నఱచె నాభటు లెన్మిదివేలమంది యా
భీలముగా బయింబడుచు బిట్టుగఁ గొట్టఁగసాగి రంతటన్ 42

## హనుమంతుడు ప్రకటనము

ఉ. శ్రీమహితుండు భూవిభుఁడు సీతవిభుండు సలక్ష్మణుండునై
రాముఁడు సూర్యఁజుండుఁ గపిరాజు జయించెడివారు మిమ్ము నే
భీమబలుండ నేహనుమ పేరునఁ బర్వెడి వాయుసూనుఁడన్
గాముకులైన రక్కసుల కాలముదీరె నశింత్రు మీరికన్ 43

చం. జయము జయంబు రామునకు సత్యపరాక్రమ వీరమూర్తికిన్
జయము సుమిత్రపుత్రునకు శస్త్రవిదుండగు శౌర్యమూర్తికిన్
జయము ప్లవంగనాథునకు సాహసవర్తికి ధీరమూర్తికిన్
జయము పతివ్రతామణికి సాధ్వికిఁ బూతధరాత్మజాతకున్ 44

మ. హనుమంతుండను రామదాసుఁడసదా; ఆవాయుసూనుండ న
న్నని౯ఁ గెల్వంగ సమర్థులెవ్వరిలలోనన్ లేరుగా రావణు
ల్గనరే మృత్యువు వేయిమందియయినన్ లంకాపురం బిప్పుడే
చను నాశంబయి మీదు కంటియెదుటన్ సర్వంబహో
చూడుడీ 45

తే.గీ.లంక నాశనమై ఘోష సంకులంబు
గాగ సీతమ్మకే నమస్కార మిడుచుఁ
బోయెదఁ గృతార్థతంగని పురుషవరుని
రాముఁ గాననఁగఁ జనువాఁడ నాగమరల 46

తే.గీ.అనుచు భీకరధ్వానంబు హనుమ సలిపి
భయదగంభీరరూపంబుఁ బ్రబలఁ జేసి
రక్తవర్ణుండుగా నిల్చె రాక్షసేంద్రు
కింకరులు చుట్టిముట్టగఁ జంకులేక 47

తే.గీ.తోరణీశ్రిత పరిఘను దోడఁ గొనుచుఁ
జుట్టుముట్టిన కింకర శూరవరుల
వరుసఁ బెట్టుచు భువి గూలఁబడఁగఁ జంపి
హుంకరించుచు గుమ్మంబు నొద్ద నిలిచె 48

తే.గీ.కింకరుల నెల్ల వారలఁ గొంకు లేక
జంపి యుండుట రాక్షస చక్రవర్తి
విని మహోగ్రుఁడై తోడనే వీరవరుఁ బ్ర
హస్తుఁ బుత్రుని బొమ్మనె హనుమఁ బోర 49

## చైత్రప్రాసాద ధ్వంసము

తే.గీ.ఆ ప్రహస్తసుతుఁడు వచ్చు నంతలోన
నెదురుగానున్న గుడి మేడ నెల్ల హనుమ
పాడొనర్చుచు శిఖరంబు పైన నెక్కి
బాలభాస్కరుఁడోయను లీలఁదనరి 50

ద్వి. పోఁకుల గుండెలు క్షోభిల్లు నటుగ
భీకరార్భటిఁ జేసె వినఁగ రక్కసులు 51

ద్వి. గుడి రక్షకులు మూర్ఛఁ గూలిరి యంత
వడివడి పిట్టలు బడినవి నేల 52

ద్వి. అస్త్రవిజ్ఞుఁడు రాముఁ డతుల వీరుండు
శస్త్రకోవిదమూర్తి సౌమిత్రిఁ గూడి 53

ద్వి. రామ లక్షణునుండు ప్లవగాధిపతియు
రామకార్యార్థులై రాఁగల వారు 54

ద్వి. రాక్షసవాసంబు లంక నాశంబు
వీక్షింపఁ గలరింక వేవేగ వినుఁడు 55

ద్వి. హనుమంతుఁడనువాడ ననిలాత్మజుండఁ
గన వచ్చినాఁ సీతను రాముసతిని 56

ద్వి. రామ దాసుండ నీలంకాపురంబుఁ
హోమమొనర్చెద రామార్పణముగ 57

ద్వి. మహీసుతకంత నమస్కారమిడుచు
నహివైరి చందాన నరుగఁగాఁ గలను 58

ద్వి. రారావణుల్ వేయి రణరంగ మందుఁ
బోరాడ దునిమెడి వీరుండ నేను 59

ఆ.వె.అనుచు బొబ్బవెట్ట నాసురులందఱు
వినఁగ గుడిని గాయు వీరభటులు
నూరు మంది వచ్చి పోరాడసాగిరి
చుట్టుముట్టిరి కపి సుడి విధాన 60

ద్వి. వివిధాయుధంబుల వేవేగఁ బోర
రవిశిష్యుఁ దాఁకిరి రాక్షసభటులు 61

ద్వి. స్వర్ణ పరిష్కృత స్తంభంబుఁ బెఱికి
పూర్ణాహుతిగఁజేసె బొలుపగు మేట 62

ద్వి. గిరగిర ధ్వజమును గెరలుచుఁ ద్రిప్పఁ
బరగెను నిప్పందుఁ బ్రజ్వలించుచును 63

ఆ.వె.భటశతంబు మడిసెఁ బ్రాసాదమంతయు
గాల్చి వేసె దుమ్ము గాఁగ నగ్ని
అంతఁ జేరి హనుమ యంతరిక్షమునఁ
బలికె, లంకనెల్ల వారు వినఁగ 64

ఉ. వేనకు వేలుగాఁ బ్లవగవీరులు నన్నునిమించువార లీ
జానకి జాడఁ దీయ నలు చక్కియలం దిరుగాడుచుండి రా
వానరకోటియందుఁ గల వారు సహస్రమదేభతుల్యులే
మీ నగరంబు నిల్వదుసుమీ యెకిమీడును మీరు చావరే 65

ఉ. వేవురు రావణాసురులు వేయి విధంబులఁ బోరు సల్పినం
జావకయుండఁజాలరు నిశాచరులెల్లరుఁ జచ్చువారు సు
గ్రీవుఁడు సేరు సైన్యయుతిఁ జేరుచు లంకకు గోళ్ళఁ గోరలన్
మీ విభు మిమ్ము జంపెద రమేయబలుల్ ప్లవగేశసైనికుల్ 66

ఉ. వైరముఁ బూనినారు రఘువర్యుఁడు రామునితోడ మీర లా
వీరుఁడు నర్కసూనుఁగొని వేకపిసైన్యము తోడ లంకకుం
జేరెడివాఁడు రావణుని జీల్చుచు లంక దహించు మిమ్ముఁ బో
కారుచు దైత్యనాథునికఁ గానరు గానరు లంక దైత్యులన్ 67

జంబుమాలి రాక

ద్వి. అని లంకఁ బౌరులు వినునటు పలికి
హనుమ యథారీతి నచ్చట నిలిచె 68

తే.గీ.రక్తమాల్యాంబరంబుల రక్తుఁడగుచుఁ
గుండలంబుల ధరియించి మండి పడుచు
గాడిదలు లాగు రథమునఁ గ్రాలుచుండి
విల్లుఁ గొని జంబుమాలి వేవేగ వచ్చె 69

తే.గీ.ఒక్కపెట్టున గర్జించి దిక్కు లదరఁ
బిడుగు పడినట్లు హనుమపైఁ బడియె వాడు

భూమి నింగి దద్దరిలంగ బోయనంగ
రివ్వు రివ్వున నారి సారించె వాఁడు 70

చం. ధనువునఁ దూపుఁ గూర్చి తన దర్పముఁ జూపుచు హుంక రించుచున్
హనుమనుగాంచి వీడ శర మాపవనాత్మజుఁ మోము గ్రుచ్చ నిం
డెను రుధిరంబు దాని గని తీవ్రగతిం గుపితుండు గాగఁ బ్ర
క్కనఁగల రాతిబండ వడిగా విసరెం గపి దైత్యు మేనిపై 71

ఆ.వె. దారిలోనఁ గొట్టె దైత్యుఁడా రాతిని
ముక్క ముక్క లౌచు భూమిఁ బడఁగ
తూపు వెంటఁ దూపు దొందరగా వీడి
యసురుఁ డంతఁ గొట్టె హనుమ నొవ్వ 72

తే.గీ. వెంటనే తాళవృక్షంబు పెఱికి హనుమ
గిరగిరగఁ ద్రిప్పి, త్రిప్పి విసర నసురుఁడు
దానిఁ దునియలుగాఁ జేసి దారియందె
కడువడిగ తీవ్రశరములఁ గపినిఁ గొట్టె 73

ఆ.వె. అర్ధచంద్రుఁ బగిది నాకారమగు దాని
ముఖముమీదఁ జెవిని బోలు దాని
శిరముపైన నినుము శరముల పది
బాహుయుగ్మమందుఁ బడఁగ వైచె 74

ఆ.వె. శుభదర క్తవర్ణ సుందరవదనంబు
శరము దగిలి మిగుల నరుణమయ్యె
వికసితాబ్జ మనఁగ వెలసె రుధిరమంత
గారి హరిముఖంబు కాంతి మీఱి 75

చం. వడివడి జంబుమాలి బహు బాణములన్ హరినొవ్వఁ గొట్టగాఁ
దడయక ద్వారమందుగల దారుణమౌ పరిఘన్ గ్రహించివేఁ

గడుఁగడుఁ ద్రిప్పి దైత్యుని ముఖంబుపయిన్ విసరంగ నంతదై
త్యుఁడు ముఖమెల్ల వ్రయ్యలయి తూలెను నేలకు వీడి
ప్రాణముల్ 76

ఉ. లే డిక జంబుమాలి యట లేదు రథంబును లేవు గాడిదల్
వాఁడు రథంబు గాడిదలు వయ్యలుగాఁ జెడి రూపముల్ భువిం
దోడనె కూలె నాయినుప దూలము తాకున జంబుమాలినిన్
బూడిదపాలుజేసెఁ గపిపుంగవుఁ డెంతయు హృష్టచిత్తుఁడై 77

తే.గీ. కాళ్లు చేతులుఁ దలయును గాడిదలును
విల్లు శరములు రథమునే వేనిగాని
యచట గోచరింపవు చూర్ణ మగుచు మట్టిఁ
గలిసె నన్నియుఁ బరిఘసంఘాతవశత 78

## మంత్రి పుత్రులరాక

చం. అరుణములైన గన్నుఁ గవ నగ్నికణంబులు రాల్చి కోఁతితోఁ
డ రణమొనర్పఁ జాలకఁ బడన్భువి వీరుఁడు జంబు మాలియాఁ
సురపతి ఖేదమొంది హృదిక్షోభిల న్యూనత నెంచి వెంటనే
పరుగునఁ బొందు పొందనుచుఁ బంపెను వీరుల మంత్రి
పుత్రులన్ 79

ఉ. రావణునాజ్ఞ మంత్రిసుతు లంతట నేడ్వురు సైన్యయుక్తులై
త్రోవనుబట్టినార లనిలోఁబడ మేలురథంబులెక్కి ఆ
కావరులైనవారు తురగంబు లిభంబుల తోడ నస్త్రసం
సేవితులై ధనుర్ధర విశిష్టులుగాఁ గనినారు మారుతిన్ 80

ఉ. తల్లులు దండ్రులున్ సుతులు దారలు బంధువులుం బురీజనం
బెల్లరు కింకరుల్ మడియరే మడిసెంగద జంబుమాలి వీ
రల్ల మహాకపి న్గెలుతురా యనిపల్కుచు భీతచిత్తులై
చల్లగరండు మీరనుచు సారెకు సారెకుఁ బల్కిరంతటన్ 81

ద్వి. నేనె పోయెద ముందు నేఁబోవువాడ
నేనె జయించెద వానరు నిపుడె 82

ద్వి. అను ప్రగల్భంబుల నాడుచు వార
లనిఁ బూన సిద్ధు నాహనుమంతుఁ గనిరి 83

ద్వి. పాడుఁజేసిన వన ద్వారంబు చెంత
వీడక నిలిచిన వీరునిం గనుచు 84

ఆ.వె. వర్షఋతువు నందు వర్షించు మేఘాళి
కొండఁ గప్పురీతి దండిగాగ
హనుమ జుట్టుముట్టె నాసురసైన్యంబు
తూపు వానముంచె నేపు మీఱి 85

ఆ.వె. బాణ వర్షమంతఁ బాటించి మారుతి
వైరిబలము గుఱుతు వట్టకుండఁ
గొండ కెగిరి మేఘమండలమును జేరి
బాణవితతి బారిఁ బడక యుండి 86

ఉ. కొందఱఁ గాలిగోళ్ళ మఱి కొందఱఁ జేతులగోళ్ళ చంపుచుం
గొందఱఁ దోకతో దునిమె కొందఱ బాహువు లన్విదల్చుచుం
గొందఱ నెత్తిమోది యిక గొందఱ నెత్తుల గాళ్ళ మోపి వా
రిందఱఁ జంపె వేగ రుధిరంబొక వాహినిగాగఁ బాఱగన్ 87

కం. ఏనుగులును గుఱ్ఱములును
పీనుగ పెంటలు ధ్వజములు విఱిగెన్ రథముల్
గానఁగరా వెట నెల్ల శ్మ
శానముగా మాఱె దైత్య సైన్యము మడిసెన్ 88

కం. అందఱుఁ జచ్చుటఁ గనుచుం
గొందఱు పరుగెత్తసనిరి కొందలపడి, సం
క్రందన వైరిని గని యా
క్రందనమునఁ జెప్పెనారు కనపెనభంగిన్ 89

ద్వి. సచివసుతుల దైత్య సైన్యంబుఁ జంపి
ఖచితంబుగాఁ దోఁట కడనుండె హనుమ 90

ఐదుగురు సైన్యాధిపతుల రాక

ద్వి. సచివ తనూజుల చావును వినుచు
వచియింపంలేఁదు లో భయమెల్లఁ బైకి 91

ద్వి. భయవికారంబులు పైపైకి నుబుక
రయమున లోఁబట్టి రాకుండ వెలికి 92

తే.గీ. ప్రఘసు, యూపాక్షు దుర్ధరు భాసకర్ణు
నావిరూపాక్షు సైన్యనాయకులఁ బిలిచి
వానరుని నిగ్రహింపంగ వలయు ననుచు
నాన నిడె రావణుండంత నరుగ వారు 93

ఉ. ఆతఁడు వానరుండన మ దాత్మ కొకింతయుఁ దోచకుండె గా
నాతఁడొనర్చు కార్యముల నాత్మఁ దలంచిన వాడు గొప్పదౌ
భూతముగాగఁ దోచు సురపుంగవుఁ డీతని సృష్టిసేసెనా?
పూతమహాతపస్యుగొని పొక్కఁగఁ జేయఁగ నాసురావళిన్ 94

తే.గీ. మును జయించితి సురలాది మునుల నెల్ల
తారు మాఱుగఁ జేయు నపకృతియె యిది
వానరుఁడు గాఁడు రాక్షస ప్రతతి నెల్లఁ
జంపఁ బంపిన యొక మహా శక్తి వాఁడు 95

మ. మును సుగ్రీవుని జాంబవంతు ద్వివిదున్ మున్నైన నీలుండు, వా
లిని నేగాంచితి వారలిట్టిగతివారే వాడికిన్ జోడు లే
డనియే లోఁదలపోసియే చనుడు, మీ రవ్వాని నిర్జింతు మం
చని గర్వింపఁగరాదు పట్టుకొని తెం డా వానరు న్బల్మిమై 96

ఉ. ఈతనివంటి వారు కల రే కపులందు మహాబలాన్వితుం
డీతఁడు తేజమాకృతుల నీతని కీతఁడె సాటి పూన్కితో

సీతనిఁ బట్టఁగావలయు నింద్రుఁడు దేవతలాది మానవ
వ్రాతము నేకమై కదియ వారల గెల్చెడి వారు మీరలే 97

ఉ. కాని జయంబు నిశ్చయము కాదు జయంబునె కోరువాడు మున్
దానె స్వకీయరక్షఁ గొని తాకఁగనౌ నరిపక్షమున్ సుమా
నే ననుదాని మీరు విని నేర్పునఁ బోరొనరింపఁ బూని యా
వానరుఁ బట్టితెండు బలవంతులు మీరలు నేనెఱుంగుదున్ 98

ఆ.వె. తేని యాన వినుచు సేనాధిపతులంత
రథము లెక్కి గజతురంగతతులు
సకల సైన్యవితతి సాగిరా వెనువెంట
నాయుధంబులఁ గొని హనుమఁ గనిరి 99

మ. రవితేజంబున నాయశోకవని ద్వారంబందు ధీరుండు దై
త్యవిరోధింగని దుర్ధరుండు వడి వేయం బంచబాణంబుల
య్యవి యామారుతి నెత్తి దాడితము సేయం దోడనే నింగికిన్
జవమొప్పం జనె వాయుజుం డసురుఁడున్ సంగ్రామ
సంరంభుఁడై 100

తే.గీ. మింటికేగి రథంబున వెంటనంటి
బాణవర్షంబుఁ గురిపించె పావని పయి
నంతకంతకు బెంచుచు హనుమ తనువు
నెంతయో దూరముగ నింగి కేగి నిలిచి 101

తే.గీ. పర్వతముపైఁ బిడుగుపడు భంగి గాగ
దుర్ధరుని తేరుపై వడి దూకునంత
రథముతోఁగూడఁ గూలె దుర్ధరుఁడు నేలఁ
దేరు నష్టాశ్వములు పిప్పి తీరుగాగ 102

తే.గీ. అవిరూపాక్ష యూపాక్షు లంత నంతఁ
గనుచు దుర్ధరు చావును గగనసీమ
కెగిరి యినుప గుదియలచే బగవహించి
హనుమ తొమ్మన మోదఁగ నాతడంత 103

తే.గీ. వేగముగ భూమికిం దిగి పెద్దమద్ది
చెట్టుఁ జేఁబూని వారల, బిట్టుగాగ
గొట్టె వారుచచ్చిరి కపి గట్టిదెబ్బ
నా విరూపాక్ష యూపాక్షు లంతరింపఁ 104

తే.గీ. గనుచు భాసకర్ణుండు ప్రఘసులు హనుమ
పైకి దూకిరి శూలంబు పరిఘ కత్తిఁ
బూని వీరులై పోరాడి పొడిచిరి కపి
రుధిర వాహిని మున్గిన విధము దోప 105

తే.గీ. హనుమ యొడలెల్ల రుధిర మయంబు గాగ
నంత వీరుండు వాయుజుం డతులబలుఁడు
సర్వమృగవృక్షఖగయుత శైలశృంగ
మునుఁ బెకల్చి కొట్టగ వారు జనిరి దివికి. 106

తే.గీ. సైన్యనాయకులందఱు సమసి పోవ
సైన్యమంతయు జంపి నాశమ్ముఁ జేసె
రథ గజ తురంగ భటరాజి రయము తోడ
నొండు మృగము నెత్తివైచుచుమఱి యొండుపైన 107

తే.గీ. సకలవిధ సైన్యమెల్లయు సమయఁ జేసి
ప్రళయకాలాంతకుఁడన ద్వారము కడ
నిలిచె శూరుండు ధీరుఁ డనిలసుతుండు
రామదాసుఁ డలసటయె రానిరీతి 108

## అక్షకుమారుని రాక

మ. తన సైన్యాధిపులేవురున్ మడియ దైత్యాధీశుఁ డత్యుగ్రుఁడై
కనెఁ గయ్యానికిఁ గాలుఁజాచు సుతు వి ఖ్యాతుండు నక్షాఖ్యుఁ డో
డనె గుర్తించుచుఁ దంద్రియానఁ గపి నా లంబందు నిర్జింపఁగాఁ
జనెదిం గాంచన చిత్రకార్ముకముతో సంరంభియై తేరుపై 109

తే.గీ.ఎనిమిది తురంగములచేత నీడ్వ బడుచు
వేల నింగియు నేకమౌ రీలఁ దిరుగు
పసిఁడి చెక్కిఁంబులను గూడి స్వర్ణ దీప్తిఁ
దపనుచే లభ్యమైన రథమ్ము నెక్కి 110

ఆ.వె.అమ్మ పొదులఁ గూడి యష్టాసియుతముగ
సుర లసురులు తేఱి జూడలేని
అవసరమగునన్ని యాయుధంబులు గల
యతులరథము నెక్కి యక్షుఁ డపుడు 111

తే.గీ.శ్రమ దొలంగగఁ దోరణ సన్నిధిఁగల
ప్రళయకాలాంతకుండన ఁబరగువాని
వీరు హనుమంతుఁ గని యెంచి వైరిబలముఁ
దనబలము గౌరవమ్మున ఁ గనెను హరిని 112

ఆ.వె.అశ్వగజరథముల నార్భటులు సెలఁగి
గంటల గణగణలు గ్రాలుచుండ
నక్షుఁడు విడె వేగ నతులబాణంబుల
నెడ మొసంగకుండ ఁదడయకుండ 113

తే.గీ.మూడు తూపులఁ దలఁ గొట్టె మోముఁదనువు
రక్తసిక్తమాయెను వహ్ని రగులనంత
మేరు పర్వతరీతిగఁ మేనుఁబెంచి
హనుమ విహరింపసాగె సైన్యంబునందు 114

తే.గీ.ఇర్వు రాకాశమునకేగి యిల వడంక
ధీరు లొకరికొక్కరు వెను దీయకుండఁ
బోరు సల్పఁగఁ బూనిరి పొక్కె హనుమ
యక్షుఁడు విడుచు తూపు లత్యధిక మగుట 115

తే.గీ.బాలుఁడగు నక్ష విలువిద్యఁ బావని కని
మేలు మేలని లోలోన మెచ్చుకొనుచు

చంపఁదగని వాడీతఁడు చంపనేల
యనుచుఁ గార్యార్థియై చంప హనుమ దలఁచి 116

తే.గీ.గగనతలమందుఁ దనతోడ నెగిరి వచ్చి
రథయుతంబుగ నని మహా రథికుఁడగుచుఁ
బూని నొప్పించు నక్షయుఁ బుడమిఁ ద్రోయు
విధము తలపోసి, తలపోసి వీరహనుమ 117

తే.గీ.తేరులాగెడి యెనిమిది వారుతములఁ
బ్రబలబలుఁ డఱచేతితోఁ బట్టికొట్ట
నవియు జచ్చిపడియెభూమి నంత రథము
ముక్కముక్కలై కూలెను బుడమిపైన 118

తే.గీ.రథము గూలిన యక్షుఁడు రణము వీడి
పారిపోవఁడు రోషించి పావనిపయి
పర్వతంబును గురిసెడు వాన వోలె
బాణవర్షంబుఁ గురిపించె వాయుజాద్రి 119

తే.గీ.ఇతని విడువఁగరాదని యెంచి హనుమ
అక్షుని పదంబులనుబట్టి యతని నెత్తి
పట్టి తలక్రిందులుగ ద్రిప్పి తుట్టతుదకుఁ
బ్రాణములఁదీసి ముద్దగావైచెఁ బుడమి 120

తే.గీ.ఆ గరుత్మంతుఁడేవిధి నహిని బట్టి
చంపు నావిధి నక్షుని జంపె హనుమ
సురలు మునులును లోకంబు చోద్యమంద
దైత్యపతి గుండె ఝల్లని దద్దరిలఁగ 121

ద్వి. మడియంగ యక్షుఁడు మారుతి మఱల
వడినేగి ద్వారంబు కడ నిల్చియుండె 122

ఉ. బాలుఁడు బాహువీర్యబలవంతుఁడు శస్త్రవిశారదుండునుం
గాలముఁజేసెనంచు విని కార్ముకవీరుని బుత్రునెంచిఁ లో

జాలఁగ గుండె తావెలికిఁ జాటకు లోఁగలభీతిఁ గోతితో
నాలమొనర్చి సైన్యపతు లందఱు మంత్రిసుతుల్ గతించుటన్ 123

సీ. వానరచేష్టయే వని (బాడుసేయుట
యని కింకరులఁ బంపె నతనిఁబట్ట
కింకరావళి చావఁగొంకక ద్వంద్వ యు
ద్ధసమర్థు బ్రహస్త తనయుఁ బంపె
చావఁగ నాతండు సచివాత్మజుల విలుఁ
బూను దిట్టల ననిఁ బూనఁ బనిచె
కార్మికవీరులు కడతేర ననిసల్పు
సైన్యాధిపులఁ బంపె సాహసికుల
సైన్యాధిపులు చావ శస్త్రచాపంబులఁ
బోరాడు బలవంతుఁ బుత్రుఁబంపె

తే.గీ. శస్త్రచాపయుద్ధముల ప్రసక్తి వీడి
యవియు నిష్ప్రయోజనమని యాత్మఁ దలఁచి
అస్త్రవేత్త యొకండె ఆ హరిని బట్ట
నెఱుఁగునని రావణుఁడు పంపె నింద్రజిత్తు 124

ఇంద్రజిత్తు రాక

ఉ. వచ్చిరి కింకరుల్ మడిసె సాహసవంతుఁడు జంబుమాలియున్
జచ్చిరి మంత్రిసూనులును జచ్చిరిగా దళవాయి లేవురున్
జచ్చెను నక్షుఁడున్ సకల సైన్యము నాశనమాయె నేమనన్
వచ్చును గోఁతినొక్కరుని బట్టఁగఁ జాలరు యోధులెల్లరున్ 125

తే.గీ. రామదాసుఁడట! యొకఁడె, భూమి మీద
గగనమున సంచరించు శాఖామృగంబు
చంపె మన యోధులను బహు సైనికులను
బట్టి నలవిగాకుండె వేపట్టు మతని 126

ఉ. నీవె మహాబలుండవును నీవె మహాస్త్రవిశారదుండవున్
నీవె భయంకరుండవును నింగిని నేల సురాసురాళికిన్
నీవెగదా సురేశుని జయించిన వాడవు బెక్కుమార్లు ము
న్నీవు తపంబు సల్ప విధి నీకొసగెంగద మెచ్చి యస్త్రముల్ 127

ఉ. బాహుపరాక్రమంబున విఘాసురదివ్యతపస్సువల్ల నీ
దేహము రక్షితంబెపుడు దేశముఁ గాలము గుర్తెఱుంగుచున్
సాహసమూని కార్యముల సర్వసమర్థతఁ జేయుదీవు నీ
వాహవమందు న్జయము నందుచుఁ గోఁతిని దెమ్ము పుత్రకా 128

తే.గీ. యత్నమున నని నీ కశక్యంబు లేదు
తగిన యోజన నీ కసాధ్యంబు గాదు
అస్త్రబాహుబలముల నిన్నరయకుండ
మూఁడు లోకంబులందున లేఁడెవండు 129

ద్వి. అని సేయువేళ నేనిను నెంచి మదిని
కనువాఁడ ధైర్యంబుఁ గదనరంగమున 130

కం. నీతో సరి యెవ్వారలు?
చేతోమోదంబుఁగల్గఁ జేయఁగ నాకున్
వాతాత్మజునిం బట్టుము
నాతో సరియైనవాఁడ నాప్రియపుత్రా! 131

ఉ. మానక రాక్షసాళి కవమానముగూర్చుచున్నవాఁడహో
సైనికవారమందు వెస స్వైరవిహారము చేయుచుండి యా
వానరుఁడొక్కఁడుండె భటవర్గముఁ జంపెను గుంపుగుంపుగా
వానిని బట్ట వ్యర్థములు ద్వంద్వరణమ్మును శస్త్రబాణముల్ 132

ఆ.వె. అస్త్రవిదుఁడ! యుక్తి నతనిఁ బట్టుము నీవ
ఆయుధంబులేక హస్తయుగళి
భూ నభస్సులందుఁ బోరాడఁ గలవాఁడు
వాయువేగగామి వాఁడు సుమ్మి 133

ఆ.వె.పని యొకింతకాదు వజ్రాయుధంబున
సైన్యతతిఁ గొనఁ బని చక్క బడదు
అగ్నిహోత్రతుల్యుఁ డాతని పిడికిటఁ
బొడిచి చంపవలను బడదు సుమ్మి 134

తే.గీ.జాగరూకుఁడవై యని సల్పు మీవ
వైరి బలమెంచి నీబల మారసియును
మన చమూతతి మడియక మనెడి యటుగఁ
బోరి జయమొంది రమ్మీవు పోయి రమ్మ 135

ఉ. నానుడి విస్మరింపకుము నాయన! నీదు మహాస్త్రజాలమున్
లోన స్మరించుచుం జనుము లోపము నేమఱుపాటు లేక ఆ
వానరుతోడ డీకొను ముపాయముగాగ నపాయమేమియుం
గానక యుండురీతి జయకాంక్ష మహాస్త్రబలాన్వితుండవై 136

తే.గీ.యుద్ధభూమికి నిన్నంప నుత్తమమొకొ!
కాని రాజవిధినిఁ దీర్పఁ గడఁగ వలయు
రాజనీతి ననుష్ఠించు రాజులకును
క్షత్రియులకును యుక్తంబు క్షాత్రనీతి 137

ఉ. బాలుఁడవీవు నిన్ననికిఁ బంపుట యుత్తమకార్యమేనె కా
జాల దటంచెఱింగియును క్షత్రియధర్మము నెంచి చూచి భూ
పాలకు ధర్మమారసి స్వబాధ్యతనే గమనించి వైరితో
నాలము సేయఁ గోరితి జయంబునె గాంచుము పోయిరా
సుతా! 138

ఆ.వె.అనెడి తండ్రి యానఁ దనయుండు తలఁ దాల్చి
వేగ్రదక్షిణంబు వినతిఁ జేసి
కడలి పొంగు రీతిఁ గడుఁ బొంగి రణమూన
నేగె నింద్రుఁడనఁగ నింద్రజిత్తు 139

తే.గీ.గరుడపక్షి సమాన వేగంబు గలిగి
కఱకు తెల్లని దంష్ట్రిలఁ గ్రాలుచున్న

నాలుగు మదేభములఁ బూన్చి నలిననేత్రుఁ
డింద్రజిత్తు రథము నెక్కి యేగునంత 140

ఉ. దిక్కులు నాల్గునున్ మలిన దీధితులం బ్రసరింపసాగ వే
పక్కిగముల్ రొదన్సలిపి పాఱగసాగ దిశాళికంతఁ దే
రెక్కి గుణధ్వని న్ధనువు నెక్కిడి తారసి లెంగపీంద్రునిన్
జుక్కల వీధినిల్చి కనుచుండిరి వీరలఁ మౌనులున్ సురల్ 141

ఆ.వె.ఇంద్రజిత్తు; హనుమ నెడతెగకుండగ
బాణతతులఁ గొట్టుఁ బవనసుతుఁడు
దాటు వానిగుఱిని దగు స్వల్పరూపంబు
నొకటఁ బెద్ద రూప మొకటఁ దాల్చి 142

ఆ.వె.గగనతలముఁ జేరుఁ గపివరుం డొకయెడ
నొక్కయెడఁ బుడమికి నుఱుకుచుండి
ఇంద్రజిత్తు వేయు నీటెల గుఱినుండి
జారి పోవుచుండెఁ జావకుండ 143

ఆ.వె.విడిచి, విడిచి బాణ వితతులఁ బెక్కింటి
విసివి చంపలేక వీరునంతఁ
జంపు తలఁపు వీడి శాఖామృగంబును
బట్టుకొనఁ దలంచెఁ దుష్టమదకు 144

ఆ.వె.ఇంద్రజిత్తు హనుమ యిర్వురు సములౌట
వేగమందు యుద్ధవిహితకర్మ
ను త్తమగతి నాల మూనిరి హర్షించి
సర్వభూతతతియు సంతసింప 145

ఆ.వె.జయముఁ బొందరెవరు, శక్యంబు గాకుండె
నొకరి నొకరు గెలువ నొప్పదపుడు
వీరవరుఁడు గొప్ప విలుకాడు నయ్యును
ఇంద్రజిత్తు విడె జయించు తలఁపు 146

హనుమంతుఁడు పట్టువడుట

ఆ.వె. పట్టఁ దలఁచి హనుమ బ్రహ్మాస్త్రమును వీడె
ఇంద్రజిత్తు వేగ నేగి యదియ
వానరవరుఁ బట్టి బంధించె, నాతండు
భువినిఁ గూలెఁ జేష్ట పోయియంత 147

చం. గురుఁడగు వాయువుం దలఁచు గూర్మిని, బ్రహ్మవరంబు నెంచి, యి
క్కరణిని బంధనమ్మొకటఁ గల్గెడి నంచనియన్న మాటలో
నరయుఁ భయంబు లేదనుచు నాత్మఁ దలం చనిలుండు బ్రహ్మయున్
సురవిభుఁడుం గృపం దనను జూడఁ గలారని నిశ్చితాత్ముఁడై 148

చం. ఇదియును నొక్కమేలె, దనుజేశుని నొద్దకు నన్నుఁగొంచుబో
వుడురొకొ రాక్షసప్రతతి పో, నసురేశు ముఖాముఖింగనే
యదను లభించు వాని హృదయంబు నెఱుంగగ నేనుమాటలన్
విదితము బమ్మ చెయ్యి విధి వీడునె యంచు విధిప్రయుక్తుఁడై 149

తే.గీ. ఏ యితరమహాస్త్రబలము నించుకేని
హానిఁ గలిగింపలేదను నజుని వరముఁ
దలఁచి, బ్రహ్మాస్త్రమునఁ గొంత తడవు కట్టు
బడుట విధియని యుండె నా బంధనమున 150

ఆ.వె. హనుమ చేష్టలుడిగి యవనిపైఁ బడియుండ
దైత్యతతులు గాంచి చరికిఁ జేరి
నారచీర జనప నారత్రాళ్లను బేని
కట్టి నారలతనిఁ గట్టిగాగ 151

ఆ.వె. తన్నుఁ జేరి త్రాళ్లఁ దనువెల్లఁ గట్టెడి
వారిఁ గాంచి యోర్చె వాయుజుండు

వడిగఁ గొట్టుచుండి పిడికిళ్లఁ బొడుచుచు
బాధఁ బెట్టుచుండఁ బడుచునుండె 152

ఆ.వె.త్రాళ్లఁ గట్టునంత దరలె బ్రహ్మాస్త్రంబు
హనుమవీడి, కాని యరయఁడతఁడు
ఇంద్రజిత్తు మాత్ర మెఱిగి రహస్యంబు
నాత్మ గుందసాగె నతులరీతి 153

చం. వడివడిఁ ద్రాళ్లఁగట్టుటను బావని, బ్రహ్మమహాస్త్రమంతతో
విడివడె నల్పుదగ్గరఁ బ్రవీణతముండు వసింపనట్లుగా
దడయక న స్త్రబంధనము దప్పుట లోఁగని ఇంద్రజిత్తు తా
నొడయుఁ దలంచి భీతిలె మహోద్ధతుఁ డాతనిఁ జూడ
జంకుచున్ 154

తే.గీ.మొదట బ్రహ్మాస్త్రమును వేయ నదియె తప్ప
వేరగు మహాస్త్ర యేదియు వేయరాదు
నిరుపయోగంబె యగు నస్త్ర నిచయమెల్ల
ననుచు నింద్రజిత్తు తలంచె నాత్మయందు 155

## రావణునకు-హనుమ హితోపదేశము

ఆ.వె.కట్టఁబడిన హనుమఁ గొట్టుచు దైత్యులు
లంకరేని సభకు లాగినారు
వీడె వానరుండు వీక్షింపుమీ తండ్రి
యనుచు నింద్రజిత్తు వినిచి సభను 156

ద్వి. కను మదేభమువంటి కపి వీడటంచుఁ
దన తండ్రి కెఱిగించె ధనయుండు వాని 157

ద్వి. అచ్చటంగల రాక్షసావళి యెల్ల
హెచ్చగు కోపంబు రెచ్చగాఁ గనుచు 158

ద్వి. కొట్టుడు దిట్టుడు కోయుడు వీని
కట్టడి తినదగు కపియని రెల్ల 159

చం. అటునిటు లాగి యీడ్చుచును నాసురనాధుని ముందునిల్పి రా
భటులు కపిన్ బ్లవంగుఁడు సభంబరివేష్టితుఁడైన రావణుం
బటుతరదీర్ఘకాయు బలవంతుని దేజుగలట్టి వానిన
చ్చట దశకంఠునిన్ సచివ సంయుతు విస్మితుఁడౌచు
గాంచెడిన్ 160

ఉ. ఆసురరాజు కోపమున నాకపిఁ గాంచుచుఁ దామ్రదృష్టి, సిం
హాసనమందునుండి సభ యందున మంత్రులు శీలవృద్ధులున్
భాసిల వారితోఁ బలికె వానరు గూర్చి సమస్తగాధ, వ్య
త్యాసము లేనిరీతి నరయందగు నంచని వారలంతటన్ 161

చం. ఎవఁడవు నీవుః మాపురికి నే పని వచ్చినవాడ వీవు, ని
న్నెవఁ డిటుపంపినాడు వచియింపు క్రమంబుగనంచు మంత్రులా
డ, వనచరేశుఁ డర్కసుతుఁ డర్కవిభుండిట కంపె నన్ను, దూ
తవలె నిశాచరేశుఁ గని ధర్మము దెల్ప యథార్థరీతిగన్ 162

సీ. మణిరత్నమయమైన మకుటంబుఁ దాల్చిన
నల్లకలువ మోము ప్రల్లందుడు
భుజముల బంగారు భుజకీర్తులను దాల్చు
బాహుబలుండగు ప్రల్లదుండు
వెడద యురమునఁ బసిడి హారమొప్పగ
భాసిల్లు వీరుండుఁ బ్రల్లదుండు
వింజామరులు బూని విసరంగ జవ్వనుల్
వసివాడ కుండిన బ్రల్లదుండు

తే.గీ. మేరుపర్వతశిఖరాన మేఘము వలె
నీలదేహంబుతో నున్న లీల వాఁడు
దశముఖంబులఁ దామ్ర నేత్రముల వాడు
స్వర్ణ సింహాసనస్థిత సచివ యుతుఁడు 163

తే.గీ.దేవతలు నింద్రుఁ గొల్చెడి తీరు దుర్ధ
రుఁడుఁ బ్రహస్తమహాపార్శ్వ లును నికుంభుఁ
డును, నలువురు మంత్రులు సభ లోనఁ గొల్వఁ
బ్రబలకాంతిమయుండగుఁ బ్రల్లదుండు 164

తే.గీ.తన్నుఁ గట్టించి సభ దీర్చి తనదు ముందు
నిల్వఁ బెట్టిన రావణు నీతిహీను
హనుమ గాంచుచు గోపించి యతని మరలఁ
జూచుచుండియు, నేలకో చూడ లేఁడు 165

ఉ. మోహితుఁడౌచు రావణు నమోఘబలంబును ధైర్యకాంతులన్
దేహముఁ గాంచి మారుతి హృదిం దలపోయఁ గడంగె వీఁడహో
దేహిగఁ జాపకార్యముల దేనికిఁ జేయుచు నున్నవాఁడొ? సం
దేహము గల్గుచుండె శివదేవుని గొల్చు వరప్రసాదుఁడే 166

కం. ఔరా! రూపము ధైర్యము
లౌరా! తేజంబు బలము లౌరా! వీఁడే
క్రూరుఁడు గాకుండినచో
వారక సురలోకమెల్లఁ బాలన సేయున్ 167

తే.గీ.లోకకంటకకర్మ విలోలుఁ డితఁడు
సతమధర్మరతుండగు సాహసుండు
దాన వెఱగొందుదురు దేవ దానవులును
భీకరాకారు, రావణు భీతివలన 168

ఆ.వె.అసురరాజుఁ గాంచి యాశ్చర్యమును బొందు
హనుమ జూచి యతని నతని సభను
దైత్యవిభుఁడు గూడఁ దాఁ గ్రోధమున జూచు
ముందు నున్న హనుమ మోము నెత్తి 169

తే.గీ.అతుల తేజోమయుండగు నమిత బలుని
వానరోత్తముఁ గనుచు రాఁవణుఁడు గూడ

లోన దిగులొందు సీతఁడు వానరుండు
గాఁడనుచు నందికేశ్వరుఁగాగఁ దలఁచె 170

తే.గీ.మున్ను కైలాసగిరి నూవు చున్న తఱిని
శాప మిడినట్టి నందికేశ్వరుఁడ వీడు
కాక బాణుండు ప్లవగు సాకార మూని
వచ్చి యుండెనొ! నాయెడఁ బగను బూని 171

తే.గీ.అనుచు లోలోనఁ దలపోసి యా ప్రహస్తు
నడుగఁగా గోరెఁ గపి విషయంబు నెల్ల
నంత మంత్రి ప్రహస్తాఖ్యుఁ డడిగెఁ గపిని
నంతయును సత్యమే యాడు మనుచు 172

ద్వి. భయము లేదు నీకు భద్రంబె యగుత
స్వయముగా వివరింపు సర్వంబు నీవ 173

ఉ. ఎచ్చటి వాడవీవు! కపి విచ్చటకేలకొవచ్చినావు! నీ
యిచ్చమెయిం బ్రమోదవన మేలకొ పాడొనరించినావు నీ
విచ్చట రాక్షసాంగనలకేల భయంబును గొల్పినావు బల్
కచ్చె వహించి పోరుటకు గారణమేమి వచింపు సర్వమున్ 174

చం. అమరవిభుండు పంపెనొకొ! ఆ యలకాధిపుఁడంపినాడొకో
వరుణుఁడు పంపెనా?యముఁడు పంపెన? చారునిగాగ నిన్నుమా
వరపురముం జయింప హరి పంపెనొ దూతగ, దెల్పు సర్వమున్
స్థిరమగు సత్యభాషణము సేయుము వానరరూప వీరుఁడా! 175

ఆ.వె.ఎవరు పంపియున్న నేకీడుఁ జేయము
భయము వీడి నిజముఁ బల్కు తేని
నిన్ను విడిచి పుత్తు మెన్నగా రూపాన
కపివి, తేజమందు ఘనుఁడ వీవు 176

తే.గీ.అనృత మాడిన జీవింప నలవి గాదు
ప్రాణముల నుండఁ జాలవు వానర విను
ఏరుఁ బంపక నీయంత నీవె వచ్చి
యున్నఁ దత్కారణముఁ దెల్పు మొప్పు గాగ 177

ద్వి. అని ప్రహస్తుఁడు పలుకాడిన యంతఁ
గనుచుండి రావణు హనుమయ్య పలికె 178

ఉ. పంపినవారు గారు సుర వర్యుఁడు నాయముఁడుం గుబేరుఁడున్
బంపడు విష్ణుదేవుఁడును బంపఁడు నావరుణుండు, దూతగా
బంపరు నీవు లోఁదలచు వారలు వానర జాతివాఁడ నే
నొంపగు నీయశోకవని నొంపఁజేసితి నిన్నుఁ జూడఁగా 179

తే.గీ.బలము గలవారు నీవారు పగ వహించి
యుద్ధమును బూన వచ్చుట నూరకుండు
టెట్లు! స్వీయసంరక్షణ మేనుఁ బూని
మరల వారలఁ గొట్టితి మహిప వినుము 180

తే.గీ,అస్త్రపాశాళి బంధింప నలవి గాని
వాడ, దేవాసురతతి కెవ్వారి కేని
నిట్టి వరమిచ్చె నాబ్రహ్మయే; నినుఁ గన
బద్ధునిగ నుంటి బ్రహ్మాస్త్ర బంధనమున 181

తే.గీ.అసురవర్గము బంధించు నంత వీడె
నన్ను బ్రహ్మాస్త్రమైనను నిన్నుఁ గనఁగ
బంధితునిగాగ వచ్చితిఁ బ్రభువరుండ
రాజకార్యార్థమొండె నా రాక కతము 182

ఉ. ధీవరు రాఘవోత్తముని దివ్యపరాక్రమరాము దూతగా
రావణరాజ వచ్చితిని గరంబు హితంబు వచింప నీకు సు
గ్రీవుఁడు పంపెఁ దోడువలె గీశవరేశుఁడు క్షేమమంబ నెన్
నీ విటక్షేమమా యనుచు నిన్నడిగెంగద దానవేశ్వరా 183

ఆ.వె.సోదరుండు వోలె సుగ్రీవుఁ డొకమాట
జెప్పు మనియె నీకుఁ జెప్పు వాడ

సకలలోకహితము సందేశ మయ్యది
ధర్మయుతముఁ దెలుపఁ దలఁచినాఁడ 184

తే.గీ.బహుళ రథ గజాశ్వయుతుఁడు బాహుబలుఁడు
కాంతిమంతుండు దశరథ క్ష్మావిభుండు
ధార్మికుఁడు నింద్రతుల్యుఁ డాతని సుతుండు
రాముఁ డనువాఁడు జ్యేష్ఠుండు రాజ వినుము 185

ఉ. రాముఁడు సర్వలోకనుత రాముఁడు సత్యపరాక్రముండునున్
భీమబలుండు తండ్రినుడి వెంబడి తమ్ముఁడు లక్ష్మణుండు సీ
తామణి భార్యయుం జనఁగ దండక వాసము సేయుచుండి యా
భూమిజఁ గోలుపోయి వని పొత్తు నొనర్చెను సూర్య
సూతితో 186

ఉ. జానకినిన్ విదేహసుతఁ జారుతరాంగిని బతివ్రతన్ వనిన్
గానమి ఋష్యమూకగిరిఁ గ్రాలెడి యర్కునినూఁనుఁ గూడె నా
వానరరాజ సోదరుఁడు వాలివధింపఁగఁ గోరె రాఘవుం
డానును సీత జాడఁ గన ధాత్రి సమస్తము రోయ వాకొనెన్ 187

తే.గీ.రాముఁడు ప్రతిజ్ఞమై కపిరాజుఁ జంపి
జేసెఁజేని సుగ్రీవుఁ గిష్కింధ కంత
వాలి నెఱుగుదు వీవు నవ్వాని నొక్క
బాణమునఁ జంపె రాముండు బాహుబలుఁడు 188

తే.గీ.దానికిన్ మాఱు సేతగా ధాత్రి నెల్ల
జానకీదేవి వెదుకంగ వానరులను
బంపె వేలకొలందిగ వారుభూమి
గగన పాతాళముల నామెఁ గాంచఁజనిరి 189

ఆ.వె.నేల దాఁకకుండ నింగిని వేవేగ
వైనతేయుగతిని వాయు గతిని
సంచరించు కపులు చాలమంది కలరు
అందు వాయుసుతుఁడ హనుమ నేను 190

ఆ.వె.జానకిఁ గన నేను శతయోజనమ్ముల
వార్ధిఁ దాటి యిటకు వచ్చినాడ
వెదకి వెదకి సీతఁ దుదకు నీవనమున
రాము భార్యఁ గంటి రావణ!విను 191

ఉ. నీవహ శాస్త్రవిజ్ఞుఁడవు నేర్చిన వాఁడవు ధర్మ రూపమున్
నీవహ పండితుండవు మునీశ్వరుఁ బోలు తపోబలుండవున్
నీవలె బుద్ధిమంతులగు నీతివిదుల్ పరదార నింటిలోఁ
గావలిఁ బెట్టి దాచెదరొ కాఁగల కార్య మపాయమెంచకే 192

ఆ.వె.పూనఁ డెపుడు మూల హానికరంబగు
పనుల సజ్జనుండుఁ బండితుండు
రాము కోపముఁ గని లక్ష్మణుం డలుగుచుఁ
దూపు వీడ నిలువ నోప రెవరు 193

ఉ. రావణుఁడా త్రికాలహిత లక్షణ ధర్మము సెప్పు మంచు సు
గ్రీవుఁడు పల్కినాడు విను కీడొనరించుచు రామమూర్తికిన్
భూవలయంబునం దెవరు పొందఁ గలారలు సౌఖ్యమంచు లో
కావళి లేఁడులేఁడటు సుఖావహుఁడొక్కఁడు గాన నెంచుమీ 194

తే.గీ.మేలు కలిగించు నీకుఁ ద్రికాలములను
బరమ ధర్మంబుఁ బురుషార్థ కరము నగును
రామ నరదేవునకు సమర్పణము సేయు
మవనిపుత్రిక దేవి సీతమ్మ నింక 195

ఉ. ఈయమఁ జూడఁగా సులభమే యతిదుర్లభమైన యీసతిన్
ధ్యేయను సీతఁ జూచితి నిదే కడు సంతసమాయెగా నికం
జేయఁ గలట్టి కార్యమును జేసెడి వాఁడు రఘూద్వహుండె నే
నాయన యానతింగన సుమా యొనరింపఁగ
శేషకార్యమున్ 196

ఆ.వె.తెలియదాయె యయిదు తలలున్న పామును
బట్టి యుంట నీకుఁ బరమదుఃఖి

త యగు సీతఁ గంటి దైత్యులు సురలేక
మైనఁ జిక్కఁబోదు జానకిసుమ! 197

చం. తపమొనరించి పొందితి మహాయువు దానిని బాడు సేతువే
యిపుడది గర్వహేతువె సుమీ సురదానవులేరుచంపఁ బో
రెపుడుఁ గపీశ్వరుం డసురుఁ డీసురకోటికి గూడఁ జెందఁడే
కపులవిభుండు నీమరణ కారకుఁడౌట నిషేధమెట్లగున్ 198

ఉ. కాఁడసురుండు దేవతయుఁ గాఁడలపన్నగ యక్షకోటిలో
వాఁడును గాడు దాశరథి వాడు నిను న్దునుమాడకుండ నె
వ్వాఁడు వరంబు నీకిడిన వాఁడొకరుండును లేఁడవధ్యతన్
వీడుము వానరేశ్వరుఁడు వీరుఁడు రాముని మిత్రుఁడౌటచే 199

ఉ. ధర్మ మధర్మముం గలిసి దాన నొకండు మరొండు దానిచే
గర్మ తెఱంగునన్ లయము గాంచు నటంచుఁ దలంపరాదుగా
ధర్మఫలంబు నొందుచు నధర్మ ఫలంబును బొందఁగా వలెన్
మర్మము లేదు కర్మఫల మా యనుభుక్తి రాక తప్పునే 200

తే.గీ. తపము పెంపునఁ బొందిన ధర్మఫలము
ప్రాప్తిగా నీవు సుఖములఁ బడసి నావు
కొంత నీ యధర్మగతిని గూలి పోయె
ధర్మఫలమెల్ల నిశ్శేష కర్మ మాయె 201

తే.గీ. రాము పత్నిని హరియింపఁ బ్రాప్తమైన
నీ యధర్మఫలంబెగా నిలిచి యుండె
ఇద్ది లయమొందు ధర్మంబదేమి లేదు
పాపఫల మింకఁ బొందవే త్వరిత గతిని 202

ఉ. కానవె నీవు రాఘవుఁ డొకండె వధించె నటంచు నా జన
స్థాన నివాసులై మను నిశాచరకోటిని నొక్క తూపునన్
వానరరాజుఁ జంపుటయు వాలి సహోదరుఁ డర్కసూనుఁడున్
బూనిక రాముతోడ ననిఁ బూను నటంచు హితం
బెఱుంగుమీ 203

ద్వి. వాజి కుంజర రథ వారంబు తోడ
నాజి నేలంక లయంబుగాఁ జేతు 204

ద్వి. కాని యద్దాని రాఘవుఁ డియ్యకొనఁడు
తానె స్వయముగ శాత్రవులను జంప 205

ద్వి. పూనె ప్రతిజ్ఞను వానరకోటి
వీనుల విని హర్ష మూనెడి యటుగ 206

మ. అపచారంబొనరించి రామునకు నాకాధీశ్వరుం డేనియుం
దపమున్ సల్పినఁ గూడ సౌఖ్యమును బొందంజాలఁడో రాజ నీ
విపుడే సీతను దెచ్చిదాచితివొ యామే మృత్యువై వచ్చె నీ
దుపురిన్ నిన్నును గాళరాత్రివలెనే దుమ్మై జనంజేయదే 207

తే.గీ.జానకీ రూప కాల పాశంబు నీవె
మెడకుఁ దగిలించుకొందువాః విడువ దగదె
బుద్ధిమంతుఁడ వీవ స్వబుద్ధి నెంచి
మంచి చెడ్డల నీదు క్షేమంబుఁ గనుము 208

ఆ.వె.సీత వహ్ని లంకఁ జెఱిపెగా నిప్పుడె
రామబాణవితతి రాలి పోవు
మూల మట్టమగుచు భూమిలోఁ గలియదే
కోట బురుజులన్ని కూలి పోయి 209

ఉ. రావణ! భార్యలన్ సచివులన్ హితులన్ సిరి బంధుకోటినిం
బోవఁగఁ జేయు కార్యమును బూనకు దూతను రామదాసుఁడన్
నే వచియింపఁ జెల్లునని నీ హితమే పలుకాడినాడ నా
భూవరు శక్తియుం దెలిపి పోదగు నంచని తెల్పుచుంటిఁగా 210

శా. లోకాతీతుఁడు సర్వలోకచయ నిర్మూలంబుఁగావించుచున్
వీకన్ సృష్టి నొనర్పఁగాఁ గలుగు నా విష్ణుండనన్ వీరుఁడై
నాకంబందున నబ్ధియందు భువి గానన్ లేడుగా జీవులం
దేకాలంబున రాము నాజి సరియౌ యెవ్వాఁడునున్ రావణా! 211

తే.గీ.సర్వ లోకేశ్వరున కీవు సల్పి తిట్టి
యపకృతిఁ బ్రతుకఁగాఁ జాల వరయ నీవు
నిన్ను రక్షింప నెవ్వారు నిలువ లేరు
రాము నెదిరించి యుండగా రావణ! విను 212

తే.గీ.అజుఁడుఁ జతురాననుండు స్వయంభువుండు
హరుఁడు ముక్కంటి త్రిపురాసురాంతకుండు
నింద్రుఁడు సురవిభుండును నీత్రిమూర్తు
లేకమైగూడ రక్షింప లేరు నిన్ను 213

తే.గీ.రామసాయక వధ్యుఁడు రక్షితుండు
గాడు, రక్షింపఁ జాలఁ డెవ్వాడుఁ గాని
వాన రేశుని బల్కుల దాసవేశ
యాడితిని మంచి చెడుగుల నరయు మీవ 214

ద్వి. అను హితవాక్యంబు హనుమంతుఁ డాడ
విని కోపముం గని కను లెఱ్ఱం జేసి 215

ద్వి. హనుమంతుఁ జంపఁగా నాజ్ఞ గావించె
దనుజేశుఁ డప్రియంబును వినలేక 216

విభీషణుఁడు-హితోపదేశము

ఉ. శ్రీయుతరాజ్యవైభవముచే నలరారుచు రాజధర్మముం
బాయుదువే! వధింపఁ దగు వాడొకొ దూత యతండు సెప్పె నా
ప్యాయముగాగఁ జెప్పుమని యాతనిఁ బంపిన వాని మాటలన్
న్యాయము ధర్మము న్విడి వనాటము దూతను జంపుదే ప్రభూ 217

తే.గీ.బహుళశాస్త్రార్థ పండిత వరుఁడ వయ్యు
ధర్మము, నధర్మమెఱిగిన ధార్మికుండ
వయ్యు నరిభయంకరమూర్తి వయ్యు నీవ
దోర్బలుఁడవయ్యుఁ జంపెదో దూత రాజ? 218

తే.గీ.రోష భీషణ బుద్ధిని ద్రోసిపుచ్చి
సుప్రసన్నుఁడవై ధర్మ సూక్తి వినుము
చంపినా డీతఁడరి వలె సైన్యతతుల
దాన దోషియె శిక్షింపఁ దగినవాడు 219

తే.గీ.లోక విధమెంచి నీకీర్తి లోఁ దలంచి
శిక్ష విధియింపఁ దగుఁ గాని కక్షఁ బూని
వధ్యుఁ డనగరా దద్దానఁ బడయఁగలుగు
కార్యసాఫల్య మేముండె గణన సేయ 220

ఉ. వీరుఁడ వౌచు నాజి నరి వీరులఁ ద్రుంచెడి సావకాశముం
బోరును బోవు కోతి యసువుల్ విడనాడగ వీని రాకకుం
గారకులైన శాత్రవులఁ గాసిలఁ జేయుటయెట్లు? వీడె య
వ్వారల వెంటఁ బెట్టుకొని వారిధిఁ దాటుచు రావలెం గదా! 221

తే.గీ.మూలమౌ ప్రయోజనమెల్ల బుగ్గిఁ గలియు
వీనిఁ జంపినఁ గీర్తికి హాని కలుగుఁ
గాని నేరమొనర్చుటఁ గఠినశిక్ష
కర్హుఁడగు దాన శాస్త్రార్థ మరయ దగును 222

తే.గీ.శాస్త్రిముల నభ్యసించిన శ్రమయె మిగులు
వీనిఁ జంప ధర్మార్థంబు విడిచి వుచ్చి
యైహికాముష్మిక సుఖంబు లరసి నిర్ణ
యింపు కర్తవ్య మిప్పుడె యింగితమున 223

చం. ఇటులొనరించు దూత కిపుఁడెయ్యది శిక్ష విధింప నర్హమో
యటులగు శిక్ష వేయఁదగుఁ నాతని నంగవిహీను గాగఁ జే
యుటయుఁ [1]కశాభిఘాతమును నొక్కెడ ముద్రయు ముండనంబు నొ
క్కటి దగ నంచుఁ బెద్దలనఁగా వినమో విధియింపు దేనినేన్ 224

1. కశ = కొరడా

ఉ. ఓడిరి మున్ను నీవలన యోధులు దేవతలాది రాజులే
ఓడరె రామలక్ష్మణు లయోధ్యకు రాజులు దండకాటవిం
జూడఁగ వారలం బనుపు శూరుల రాక్షసవీరులన్ వెసన్
జాడలఁ దీసి నిగ్రహము సల్పఁగ వారల రాక్షసేశ్వరా 225

కం. చెప్పితి నీహిత మెంచుచు
నొప్పో తప్పో గ్రహించి యొనరుప దగు నీ
విప్పుడు కోతికి దండన
మొప్పగ విధియింపు ధర్మ మొప్పెడి రీతిన్ 226

ఆ.వె.అని విభీషణార్యుఁ డాధర్మవిజ్ఞుండు
సభను బలుక నన్న సర్వము విని
చలితహృదయుఁడంతఁ దలను బంకించుచు
గోపము విడి హృదిని గూడదీసి 227

తే.గీ.వానరుఁడె విష్ణు తేజాన వరలు వీఁడు
ధర్మగతి మీరి వధియింపఁ దగదు కాని
వీడఁగారాదు శిక్షను వేయకుండ
ననుచు మది నెంచి దైత్య కులాధిపుండు 228

తే.గీ.సోదరుఁడు విభీషణుఁడు విశుద్ధధర్మ
గతిని బలుకాడె వికలాంగుఁ గాగఁ దోక
తెగిన కోతిగఁ నొనరింపఁ దగును వీని
ననుచుఁ దోఁక దహింపంగ నాజ్ఞ నిడెను 229

తే.గీ.తోఁక దహియించుచుం గపి తోడ నుండి
వీథివీథులఁ ద్రిప్పుడు వీని మీరు
తోటి కపితతిఁ గూడుచుఁ దోక లేక
సిగ్గుఁ బడి వంతఁ గుందంగఁ జేయు డితని 230

హనుమ-తలంపు

ఉ. పట్టిరి దైత్యులంతఁ గపిఁ బట్టల దెచ్చిరి తోకచుట్టునుం
జుట్టిరి నూనెఁ బోసి సభ చూచుచునుండగ నగ్నిహోత్రముం

బెట్టిరి మంటలుంబొగయు బిట్టుగఁ బై కెగయంగ వీథులం
గొట్టుచుఁ ద్రిప్పసాగి రతి కోపమునం బురవీథులన్నియున్ 231

ద్వి. వడివడి మండెడి వాలంబు తోడఁ
దటతడఁ గొట్టెను దైత్యుల నంత 232

ఆ.వె.తన్ను బట్టి తోక దగులబెట్టగ నున్న
నసురులఁ గని హనుమ యాత్మ దల చె
రాత్రివేళఁ గంటి లంక నే నిప్పుడు
పగటియందు గాంచ వచ్చును గద 233

ఆ.వె.వీథివీథియందు విస్తారముగఁ ద్రిప్ప
సూర్యరశ్మియందుఁ జూడ వచ్చు
లంక లక్షణంబు రక్షించు విధమెల్లఁ
బరిగణింపవచ్చు తిరిగి తిరిగి 234

ఉ. రామసురక్షితుండ రఘురాముని కార్యము సేయువాఁ డ నా
కేమిభయంబు వహ్ని దహియింపగఁ జాలదు దైత్యబంధనం
బీమెయినే విదల్చుకొని యీ దనుజావళి నెల్ల జంప నే
నే మతిచాలు రాఘవుఁడు నేనటుసేయఁగ నిచ్చగించునా? 235

ఉ. తా నొకరుండె రావణుని దైత్యులనెల్లరఁ జంపు దీక్ష లోఁ
బూనినవాఁడు రామనరపుంగవుఁ డాయన కార్యదీక్షకున్
హాని నొనర్పఁ జాల నసురావళిచే నవమానమొందుచున్
దీని సహింపనెంచెద యథేచ్ఛను బాధలఁ బెట్ట రక్కసుల్ 236

ఆ.వె.తన్నుఁ బట్టి తోకఁ దగులబెట్టుచుఁ ద్రిప్ప
నసురగణము వెంట హనుమ వెడలు
శంఖ మూది భేరి శబ్దంబు ఘోషిల్ల
హనుమఁ ద్రిప్పుచుండి రసురగణము 237

తే.గీ.సింహనాదంబు నసురులు సేయుచుండి
త్రిప్పగా లంకలోఁ గల తెరువు లన్ని

ఆయుధంబులు గల రహస్యస్థలములు
రావణాసురు బలగంబు రక్షణ గతి 238

తే.గీ.వీథి వీథులఁ గనుచుండి వెడలుచుండె
నర్కుఁ డుదయాద్రిఁ బొడసూపు నంత హనుమ
రావణుని రక్షణ విధంబు రామమూర్తి
కెఱుక సేయంగ రథ్యల నెంచి చూచు 239

ఉ. బాలురు స్త్రీలు వృద్ధులును వానరు మండెడి తోకఁ జూచుచుం
జాల హసించుచున్ గడప చక్కియలన్ గృహ గోపురంబులన్
లీలగ నిల్చి యుండిరి చలింపక మారుతి మంటమండు నా
వాలముతోడ వెంబడిన వారలఁ గొట్టెను దెబ్బ రీతిగా 240

తే.గీ.అంతఁ గుంచించెఁ దనువుఁ గట్లన్ని జారి
పడగ గంతుమై పశ్చిమ ద్వారమెక్కి
మేరు పర్వత రీతిగ మేను బెంచి
నిలిచి తలఁచెఁ బూన గలట్టి నియతకర్మ 241

సీతాశపథము

ఆ.వె.ఎండు కట్టెల గమి మండెడి గతి వాల
మునకు నిప్పుఁ బెట్టి పురము నెల్ల
కపినిద్రిప్పుచున్న కరణిని రాక్షసి
సరమ వివరించి మాటాడు జానకి విన 242

ఆ.వె.సీత యంత వగచి చేతులఁ జోడించి
దివ్యభక్తి వహ్ని దేవు నెంచి
ప్రార్థనంబు సలిపె పావని రక్షింప
శీతలంబు గాగ చెలఁగి వహ్ని 243

ఉ. నేనె పతివ్రతామహిత నిశ్చల బుద్ధిఁ గలట్టి దాననే
యైన మదీయనాథుఁడు దయన్ నను నించుకయేని లోఁ దలం
పూనుచు నుండెనేని యిక బొందెడి భాగ్యము శేషముండినన్
వానరముఖ్యు శీతలతఁ బాలన సేయుము హవ్యవాహనా 244

ఉ. జీవము వీడకుండఁ బతిఁ జేరు తపంబున నుంటినేని ధా
త్రీవరుఁడైన రాముఁడు పతివ్రత నేనని యెంచునేని సు
గ్రీవుఁడు ధర్మతత్పరుఁడు క్లేశము వాపఁగ నుండెనేని ఓ
దేవ! హుతాశనా! ప్లవగు దేహము చల్లగఁ జేయగాఁ
దగున్ 245

ఉ. సీతయె రాముఁ జేరుటకె చిత్తమునం దపియించునేని యి
ట్లాతఁడు రామచంద్రుఁడుఁ దలంచుచునుండినయేని దూత వి
ఖ్యాత కపీంద్రుఁ డిప్పుడు మదర్థము లంకకు వచ్చెనేని వే
శీతలుఁడౌ హుతాశనుఁడు శ్రీరఘువర్యుని రాము దూతకున్ 246

## హనుమంతుని ఆశ్చర్యము

కం. అని సీతాసతి ప్రార్థన
మొనరింపఁ జ్వలించు నగ్ని హోత్రుండామెన్
గని ప్రదక్షిణ మొనరించుచు
హనుమంతుఁడు క్షేమ మనియె నతులిత భక్తిన్ 247

ఆ.వె.అగ్ని తోడు గాగ ననిలుండు వీచుచు
హనుమ తోకవెంట నలరు చుండి
సీత నేదఁ దేర శీతల వాయువు
వీచె నంత హనుమ వేడ్కఁ గనఁగ 248

కం. జనకజ తపమున వహ్నియు
హనుమంతుని గాల్చదాయె నది గని కపియున్
మనమున నాశ్చర్యముఁ గను
ననలుం డేలకొ దహింపఁ డనుచుం దన్నున్ 249

ఆ.వె.చందనంబు భాతిఁ జల్లగా నుండెను
దోక చుట్టు మంట ప్రాకు చుండి
జలధి దాటు వేళఁ సహకరింపదె గిరి!
ప్రథిత రాఘవుని ప్రభావమునను 250

తే.గీ.సాగరుఁడల మైనాకుండు సహకరింప
వచ్చిరిగద! రామ హితమ్ముఁ బాటి సేసి
అగ్నిహోత్రుండుఁ గూడ రా మార్థ మెంచి
నన్ను దహియింపకుండె నీ తెన్నుఁ జూడ 251

తే.గీ.వాయుదేవుండు నాతండ్రి పావకునకు
హితుఁ డగుట దహియింపఁగా నెంచఁ డితఁడు
రాము తేజంబు జానకీ రామ కృపయు
గలిగి యుండిన నను వహ్ని గాల్చ నోర్చు? 252

ద్వి. అనుచు లోనెంచుచు హనుమంతుఁ డంత
దనకింకఁ బనిగల దని లోఁ దలంచి 253

ఉ. చేరెను సింహనాదమునఁ జెచ్చెర గంతిడి కోతి పశ్చిమ
ద్వారము లేరుదైత్యులట ధైర్యయుతుండును మేరుపర్వతా
కారుఁడు నైన యాహనుమ ఆకృతిఁ జిన్నదిగాగఁ జేసి శా
రీరపు కట్లుజార విపరీతముగా మెయిఁబెంచి వెంటనే 254

ద్వి. గట్టిగా గట్టిన కట్లన్ని విడఁగ
దిట్టరిగా కోతి గట్టిదౌ పరిఘ 255

ద్వి గుమ్మ మందుండి కై కొని దాని తోడ
వమ్ముగా రాక్షస భటతతిఁ జంపె 256

ద్వి. జ్వలితాగ్నిశిఖలచే వానరు ముఖము
లలి కిరణావృత రవివోలె వెలుఁగు 257

తే.గీ.తోరణాసీనుఁడై లంకఁ బారఁ జూచి
చేయఁగాఁ దగుపని నింకఁ జేయ వలయు
విఱిచితి యశోకవనమెల్ల విఱువీగు
నసుర సైన్యంబు నని జంప నయ్యెఁ గొంత 258

తే.గీ.జలధి లంఘనశ్రమ కను సఫలతఁ గన
లంక నశియంపఁ జేసెద జంకు లేక
తోక యందున్న యగ్ని కీదుర్గ మెల్ల
నాహుతి యొనర్పఁ దగు నంచు హనుమ దలచి 259

## లంకాదహనము

ద్వి. కుప్పించి కుప్పించి కొంపల పైన
చప్పరంబుల పైన సావిళ్ళ పైన 260

ద్వి. మేడ మేడల పైనఁ దోడుఁరా గాలి
వాడ వాడల నెల్ల వీడ కెయ్యదియు 261

ద్వి. తన తోక వెలుగొందు ననలు ముట్టించె
హనుమంతుఁ డాలంక నగ్ని కాహుతిగ 262

ద్వి. మెఱపుల నురుముల మేఘంబు వోలె
తిరుగాడె నిండ్ల పైఁ బరుగిడుచుండి 263

తే.గీ. రాజభవనంబు లన్నింట రాజుచుండె
నగ్ని హోత్రుండు వేవేగ ననిల సుతుఁడు
వాయు వేగంబునం బోయి వహ్నిఁ బెట్ట
రావణాసురు లంక జ్వాలలమయంబు 264

తే.గీ. ఆ ప్రహస్తు మహోపార్శ్వ నా సుమాలి
ఇంద్రజిత్తు నరాంతకు నిండ్లు జంబు
మాలి మొదలగు సచివుల మహితసౌధ
రాజి జ్వలితాగ్ని దేవు పాలాయె నంత 265

తే.గీ. రాజ భవనంబు రాక్షస రాజ గృహము
నగ్ని పాల్జేసె హనుమంతుఁ డంత తోఁడ
లంక పురమెల్ల నగ్ని హోత్రంబు చుట్టె
కాని, యా విభీషణు వాడ కాలలేదు 266

శా. జ్వాలామాలలు నింగిపై కెగయఁగా సౌధాళి భస్మంబుగా
నేలంగూలఁగ నిల్వనీడఁగన రా నిర్భాగ్యులౌ రాక్షసుల్
స్త్రీలుం బాలుర వృద్ధులున్ విడిచి నిక్షేపంబులన్ రక్ష్యలన్
గోలం బెట్టుచు నిల్చియుండిరహ సంక్షోభంబు మిన్నంటగా 267

కం. కొందఱు చచ్చిరి మంటలఁ
గొందఱు సౌధాల నుండి కూలిరి భువిపై
కొందఱు భీతిలి మడిసిరి
కొందలమందుచు విహంగ కోటియుఁ గూలెన్ 268

తే.గీ. రత్న మణిమయ వైడూర్య రాజి నొప్పు
గృహగృహాంగణ మెల్లయు దహనమయ్యెఁ
జెట్లు చేమలు మసియయ్యెఁ జెట్ల నున్న
పక్షి సంతతి యెల్లయుఁ బడెను మంట 269

తే.గీ. గజ తురంగ రథ తతియుఁ గాలిపోయెఁ
బ్రళయ కాలాగ్ని వలె లంకఁ బ్రబలె వహ్ని
భస్మ మగుచున్న లంకను బావని గను
నా త్రికూటాద్రిపై నుండి యాత్మ తృప్తి 270

శా. అయ్యో! మాతరో! తాత! పుత్రక! సతీ యంచున్విలాపించు నా
కుయ్యల్ మింటిని ముట్టుచున్నయవి రక్షోవారముల్ చావఁగా
నయ్యయ్యోయని బంధుమిత్రులకుగా నార్తింబడన్ రక్కసుల్
ప్రయ్య స్వర్గము సర్వ మగ్నివశమై లంకా వినాశంబుఁగా 271

## రావణసంతాపము

తే.గీ. [1]పురము పురమెల్ల దగ్ధమై పొక్కుచుండ
మంట లెగయుచు వేవేగ మింటి నంట
రాజభవనంబున న్మంట రాజుచుండ
రావణుఁడు గాంచి సంతాపరాశి యయ్యె 272

తే.గీ. [2]ఒక్కరుఁడుఁ గూడ లేడొకో యొక్క కుండ
నీరుఁ గొనితెచ్చి యగ్నిఁ జల్లారఁ జేయఁ
గుంభకర్ణుండు గుంభ నికుంభు లాది
వారు నామమాత్రులె యైరి ధీరు లయ్యు 273

---

1, 2, (యాజ్ఞవల్క్య రామాయణము నుండి)

తే.గీ.[3]స్త్రీల బాలుర గృహముల శీఘ్రగతిని
రక్ష సేయంగ వలయు నీ లంక నెల్ల
బుగ్గి యగుచుండె భటులార పొందు వేగ
ననెడి బిక్క-మొగంబున నసుర రాజు

ద్వి. [4]అనునంతలో సర్వ మగ్ని పాలాయె
హనుమంతుఁ డొక త్రుటి నా లంకఁ గాల్చె

సన్మార్గుల తలంపు

తే.గీ.ప్రాణికోటియు గృహ వృక్ష వారములును
నిముష మాత్రాన దగ్ధమై నేలఁ గూలఁ
గనుచు సన్మార్గులగు దైత్య కాండ మపుడు
గుంపు గుంపులుగా జేరి కోతి జూచి

తే.గీ.ఇతఁడు వజ్రాయుధుండగు నింద్రుఁడె యగు
యముఁడొ? వరుణుఁడో? వాయువో, యగ్నియొ యగు
సూర్యుఁడో చంద్రుఁడో కాకఁ జూడ వీడు
రుద్రుడే యగు జుమి వానరుండు కాడు

తే.గీ.ఆ పి తామహుండలిఁగి యీ అసురనాశ
నార్థమై వానరుని రూప మందె నేమొ
కాక విష్ణువే యిటుగ శాఖామృగంబు
రూప మెత్తెనొ! దైత్యుల రూపు మాప

తే.గీ.ఆ యచింత్య మనన్త మవ్యక్త మేక
మైన, విష్ణు తేజంబె స్వీయమగు మాయ
వానరాకారముం దాల్చి వచ్చె నేమొ!
కాడు వానరుఁ డీతండు కాఁడు కాఁడు

ద్వి. అని తలపోసి రా యసుర వారంబు
కని లంక మంటలో గనలి పోవుటను

3, 4 (యాజ్ఞవల్క్య రామాయణము నుండి)

## హనుమంతుని సంతాపము

తే.గీ.మునులు సకల దేవతలును మోదమంది
గాంచిరా, నిశాచరపురి కాల్చఁ బడుట
అగ్నిదగ్ధంబుగా లంక నబ్ధి యందు
వాలమును ముంచి చల్లార్చె వహ్ని హనుమ 281

తే.గీ.అంత దేవతాగణమెల్ల నాంజనేయుఁ
బ్లవఁగముఖ్యుని వీరునిఁ బవన పుత్రు
మారుత సమాన వేగాన మసలఁ గలుగు
నతుల బలశాలి ధీమంతు నభినుతించె 282

తే.గీ.కాని చేటు మూడినదని కాంచె భీతిఁ
గోపవశుఁడైన మంచిని గోలు పోవు
గురువులను గూడఁ జంపును గోపవశత,
కోపమున జేయు నెవడైనఁ బాపమరయ 283

తే.గీ.సత్పురుష వాక్యములఁ దిర స్కార మూనుఁ
గ్రుద్ధుఁడౌ వాడు మఱపొంది కోలు పోవు
మంచి చెడ్డలఁ దానాడు మాట లందు
ఎట్టి పనినైనఁ గావించు ఁగట్టడియయి 284

తే.గీ.జలముచే నగ్నిఁ జల్లార్చు సరణి బుద్ధి
కోపము నడంచుకొనఁగల్గు కోవిదుండు
పురుషవర్యుండు, నాతఁడే పుణ్యవంతుఁ
డౌ మహాత్ముండు, క్రుద్ధుఁడో యఘముఁ బొందు 285

తే.గీ.పాము కుబుసంబు వీడెడి పగిది నెవఁడు
కోపముఁ ద్యజించునో వాఁడె కోవిదుండు
క్రూరుఁడగు వాడు సహజంబు కుపితుఁ డగుట
పురుషుఁడణచు గోపము క్షమఁ బూను చుండి 286

ఉ. లంకను సీతయుండుటఁ దలంపకఁ గాల్చితి లంకనెల్ల నే
కొంకును జంకులేకఁ గడుఁ గ్రూరుఁడనై కుపితుండనౌచు ఆ
పంకజనేత్ర రాము సతి ప్రాణముల న్విడనాడెనేమొ యీ
లంక దహించి నట్టి యనలంబున కాహుతి యయ్యెనేమొకో! 287

తే.గీ. దైత్య పురి తోడ సీతయు దగ్ధ మైనఁ
బ్రభుని కార్యంబు సర్వంబుఁ బాడు కాదె
లంకఁ గాల్చక మున్నె యిలాతనూజ
రక్షణముఁ బూననైతిఁ బరాకుఁ జెంది 288

చం. జలనిధి దాటి వచ్చితిని జానకినిం గనియుంటి లంకలో
పల రఘురామమూర్తికి శుభప్రద వార్త నెఱుంగఁ జెప్పఁ బో
వలసిన వాడనయ్యుఁ బురి వహ్నికిఁ బాల్పడఁ జేసినాడ ఏ
యిలసుతఁ గూర్చి చేసితినొ యీపని యామెయె
నాశమొందెనా? 289

ఆ.వె. మూలభూతమైన భూసుతయే మంటఁ
బడఁగఁ జేసితినొకొ పాపి నగుచుఁ
బట్టణము నశించెఁ బ్రాణికోటియుఁ జచ్చె
నేడ సీత నిలువ నీడ గలదు? 290

ద్వి. చెట్టు చెట్టును గాలె సీత యేమాయె
పుట్ట పుట్టయుఁ గూడ భూమిలోఁ గలిసె 291

ద్వి. అగ్గిలో లీనయై యవతారము విడి
బుగ్గియై మింటికిఁ బోయెనా సీత 292

తే.గీ. కార్యమెల్లయుఁ జెడఁ గొట్టి కనుట యెట్లు
రాజు సుగ్రీవు నారామ లక్ష్మణులను
సీతయే ప్రాణములవీడఁ జెనటి నగుచుఁ
బాసి ధర్మార్థముల రెండుఁ బ్రతుక నేల 293

ద్వి. వానర చాంచల్య భావంబుఁ గంటేఁ
బూనుచుఁ గోపంబు బుద్ధి నశింప 294

ద్వి. విఫల కార్యార్థిగా విపరీత చేష్ట
చపల స్వభావాన సలిపిన వాఁడ 295

ద్వి. సా రాజసం బొందె నన్నింత సేసె
బోరాట మూనఁగా బూన్కిఁ బుట్టించె 296

ద్వి. అతిగ స్వాతంత్ర్యంబు నవలంబనంబు
మతిఁ జెడఁ గొట్టెగా మరణింపఁ దగదె 297

ఉ. జానకి లంకఁగాల్చుటను జచ్చెను మంటలఁ జిక్కియంచు నా
జానకి నాథుడే వినినఁ జావఁడె లక్ష్మణుఁగూడి యంతనా
వానరరాజశేఖరుఁ డవారిత దుఃఖమయుండు గాగ వే
బూనడె బంధుయుక్తుఁడయి భూమిని వీడగ నెంతఁ జేసితిన్ 298

తే.గీ.రాము సోదరులంత వి రాగు లగుచు
మరణమొందరె రామలక్ష్మణుల వార్త
వినినతోడనె! యిక్ష్వాకు వీరవంశ
మంత మొందంగఁ జేసితి నింత పనిని 299

తే గీ.అని తలంచుచుఁ జింతించు హనుమ కపుడు
తోచె శుభచిహ్నములు వానిఁ జూచి సీత
బ్రతికియే యుండె నంచను భావ మొదవె
వహ్ని దహియింపఁ జాలదు వహ్ని నంచు 300

ఉ. వారిధి దాటుచున్నతఱి వచ్చె సహాయ మొకండు కొండ సీ
తారమణుం డనుగ్రహముఁ దాల్చుట నాయెడ వాల మిప్పుడే
దారుణ వహ్నిఁ గాలక యథావిధి నుండెను రామరక్షయున్
ధారుణికన్య సత్కృప నెదన్ వహియించుట కారణంబులౌ 301

తే.గీ.సత్కృపామూర్తి సీతమ్మ జనక సుతయె
నన్ను దీవించి యుండిన తెన్నె యిదియు
నన్ను రక్షింప నేర్చిన నన్నుతాంగి
తనకు దా రక్షఁ బూనఁగఁ దలఁప దొక్కొ 302

తే.గీ.అగ్ని నా తోక దహియింప నలవి గాక
వీడియుండెను సీతమ్మ వీడ డొక్కొ
ఆమె దఱిఁజేర నోపునే యతుల సతిని
దహన మొనరించునొక్కొ హుతాశనుండు 303

తే.గీ.ఆ తపము మహిమయును సత్యాతి బలము
ఆ పతివ్రతాధర్మ మహోగుణంబు
వహ్నినే కాల్చఁగాఁ దగు బలము గలవి
అగ్ని హోత్రుండు సీతమ్మ నంట లేఁడు 304

కం. అనుచున్ హనుమంతుండా
జనకజఁ దలపోయుచుండఁ జారణులంతన్
హనుమను గని కొనియాడుట
విని సంతోషమ్ముఁ గాంచు వీరుఁడు మదిలో 305

కం. బురుజులుఁ గోటయుఁ గూలఁగఁ
బురమంతయు లంకఁగాల్చెఁ బొక్కఁగ దైత్యుల్
పురుషులు స్త్రీలును బిల్లలు
దిరుగాడఁగ వీథి వీథి దీరని భీతిన్ 306

ద్వి. రక్షస ఘోషకు లంకా పురంబు
దక్షత చెడి యేడ్చు దాని రూపొందె 307

ద్వి. తహతహ లాడుచు దైత్యులు పాఱ
గుహలు ప్రతిధ్వనిన్ ఘూర్ణించుచుండె 308

కం. ఒరు లేరును జేయఁగఁ జా
లరుగా యీపని హనుమయె రాఘవు కార్యం
బరయుచుఁ జేసెను గాలియుఁ
బురమెల్లన్ సీత జీవములతో నుండెన్ 309

ద్వి. జనకజ మంటలఁ జావక బ్రతికె
నను చారణుల మాట నాలించి హనుమ 3.0

ద్వి. మనమున ముదమంది మానిని మఱలఁ
గని సెలవొందఁగాఁ జనె సీత కడకు 311

ఉ. సీతను జూచి యా హనుమ శీఘ్రముగా నతి సల్పి భక్తిమై
చేతమున న్దిగుల్ విడిచి చేరగ రాఘవు పోయి వచ్చెదన్
బూతచరిత్ర! వహ్ని నినుఁ బొల్పుగ వీడెను గాల్చ కుండ వి
ఖ్యాత పతివ్రతా మహిమనంచని పల్కెను హృష్ట చిత్తుఁడై 312

ఉ. మాటికి మాటికిం గనుచు మారుతినిన్ జనకాత్మజాత నీ
మాట యదార్థమంచు హను మంతుఁడ నమ్మితి నీవొకండ వీ
బోటిని, రావణుం దునిమి పొందఁగఁ జేతువు రాము కాని ఆ
పోటుమగండె రావణుని బోరునఁ జంపి గ్రహించు టర్హమౌ 313

కం. హనుమా? యెటులైనను రా
మునిఁ గొనితెమ్మిటకు దైత్యుఁ బోకార్చి ననుం
గొని పోవఁగ నీవే యీ
పని ఘటియింపం గలట్టి వాఁడవు సుమ్మీ 314

ఆ.వె.అర్థ యుక్తమైన ఆ సీత నుడి విని
యెలుగు బంట్ల గపివరేశులఁ గొని
వీరవరుఁడు రామ విభుఁడు రాఁ గలవాడు
శీఘ్రగతిని వచ్చి సీతఁ గొనును 315

తే.గీ.అపుడు మాయామృగంబున హరణ మొదవె
నేడు శాఖామృగంబున నీ హృదీశుఁ
జేరఁ నపకీర్తియే రెంటఁ జెందఁ గలవు
రాఘవుఁడె నిన్నుఁ గొనుట మర్యాద నిజము 316

తే.గీ.కాల్చి వేసితి నేను లంక సకలంబు
మరల నిర్మించు దీని నాసురవరుండు
దానిఁ గాల్చెడి రాముండు తథ్య మమ్మ
రాఁ గలఁడు లంక కింతలో రామవిభుడు 317

తే.గీ.అనుచు నాశ్వాసనముఁ జేసి యామె కంతఁ
ప్రణతి సల్పుచు సెలవొంది పయన మాయె
రాము సన్నిధానంబున రహిఁ జెలంగ
వార్ధిఁ దాట నరిష్టాద్రి పైన నిలిచె 318

తే.గీ.ఆ విభీషణుని గృహంబు నవనిజాత
కాలబడకుండుటను లంక కాలుటయును
గనుటఁ బ్రభునానఁ దీర్చితి ననుచు హనుమ
హర్షమగ్నుండుగా నరిష్టాద్రి నిలిచె 319

### ఆశ్వాసాంత పద్యములు

ఉ. యోగుల రాజయోగ హఠ యోగము లెంచ గృహస్త ధర్మముం
ద్యాగ మొనర్చ కుండఁ బరమాత్మను జేర్చవు సన్యసించియే
యోగ విధానమూనవలె నొప్పునె లోకుల కాచరింపఁగా
సాగునె భక్తియోగమున సర్వజనంబుఁ దరింప వీలగున్ 320

ఉ. భక్తి విహీనయోగ గతి పట్టి హరిన్దటిఁ జేర్పఁజాల దా
సక్తిఁ బరాత్మసంస్మరణ సల్పిన ముక్తి లభించు భక్తి సం
సక్తులుగాగ నెల్లరకు సాధ్యము కేల్ మొగిడించుచున్ సదా
భక్తిని రామ రామ యన భద్రగిరీశ తరింపఁ జేయవే 321

శ్రీ గోవింద రామాయణ సుందర రామకావ్యంబునందు
ఉపదేశాశ్వాసము సంపూర్ణము



# శ్రీ గోవింద రామాయణము

## ప్రథమాశ్వాసము

కం. శ్రీకర! నిన్నెద నెంచుచు
లోకమునం దెట్టి పనిని లోఁ దలపెట్టన్
శోకులు సురలును, గ్రహములు
నేకంబై యడ్డుపడిన నేనియు జరుగున్ 1

హనుమచ్ఛోక

ఉ. ఆరఘురాముఁ జిత్తమునఁ జేరిచి సింధువు దాఁటి లంకకుం
జేరి ధరాసుతం గనుచుఁ జెండి సురారి బలంబుఁ గొంత నే
వైరికిఁ జెప్పి రాఘవుని పంపున దూతగ రాక రీతి లం
కారమణీయ పట్టణముఁ గాల్చి పురోన్ముఖుడై ప్రహృష్టుడై 2

ద్వి. కొండపై మారుతి కుప్పించు నంత
బండన్నియుఁ గూలి పర్వతం బెల్ల 3

ద్వి. మూల ముట్టుగఁ బడి భూమిలోఁ గలిసె
లీల నరిష్టంబు లేశంబు లేక 4

ద్వి. నిలువ నరిష్టాద్రి నింగి పై కరుగ
విలవిల నది భూమిఁ దలక్రిందులాయె 5

ఉ. మేరు ధరాధరంబు వలె మేను దలిర్పఁగ నుత్తరాశలోఁ
దీరముఁ జేర గారుడగతిన్ గగనంబునఁ బెద్ద యోడయౌ
తీరున దాటుచుండె జలధిన్ హనుమంతుఁడు మేఘ పంక్తితో
బారుచుఁ బైకివచ్చుచు నవారితుఁడై రఘురాముఁ జేరఁగాన్ 6

ఉ. శోకను దారిలోఁ గలిసె మున్ సహకారిగ వచ్చియున్న మై
నాకునిఁ దట్టిహస్తమున నాకము నిండెడి సింహగర్జనన్
వీఁక సముద్రలంఘనము వేనొనరించుచుఁ గాంచి పారముం
దోకను బెంచి సంతసముతోహరి సల్పెడి హర్షనాదమున్ 7

ద్వి. దవ్వులఁ గని మహేంద్రగిరిని హనుమ
ఉవ్వెత్తుగా ముద మొందుచు నుండె 8

తే.గీ.హనుమ వాయుమార్గాన నద్ధి దాట
నూరువుల నుద్భవించుచు నున్న ధ్వనిని
వాని సింహగర్జలను బ్లవగ వరులు
వినుచు నికనేమి విందుమో యనుచు నుండ 9

తే.గీ.అంత జాంబవంతుఁడు కని యంగదాది
కపుల సంతోషమూర్తియై, కపి వరుండు
హనుమ, కృతకృత్యుఁడాయె కా దనెడ రేని,
అతని కంఠనాద మింతగ నలర దనియె 10

ద్వి. వలగొను ముదమున వానరు లంత
కిలకిల ధ్వనులతోఁ గెరలిరి తోడ 11

ద్వి. కుప్పించి కుప్పించి కోతులు చెట్లఁ
గొప్పగా నెగురుచుఁ గోలాహలాన 12

ద్వి. గుట్ట గుట్టలఁ గొండఁ గొండల నెక్కి
చెట్టుచేమల దూకి చెలగి రారంత 13

ద్వి. హనుమ గర్జన విని యా కోతి మూక
కని వాని మునుముందుఁ గాంచిరి ముదము 14

ద్వి. తిరిగి వచ్చిన వాని మఱిమఱిఁ జూచి
పఱిగిరి ముదమున బ్లవఁగు లెల్లరును 15

ద్వి. తన వారిఁ జేరి సంతసమంది హనుమ
వినతి సల్పుచు వృద్ధ వనచరతతికి 16

ద్వి. అంగదుఁ గౌఁగిలి యందుంచి మ్రొక్కి
పొందుచు బ్లవగుల ముదమునఁ గూడె 17

ద్వి. ఫలములు మూలముల్ బహుమాన మిడిరి
కిలకిల మనుచు గోఁతులు వానికపుడు 18

ద్వి. వానరగతి వారు వాలంబు లెత్తి
పూనిరి భూమిని మోదాన గొట్టి 19

ద్వి. కొందఱు హనుమను గూరిమిఁ దాఁకి
మందస్మితంబున నందిరి వేడ్క 20

ద్వి. తన చుట్టుమూగిన తనతోటి వారి
వనచరతతిఁ గాంచి యనె వీరహనుమ 21

కం. చూచితి సీతాసతినిన్
జూచితి రఘువీర పత్ని సుందరమూర్తిన్
జూచితి జానకి సాధ్విని
జూచితి రక్కసల మధ్య స్రుక్కెడి దానిన్ 22

ద్వి. అనుచున్న హనుమంతు నాక్రోతితతులు
వినుచు సల్పిరి నతులను బ్రేమమీర 23

మ. హనుమన్ బ్రస్తుతి సేయసాగిరి మహాహ్లాదంబు మిన్ముట్టఁగాఁ
గని సీతమ్మను బ్రోచితీవుమము లంకం జేరఁగాఁ గల్గి రా
ముని సుగ్రీవుని జూడనోచితిమి నీ పుణ్యంబునన్ మారుతీ
యెన లేరెవ్వరు నీకు వానరులలో నెంతో పనిం జేసితే 24

తే.గీ. జాంబవన్ముఖ్య కపిపూజ సరగున గొని
ప్లవఁగ పరివేష్టితుండయి ప్రమద మొసఁగు
తావున, హనుమ, కూర్చుండె తగిన రీతి
వాయుజుని కొనియాడి రా ప్లవగవరులు 25

తే.గీ. జాంబవంతుడు వృద్ధుండు సంతసించి
హనుమఁ బ్రశ్నించె, జానకిఁ గనిన రీతి
సర్వమును దెల్ప ఆరామ చంద్రుని కడఁ
జెప్పఁ దగినయంశంబు సుస్థిర మొనర్ప 26

ద్వి. అని జాంబవంతుడు హనుమఁ బ్రశ్నింప
జనకజ మది నెంచి సాష్టాంగ వినతి 27

ద్వి. హనుమంతుఁ డంతట నతిభక్తి సలిపి
విసఁగ వారలు పల్కె విశదంబు గాగ 28

## హనుమంతుడు-ప్రయాణవృత్తాంతముఁ దెలుపుట

*దండకము*

### 1 మైనాకుఁడు

సంద్రంబు లంఘింపఁ గాఁబూని మీయానమై దారి మైనాకుఁ డం బర్వతంబడ్డమై నిల్వ నద్దాని వాలంబుతోఁ గొట్టితిన్, ముక్కలౌ రీతిఁగా మానుషాకార ముందాల్చి మైనాకుఁ డెంతో ప్రియంబొప్ప వాక్రుచ్చె, నాతండ్రి మిత్రుండుగా సాగరంబందు దాగుచున్ రామకార్యార్థినౌ నాకు దోడ్పాటుగావచ్చె నంచున్ హితంబొప్పగా విశ్రమింపంగ గోరంగ నాశ్వాసముంజేసి యాశీస్సు లంబొంది నేనేగితిన్.

### 2 సురస

నేగొంత దవ్వేగగం గాంచితిన్ నాగమాతన్ మహావక్త్రియై మ్రింగగా నన్సమీపించె దన్మీరఁగాఁజాల రెవ్వారలంచున్ వరంబుండెనంచున్ సురల్ నన్నుభక్షింపఁ గాఁబంపిరంచాడుచుం బెద్దగా విప్పగా నోరు రామాజ్ఞమై సీత గాంచంగ నేఁబోవు చున్నాఁడఁ దత్కార్యమున్ సల్పి పుత్తెంతు నీవద్దనన్ మ్రింగుమీ యంచు నేమ్రొక్కినన్ వీఁడనంచాడ సూక్ష్మంబుఁగా రూపుఁ గుంచించి యాపెద్ద నోటంబ్రవేశించి వేవచ్చి నాఁడన్ జూమీ,యంత నన్నామె దీవించి నీకే జయంబంచుఁ బోనిచ్చె గా.

### 3 సింహిక

ఆకాశమార్గంబునం బోవఁగా నీడఁ దాఁబట్టుచున్ జీవులన్ మ్రింగు పెన్ రక్కసిన్ సింహికందాకితిన్ నన్ను భక్షింప నానీడఁ బట్టంగ నేమేనుఁ గొండంతగాఁబెంచఁ దానున్ శరీరంబు నాకంటెనుంబెంచి తానోరు విప్పంగ నేనంత సూక్ష్మంబుగా మేను గుంచించి యానోటిలో దూరి గుండెన్ వడిందీసి లోనుండి రా, నామె చచ్చెంసుమా.

### 4 ఒడ్డుఁజేరుట

వేవేగఁ సంద్రంబు లంఘించి యామ్యాశకుం జేరితిన్ సిద్ధులుం జారణుల్‌నన్ను దీవించి రారాక్షసిం జంపుటన్ వార్ధినిన్ దాఁటితిన్.

### 5 లంకాపురి లంకిణి

ఆదిత్యుఁడస్తాద్రిఁ జేరంగ నేలంక లోనంబ్రవేశింప యత్నించుచుండన్ మహాభీకరాకారయై యెఱ్ఱగా మండు నేత్రంబులన్‌నన్నుఁ జంపంగ రాలంకిణిన్ వామహస్తంబునంగుద్ది జొక్కింపగా నామె నీవింక బొమ్మంచు దైత్యాళి నిర్జింపగానోపుదీవంచుఁ బల్కంగ నేలంకలోఁ జేరితిన్ రాత్రియందెల్ల నేలంకలోసీతఁ జూడంగ శోధించితిన్‌గాని సీతమ్మఁ గానంగలేనైతి దుఃఖించి ప్రాకారమధ్యంబు నందున్న యుద్యాన ముంగాంచి లోఁజేరుచున్ శింశుపావృక్ష మూలంబునందున్న సీతామహాదేవినిం గాంచితిన్.

### 6 సీత

తా భర్తనే యాత్మలో నెంచుచున్ జీర్ణవస్త్రంబు మైదాల్చి దైత్యాళిఁ డాసీతఁ గొంపోవు నాడెట్టి వస్త్రంబు గట్టంగ మీరెల్లరుం జూచియున్నారొ ఆబట్టనే కట్టి దీనంబుగా ధూళితోడన్ శిరోజంబు లుండన్ నిరాహార యౌచుం గృశించెన్ బతిన్‌సంతతంబెంచుచున్ రామ హారామ కంజాక్ష కారుణ్య మూర్తీ ననుంజూడరావా యటంచున్ విలాపంబునన్ జానకీసాధ్వి పద్మాక్షి యారాక్షసస్త్రీలు దుర్భాష లాడంగ దేహంబు వైవర్ణ్యముంబొంద భూదేవిపై పవ్వళించుంగ దా.

### 7 రావణుని రాక

భూజంబుపై కొమ్మ పైనుండి నేజూచుచున్నంతలో దైత్యనాథుండు భార్యాసమేతుండునై సుందరాకారలౌ స్త్రీలు వెంటాడగా దుందుభిధ్వానముల్ తాళమేళాది గానంబులంగూడుచున్ సాట్టహాసంబుగా సీతఁ జూడంగ వచ్చెన్ దలంగ్రిందికిన్ వంచి పృథ్విన్ విలోకించుచున్ సీత మోకాళ్ళతో,మోమునున్ బొమ్మనుం గప్పుచున్ దుఃఖితాత్మన్ మహాభీతిమైనుండె లంకాధినాథుండు ప్రేమం బ్రవర్తించుచుం గోరె మన్నింప గాఁదన్ను దైత్యేశు పట్లం దిరస్కార

ముంజూపి పల్కాడ సీతమ్మ ఆ రావణుండంత కోపించి గర్వంబునం సీత కుంబల్కె నీవింక మాసద్వయంచే సజీవంబు గానుండు పిలోపుగా నన్ను మన్నింప వేనిన్ వదిన్ నిన్నుఁ జంపించి నీరక్తముం ద్రావు వాఁడన్, సుమీయంచు మాటాడ, నామాటలన్ విన్న నారీశిరోరత్నమంతన్,మహాకోప ముంబూనుచున్ రాక్షసా సత్య రాముండు ధీరుండు వీరుండు నాభర్త రాముండు నిక్ష్వాకు నాథుండు నామామ, తుచ్ఛంబుగాఁ బల్కు నీనాలుకీ భూమిపైఁ గూల దేలా మహాపాపి; దుష్టాత్మ; నన్నొంటిమై చేసి నాథుండు లేనట్టి వేళన్ ననున్ దొంగవై తెచ్చి యున్నావుగా,నీదు ధైర్యంబు తేలెంగదా నాడె నాభర్తతో నీవు తుల్యుండవా? రామదాసుండవై యుండఁ గాఁగూడ నర్హుండ వీ వెంత మాత్రంబునుం గావుగా, దుష్ట చిత్తుఁడ పొమ్మంచనెన్, దాన నేత్రంబులం దగ్ని రాలన్ మహాకోప ముంబూని యామెన్ వధింపన్ మహాముష్టిఁ బూనె స్త్రీలెల్ల రామెన్ వధింపంగ రాదంచు ఘోషింప మండోదరంతన్ విభుంజేరి వారించి తోడ్కొంచు వెంటన్ గృహంబేగగన్.

## 8 రక్కసలు

దుఃఖార్తిచే గ్రుంగు నా జానకీదేవినిన్ రక్కసల్ జుట్టునున్ ముట్టి దుర్భాషలన్ భీతి గల్గించుచున్ బ్రీతిగాఁజెప్పుచున్ రావణుంబొందు మంచాడ గావారు, సీతమ్మ నవ్వారి మాటల్ దృణీకారముంజేయ వారేగి దౌవారికిం జెప్పి సీతమ్మ నొప్పింప దుస్సాధ మంచెంచి యందంద నిద్రించి నారెల్లరున్

## 9 త్రిజట స్వప్నము

సీతామహాసాధ్వి హారామ! హారామ యం చేడ్చుచుండన్ ద్రిజాటాఖ్య మేల్కాంచిభక్షింపరా దీమె, నన్ ద్రింగుటే ద్రింగగా నెంచుచో నీమె శీఘ్రంబు గాభర్తఁ నుంజేరి సౌఖ్యంబు బొందున్ గదా

## 10 త్రిజట హితము

దైత్యాధిపుండీల్గు రాముండు లంకం బ్రవేశించుచున్ గెల్చు నంచేను స్వప్నంబునం జూచితిన్,మైథిలీదేవి నాశంబు గాదెన్నడున్ రాముతో జెప్పి యీదేవి మిమ్మెల్లరన్ గూడ రక్షించు మీరిప్పు డామెన్ క్షమింపంగ గోరన్ సుమూఆ దయాశీల దాసోహ మన్నంత దుఃఖంబులంబాపు నంచాడగాఁ గావ

లాయున్న ఆశ్రీలు రక్షింపమంచామె గోరన్ సరే యంచనేన్ సత్కృపామూర్తియై

ఆమెన్‌మహాదీన నాజానకిన్ రాముపత్నిం గనంగల్గి భాషింపఁగా నామెతో నెంచితిన్

### 11 హనుమ మాటాడుట

ఇక్ష్వాకు వంశ స్తవంబూనితిన్ సీత నామాట లాలించి నంజూచి సంతోషముంజెంది ప్రశ్నింప సర్వంబుఁ దెల్పంగ నేనంత రాముండు సుగ్రీవుఁ డున్‌సఖ్యముల్‌గాంచి యున్నట్టి రీతుల్ వినన్‌జెప్పి రామాంగుళీయంబు నేనిచ్చితిన్ నన్ను మన్నించుచున్

### 12 సీతాసందేశము

దైత్యేశు మన్నింపకున్నన్ ననుంజంపు నా రాక్షసుండెంచ రెండే నెలల్‌కాలముంజెప్పెగా జంపగా నింక నంచున్ ననున్ నమ్మచుం దా శిరోరత్నముందీసి రాముండు గుర్తింపగా రెండు వృత్తాంతముల్ జెప్పి నాథుండు వెన్వెంట రాకున్నచో రెండు మాసంబులే నేను జీవింతుఁగా రావణుండంతఁ జంపించు నన్నంచునుం జెప్పుచున్ క్షేమసందేశమందిచ్చె నేనామె బాధం గనంజాలమిన్ మూపు నన్నిల్పి నేతోడితేఁజూచితింగాని రాముండె తావచ్చి దైత్యేశునింజంపి స్వీయప్రభావంబు నందన్ను జేఁబూనఁ గా-జెల్లు నంచాడెఁగా

### 13 హనుమ-యుద్ధము

అంతన్ నమస్కారముంజేసి సంద్రంబు లంఘింపఁ వేలంక వీడంగలోనెంచియున్ దుఃఖమున్‌వీడఁగా లేక శ్రీరామ సుగ్రీవ సైన్యంబు శక్తిన్‌సురారిం గనంజేయగా యుద్ధముంబూన సిద్ధుండ నై యామహోద్యానముం బాడుసేయంగఁ దోడ్తోడ నంజంపఁగా నెన్మిదౌవేలమందిన్ భటానీకముం బంపె దైత్యేశుఁ డవ్వారు నాతోడ యుద్ధంబు సేయంగ నవ్వారి నేనెల్లరం జంపితింబిమ్మటన్ దేవతాగోపురంబున్ భువింగూల్చి యద్దాని రక్షించు నానూర్వురన్ స్తంభముం గొంచు జంపంగఁ గ్రుద్ధుండునై రావణుండంత వే జంబుమాలిం బ్రయోగించె నవ్వాని సైన్యంబు తోఁగూడ నే జంపితిన్ దుష్టుఁడై దైత్యనాథుండ మాత్యాత్మ జుల్‌శూరులంబంపె వారేడ్వు రుంగూడ సైన్యంబు తోద్రేళ్ళగా వెంటనే పంపె సేనాధినాథుల్ మహావీరులన్ బోర వారేవురున్ సైన్య

యుక్తంబుగా వీరులై పోరినన్ వారినింజంపితిన్ రాక్షసేంద్రుండు స్వీయాత్మజున్ యక్షునిన్ వీరునింబంపె నవ్వానినింగూడ నేజంపితిన్ యుద్ధమున్ సల్పి వీరాధి వీరుండు శస్త్రాస్త్రయుక్తుండ హో ఇంద్రజిత్తున్ నియోగించె నన్బట్ట గానాతఁడున్ ఘోర సంగ్రామమున్ సల్పి శస్త్రప్రయోగంబుచేతం గృతార్థుండు కాజాలమిన్ వేసె బ్రహ్మాస్త్రమున్ దానికింజిక్కితిన్ రక్కసుల్ వేగ మేత్రాళ్ళతో నన్ను బంధించి పేరోలగంబందు నన్నుంచి రా రావణాస్థాని పాపుండు వాడుగ్రుఁడై నన్నుఁ బ్రశ్నింప నెవ్వాడ నీవంచు సర్వంబునుంజెప్పి నేనంత నాపేరు వ్రాక్కుచ్చి శ్రీరామ దూతన్ సుమాయంచు సుగ్రీవుడున్ రాముఁడున్ మిత్రులై వచ్చుచున్నారు నిం జంప గానంచు నాదుస్థితింబొంద కుండంగ శ్రీరాము సేవించుచున్ వేడు మంతన్ శరణ్యంబు నర్పించుచున్ సీతనంచున్ నివేదించితిన్

## 14 హనుమ తోకఁగాల్చుట

దైత్యాధిపుండంత నుగ్రుండునై నన్ను జంపంగ శిక్షన్ విధింపంగ దైత్యేశు తమ్ముండు ధర్మాత్ముఁడాయాన దోషంబటంచాదె శాస్త్రజ్ఞుడౌ వాఁడవై దూతనుంజంపుదే శిక్ష వేరొండు చెప్పందగుంగాదె యీదూత తన్ బంపియున్నట్టి వారన్న మాటల్ నివేదించె కానీ యితండున్ విరోధంబు సాధింపగా దైత్యులంజంపె నద్దాన శిక్షార్హుఁడౌ నంగవైకల్యముంజేయగా నొప్పు శాస్త్రార్థసారంబుగా నంచనన్ వల్లె యంచా సురేశుండు నావాలమున్ మంట చేగాల్పనాజ్ఞప్తి నిచ్చెన్ భటుల్ గుడ్డలన్ జుట్టి తైలంబునుం బోసి నిప్పంత ముట్టింప వాలంబు మండంగ లంకాపురీవీధులం దిట్టుచుం గొట్టుచున్ద్రిప్పి నారాపురిన్ నేను సూర్యోదయంబందు నాపట్టణంబెల్ల గాంచంగ లోనెంచి బంధంబు నందుండితిన్ గొంత కాలంబు బ్రహ్మాస్త్ర బంధంబు నన్వీడినంగూడ నాతోక నాఅగ్నిహోత్రుండు కాల్పండు కాల్పండుగా చల్లగా మండె సీతామహాలక్ష్మియున్ రాముడున్ నన్ను దీవించుటం జేసియుం బెద్దలౌ మీర లాశీన్సులంబంపుటన్

## 15 లంకఁగాల్చుట

నామేను గుంచించుటన్ బంధముల్ పీడగానంతఁ గొండంతగాఁ బెంచి నామేను వాలంబు నందున్న యగ్నింబురంబెల్లయుం గాల్చి ఘోషింపఁ

గాదైత్యు లాబాల గోపాలమున్ సంభ్రమముం జేరి నాతోక నా నీటిలోముంచి చల్లార్చి యగ్నిన్ మనోబాధకుం జిక్కితిన్

16 సీతను-మఱలఁజూచుట

ఏమయ్యెనో సీత యంచున్ బురంబెల్లయుం గాలిపోవంగ నంతన్ సురల్ జైనినాదంబునన్ నన్ను దీవించుచున్ సీత క్షేమంబు దెల్పంగ సంతోష ముంబొంది నేనామె దర్శించి సాష్టాంగ దండప్రమాణంబు గావించి సంద్రంబు లంఘించి మిమ్మెల్లఁరం జేరితిన్ జుమ్మి రామాజ్ఞ సుగ్రీవు నానం దలందాల్చి సేవించితిన్ సీత కర్తవ్యమున్ శేషమున్ నిర్ణయింపంగనౌ పెద్దలౌ మీరలే. 29

కం. సీతామాన్యకు భర్తుఁడ
నైతినిఁ గనినంత నామె [1]యపురూపంబున్
బూతచరిత శీలము నా
చేతము గ్రహియించె వినతి నేసెడి రీతిన్ 30

తే.గీ. రాము యత్నంబు సుగ్రీవ రాజు కృషియు
విజయ పంతంబులౌ వారు వేగ నేగి
రావణు వధించి రాముని రాణిఁ గొనుచు
రాఁగలుగువారు దైత్యబఁలంబుఁగంటి 31

చం. దనుజుల రేడునుద్దపసు దారుణలీల నొనర్చియుండెఁగా
కనలిన సర్వలోకములఁ గాల్పఁ గలాడు తపోబలంబునన్
జనకజఁ దాకియుం దపము శక్తి నశింపక నున్నవాడు భూ
తనయ శపించుచో నతఁడు ధారుణి గూలునుతత్క్షణంబునన్ 32

ఉ. సీత మహాపతివ్రత నశింపఁగ రావణుఁ దిట్టఁగల్గినన్
ఖ్యాతివహించు రాఘవుఁడె కాంతను జేకొన యుక్తమంచు సం
ప్రీతిఁ దదేకచిత్తమునఁ జెన్మిటి లోఁదలపోయుచుండు భూ
జాత శపింప నొల్లమియె చావక యుండె సురారి సాసువై 33

---

1 అపురూపము = మున్నెప్పుడు చూడనట్టి రూపము

ఉ. చేసిన దంతఁజెప్పితిని శీఘ్రముగాఁ గొని మిమ్ము, లంకలో
నాసురుఁ జంపి సీతగొని యాబిడ తోడుతఁ బోవ నొప్పు, నా
భాసుర రామలక్ష్మణుల పాదములం గని రామమూర్తికిన్
భూసుత నప్పగించుటయె పో తగుకార్యముగాగ నెంచెదన్ 34

ఉ. నే నొకరుండఁ జాలుదు ననిన్ దనుజాళిని రావణాసురున్
వే నశియింపఁజేయ నిక వీరులు, ధీరులు, శూరులైన యీ
వానరకోటితోఁ జన రవంత శ్రమంబు వహింప కుండ లం
కానగరంబునం దసుర కాంతునిఁ జంప సుసాధ్యమే సుమీ 35

ఆ.వె.ఇంద్రజిత్తు వేయునే యస్త్రమైనను
వమ్ముఁజేసి యతని దుమ్ము సేతు
మీర లాన నిడినఁ బోరున జయియింతు
నతనిఁ గూడఁ బూని యతులశక్తి 36

తే.గీ.అమృతమును ద్రావు నమరులు నవనిఁ బడరె
శైలవర్షంబు గురిపింప సంగరమున
ఇంక దైత్యుల మాటేలః యిల్ల రొక్కొ-
యుండునెడ మీరు ప్రోద్బల మండగాగ 37

చం. చెవియలికట్ట దాటినను సింధువు దాటగవచ్చు గాని, సం
చలనము మందరాద్రియును జయ్యనఁ బొందినఁ బొందుఁగానివై
రుల గని జాంబవంతుఁడనిలో దుముకుం గడువృద్ధుఁడయ్యుఁబెన్
బలమును వీర్యసంపదయుఁ బాదుకొనన్ జయమొందు వాడునై 38

ద్వి. అసురవీరుల మన యంగదుం డొకఁడె
కసిఁ బూనిఁ జంపఁగాఁ గలవాడు సుండి 39

ద్వి. పనస నీలులు వీరు బహుపరాక్రములు
దనుజుల బరిమార్పఁ దగినట్టి వారు 40

తే.గీ.అశ్వినీ దేవతల పుత్రులైన మైందుఁ
డును ద్వివిదులకు నెనలేరు కనఁగఁగపుల

వారి సాటి యెవ్వారగు బ్రహ్మవరము
నందిరి మరణంబుఁ గనని యటుల మున్ను 41

ఆ.వె.వరబలంబునఁ బరిమార్చి సురల సేన
అమృతమును ద్రావి యుండిరీ యతుల బలులు
వీర లిర్వురె చాలరే వైరిఁ జంపి
లంక నాశమ్ముఁ గావింప జంకు లేక 42

సీ. దశరథపుత్రుండు ధార్మిక వీరుండు
సకలుండు రాముండు జయము జయము
సర్వశస్త్రాస్త్ర విశారద శ్రేష్ఠుండు
నయమూర్తి సౌమిత్రి జయము జయము
రాఘవరక్షిత ప్లవగాధినాథుండు
సత్యార్థి కపినేత జయము జయము
అనఘ పతివ్రత అతుల రాముని పత్ని
జానకి పృథ్వీజ జయము జయము

తే.గీ.అనుచు వీథులు మార్మోగ నసుర పురిని
ప్రకటనముఁ జేసియుంటి నరాతి వినఁగ
అనిల సూనుండ హనుమంతుఁ డనెడి వాడ
రామ దాసుండ వచ్చితి లంక కంటి 43

కం. లంకను గాల్చితిఁ బూర్తిగఁ
బొంకము చెడి భస్మమాయె పురవర మెల్లన్
గొంకును విడి రామార్థము
జంకక నేనింతవఱకు సల్పితి సుండీ 44

సీ. మలిన వస్త్రంబునే మైదాల్చి హారంబు
వీడి కృశించెడి వీర వనిత
అసుర పురమ్మున నా యశోకవనిని
శింశుపాతరు శాఖఁ జేరె ననఘ

సోకుమూఁకల మధ్య శుష్కించి తపియించి
క్షోభించుచున్నదా సుదతి సీత
రామరామాయంచు రామానువర్తిని
పతిని ధ్యానించుచుఁ బఱఁగు నామె

తే.గీ.మనసునందైన రావణు మాట లేక
పతికి పరతంత్రయై పతివ్రతగ మనెడి
ఆమె వడు బాములంగని యార్తిఁ బడితి
నాత్మ హత్యకై పూనిన యామెఁ గంటి 45

ఉ. కన్నులఁ గారు నీరు వడి గాలువలై ప్రవహింప బొమ్మపై
తిన్నగ నిద్రఁ బోవదు మదిం దలపోయుచుఁ గష్టకాలమున్
మన్నయియుండె కేశములు మంజుల దేహము కాంతివీడె, నా
పన్నను దుఃఖితాత్మఁగని పట్టగఁ జాలని దుఃఖ మొందితిన్ 46

తే.గీ.రాక్షసేశుని తపమెల్ల రాలి పోయె
నమల సీతను బంధించు నంత నింక
రాముఁడు, నిమిత్తమాత్రుఁడే రాక్షసేంద్రుఁ
జంపఁగానగు, వాడె తాఁజచ్చె సగము 47

తే.గీ.పరమ దుఃఖితయై సీత బ్రదుకు మీద
నాశ విడనాడి యుండె నా యసురనేత
యిడిన గడువు రెండు నెలలు వెడల కుండ
నామె రక్షింపఁ గర్తవ్య మరయు డింక 48

ప్లవగముల సమాలోచనము

చం. అని హనుమంతుఁ డాడ విని యంగదు డంతట సీతఁ జూచి యా
మెను మన వెంటఁ బెట్టుకొని మేదిని నాథుని రామచంద్రునిన్
గనుటయె యుక్తమౌ మనమె గైకొని పోవఁగలేమె జానకిన్?
వనచరకోటి తుల్యులగు వారిల లేరు పరాక్రమంబునన్ 49

ద్వి. హనుమంతుఁడే జంపె నసుర వీరులను
మనకింకఁ గొలదియే పనియుండె మిగిలి 50

చం. అన నటురావణుం దునుమ, నంగదుఁ డొక్కఁడె చాలు నెల్లవా
రును జనఁ జెప్పనేల? యసురుల్ తుదముట్టుట నిశ్చయంబు సీ
తను గొనితెచ్చి రాముని ముదంబునఁ గాంచుట యుక్తమయ్యరా
ముని నుడి గౌరవింపఁదగుఁ బొమ్మనె రమ్మనెజూచి జానకిన్ 51

తే.గీ.రాము నాజ్ఞను బాలించి రాజు నాన
సీతఁ గాంచిన రీతినిఁ జెప్పఁదగును
అంత రాముఁడే కర్తవ్య మరసి చెప్పు
దాని శిరసావహించుట ధర్మ మగును 52

తే.గీ.అనుచు జాంబవంతుఁడు పలుకాడు నంత
వల్లె యని రంగదాది ప్లవంగ వరులు
వీడుచు మహేంద్రగిరి వారు వేగఁజనిరి
రామదర్శన కాంక్షులై వ్యోమవీథి 53

## మధువనము పాడుచేయుట

ద్వి. విను వీథి పారుచు వీరాంజనేయుఁ
గను చుండి స్తుతియించి గ్రాలుచు కపులు 54

ద్వి. దధిముఖ రక్షిత స్థానమై వరలు
మధువనంబును జూచి మార్గ మధ్యమున 55

ద్వి. నందన వనిఁబోలు సుందరోద్యాన
మందుఁ జొరబడి రానంద వశులయి 56

ఉ. అంగదరాజు మారుతియు నావనిఁ దేనెను గ్రోలు డంచనన్
బొంగుచు గ్రోతిమూక మధువుం గొనసాగిరి చెట్టు చెట్టునన్
ఖంగున దూకుచున్ ముదము గ్రాలగ వృక్షములన్ని గూల వే
భంగుల సంచరించిరి జవంబునఁ గావలి వారి మీఱుచున్ 57

**మానిని.**

అందఱు వానరు లప్పుడు మోదము నందిరి తేనెను ద్రావఁగవా
రందఱు గంతులు వేయుచుఁ బట్టుల కంతట నేగిరి త్రావుచువే
చిందఱ వందఱ సేసిరి చెట్లను శీఘ్రముగా మధువుం గొనుచున్
బొందిరి మత్తును గేకలు వేసిరి పొంగుచు గూయుచు నాడుచునున్

తే.గీ. వానరేశుఁడు సుగ్రీవు మేన మామ
దధిముఖుఁడు రక్ష సేయు నుద్యానవనిని
అంగదుని యాన మారుతి యాజ్ఞఁ బొంది
తేనెఁ ద్రావుచు ఫలముల దినిరి కపులు 59

కం. సీతను గాంచిన తృప్తిన్
గ్రోతులు మధువనము సొచ్చి కొండలు కోనల్
వీత భయంబున దిరిగిన
శీతాతప బాధ తీరఁ జెలఁగిరి వేడ్కన్ 60

సీ. ఇకిలించు నొకకోతి సకిలిచు వేఱొండు
తేనె తెట్టులఁ బూని చేతి తోడ
తేనెను ద్రావిన తేనె తెట్టుల తోడ
నొక కోతిగొట్టు వే ఱొండు దాని
గొట్టుచు నెగురుచు గూలెడి నొండుపై
వేఱొండు; దానిపై వేగము పడ
పడుచు నొండొంటిపై వనమెల్ల మధు వాని
మత్తున దిరిగెడు మర్కటములు

తే.గీ. ఒకటి గానముసేయ వేఱొకటి నవ్వు
ఒకటి రోదనసేయ నిం కొకటి యరచు
ఒకటి కొమ్మల నుయ్యాల లూగు చుండు
ఒకటి తలక్రిందుగా నూగు వికటముగను 61

ఉ. కన్నుల పండువై మధువు గ్రాలుచుఁ బుష్ప లతా నికుంజ సం
పన్నత నొప్పు నావనిని వాసవు నందన వాటియో యనం

జెన్నలరారు దానిఁ గపి సేన జరించుచు, జానకీ సతిం
గన్న జయోద్ధతిన్ మువము గాంచుచుఁ బాడొనరించి
రంతటన్ 62

శా. తేనెం ద్రావి ఫలంబులన్ మెసవి యెంతే ప్రీతిఁ గుప్పించి యు
ద్యానంబందున భూజముల్ విఱుగఁ జేయం గోతితండంబు న
ద్దానిం భూపతి మేనమామ గని బాధం బొంది వారింపఁగాఁ
బూనెం, గ్రోతులఁ దిట్టి కొట్ట, విఫలంబుం గాంచె నిర్వేద్యుఁడై 63

తే.గీ.మధువు పానంబు నేసి ప్రమత్తులైన
ప్లవఁగ బృందంబు, తను జుట్టి బాధపెట్టు
చుండ, గీఱి, కఱచి మోదుచుండ దధిము
ఖుండును భటులు కడుఁగను కుపితులైరి 64

తే.గీ.చెట్టుఁ జేఁ బూని కపులను గొట్ట ధాత్రిఁ బడఁగఁ
దదిముఖుని యంగదుఁడు గొట్టె ధాత్రిఁ బడఁగఁ
దాత యని గూడఁ దలఁపక, నాతఁ డపుడు
కొంత కాలంబు మూర్ఛిల్లి కోలు కొనుచు 65

తే.గీ.రామునకు రాజునకు యువ రాజు చేష్టఁ
దెలుపఁ దలపోసి వెంట భృత్యులును రాగ
క్షణము మాత్రాన వారున్న స్థలముఁ జేరి
కేలు శిరమున మోడ్చి సుగ్రీవుఁ గనియె. 66

తే.గీ.నందనోద్యానమున నొప్పు చంద మెల్ల
పాడు నేసిరి వానర వార మంచు
నృపుఁడు సుగ్రీవు డీవార్త నెఱుగు నంత
వీరి కురిశిక్షయే గతి వీడ దంచు 67

తే.గీ.జేని పదములఁ బడియున్న దీన వదను
మేనమామను సుగ్రీవ వానర పతిఁ
గాంచి యేమిటు భీతిని గాంచి నావు
తెల్పుమీ యనియె భయంబు తీరువినఁగ 68

తే.గీ. దధిముఖుండంతఁ దెల్పెఁ బిత్రార్జితంబు
నందనోద్యాన, తుల్య వనంబుఁ జేరి
హనుమ దంగద జాంబవదాది కపులు
మధువు గ్రోలిరి చెరిపిరి మధువనంబు 69

చం. వలదని రక్షకుల్ దెలిపి వానర కోటిని నడ్డగింప వా
రలఁ దలక్రిందుఁ జేయుచుఁ గరంబు హసించుచు గ్రుమ్మి నారలా
వలఁ గని దీని నే వెడలి వారణ సేయఁగఁ జూడ నంగదుం
డల యువరాజు గొట్టె నను నా హనుమంతుఁడు
చూచుచుండగన్ 70

ఉ. అందఱుఁ ద్రావినారు మధు వంతయుఁ జెట్లును పాడు సేయుచుం
గొందఱు తేనెద్రావి యటఁ గొమ్మల నుయ్యెల లూగు వారలున్
గొందఱు త్రావిత్రావి కడు గూర్కను బొందిరి నృత్యగానముల్
గొందఱు సల్పుచుండి వనిఁ గూలఁగఁ జేసిరి మూల ముట్టుగా 71

శా. కూడం దీసిన తేనె నంతయు మహా కోలాహలం బొప్ప నీ
వాఁడే నంగదు ప్రోద్బలంబుననె ద్రా వం జాలి రావానరుల్
పాడాయెన్ మధుపూర్ణమా వనము కా పాడంగ వృద్ధుండనై
మోడుల్ జూచుచు దుఃఖితాత్మఁ దెలుపన్ భూపా యిటున్
వచ్చితిన్ 72

ద్వి. అనునంత సుగ్రీవుఁ డతని యోదార్చి
మనమున మోదంబుఁ గనుచుండు నంత 73

ద్వి. మర్కట భాషలో మామ దెల్పంగ
నర్కజుఁ డాలించి యానంద మొందె 74

ద్వి. అది యేమొ తెలియక నంత సౌమిత్రి
విదిత మొనర్పగ వేడె సుగ్రీవు 75

ద్వి. సౌమిత్రి దధిముఖు చందంబు నడుగ
రామానుజునకు సూర్యసుతుండు దెలిపె 76

## 17 సుగ్రీవుఁడు-శుభము వచించుట

తే.గీ.దక్షిణాబ్ధి ముఖంబుగ దరలి నట్టి
అంగద హనుమ దాదు లుద్యానవనముఁ
జేరి, మధువెల్లఁ ద్రావినవార లనుచు
దధిముఖుండనియె, శుభమేదానఁ గనెద 77

ఉ. వీరు కృతార్థులై మఱలి వీటికి వచ్చుచు నుండిరంచు లో
నారయ నౌను కాని యెడ నా మధువెల్లయుఁ గ్రోలఁ జూతురే
వారలు సీతఁ జూచిన యపార ముదంబున సాహసించుచుం
జేరిరి నావనం బనుట సిద్ధము మారుతి కారకుం డగున్ 78

ఉ. మారుతి కార్యసాధన సమర్థుఁడు బుద్ధిని శక్తియుక్తులన్
ధీరుఁడు వానరోత్తముఁడు తేజమునం దతులుండు నైన నా
వీరుఁడె చూచియుండుఁ బృథివీసుత, నంగద జాంబవంతులీ
శూరుని గూడి చేయుపని చొప్పడ కుండునె యెట్టి దైననున్ 79

ఉ. చూచిరి సీత, జానకిని జూచిరి, రాఘవ ధర్మపత్నినిం
జూచిరి చూడకుండ వనిఁ జొత్తురె బ్రహ్మవరప్రసాదమై
పూచుచుఁ బుష్పసంచయము పొల్పుగ, దేనె నొసంగు నా వనిం
జేరరు పాడు సేయరు వనీచరులెంచఁ గృతార్థుఁడన్ సుమీ 80

తే.గీ.సూర్యతనయుండు చెప్పిన చొప్పు నరసి
రామ లక్ష్మణు లాహ్లాద రాశులైరి
దధిముఖునిఁ గాంచి సుగ్రీవ ధరణీ నాథుఁ
డనియె విడఁగఁ గోపము సీతఁ గనుట వారు 81

తే.గీ.గౌరవము తోడఁ గని వారి గణన సేసి
వేగ రండని నా యాన గాగఁ జెపుమ
రామ లక్ష్మణు లవ్వారి రాక వినుచు
జనకజను, గన్న చందంబు విన దలంత్రు 82

తే.గీ.రామ లక్ష్మణ సుగ్రీవ రాజవరుల
కౌ దధిముఖుఁడు సలిపి సాష్టాంగవినతి
తోడనే చని యంగదుఁ దోఁచ నుడివె
నంజలి ఘటించి సుగ్రీవు నాజ్ఞనంత 83

దధిముఖుఁడు—అంగదుని క్షమింపఁగోరుట

చం. వని మధువెల్లఁ గ్రోలుటయుఁ జాదోనరించుట రాజుతోడనే
మనవి యొనర్ప గోపమను మాటయె లేక ముదంబుఁ జెంది సీ
తనుఁ గనియున్న మీవిధము దానును రాముఁడు లక్ష్మణుండునున్
వినఁ దలపోయుచుండుటను వేగమె రమ్మని యానతిచ్చెగా 84

ఉ. అంగద నన్ క్షమింపుము మహాయువరాజవు గావె నీవు రా
జ్యాంగమునందు భృత్యుఁడనె యాట విధిన్ నెరవేర్చి యుంటి నె
బ్భంగిని వైరి గాను మిము వారణ మూనితిఁ దేనెఁ ద్రావ నా
[1]అంగునకున్ వనంబునకు నారయ నాకు, విభుండ వీవెగా 85

18 హనుమ—రామునికడ కేగుట

తే.గీ.అనుచు దధిముఖుఁ డాడంగ హర్ష మొంది
యంగదుఁడు జాంబవంతుండు హనుమ, తక్క
కపుల నెల్లరఁ గూడుచు గగన వీథి
రివ్వుమని యేగినారు సుగ్రీవు కడకు 86

తే.గీ.అంగదుఁడు మున్ను మింటిపై కరిగె నంత
హనుమ జాంబవంతుండు వెన్నాడి నారు
తక్క కపులెల్ల కిలకిల ధ్వనుల తోడ
రాచ బిడ్డను వెంటాడి రాకసమున 87

ద్వి. కిలకిల ధ్వనులతో కిష్కింధ గనిరి
పలు తెఱంగుల దృష్టి బ్రకటించుచుండి 88

1 (అంగు = బలగము)

తే.గీ.కొలఁది దూరాన నున్న వానలను గాంచి
సింహ నాదంబుఁ జెలరేగ జేసె హనుమ
ఆ ధ్వని వినుచు సుగ్రీవుఁ డతుల రీతి
వాలమును బెంచి యాడించు లీల దాని 89

ఉ. చూచితి సీత సీత సనుచున్ ధ్వని మింటను మారుమ్రోగఁగా
రాచకుమారు లిర్వురును రాజు వినం, దమ రాకకై కడున్
వేచిన వారి సన్నిధిని వే దిగి వారికి మ్రొక్కి మ్రొక్కుచుం
గీచులనాదమున్ సలుపు గీశచయం బతి సంతసంబునన్ 90

ఉ. తోకలఁ బెంచి సంతసముతో వినువీథిని వచ్చుచుండి యా
యాకసమందుసుండికని యా రఘువర్యుల నర్కజున్ వెసన్
దూకిరి వారిముంగలకు దోర్బల వంతులు కీశసైనికుల్
పోకయు రాకఁ దెల్ప మునుముందున కేగగఁ జూచి
రెల్లరున్ 91

ఉ. చూచితి సీత సీత సనుచున్ గగనంబున నుండి రివ్వనం
జాచి కరద్వయంబు రఘు చంద్రుని పాదములందు వ్రాలుచుం
బూచెను బూర్వపుణ్యలత పూలను నేటికి సీతఁగంటి నం
చా చరితార్థుఁ డెంచి విన యంబునఁ దెల్పెను
రామమూర్తికిన్ 92

19 హనుమంతుఁడు-సీత వృత్తాంతముఁ దెల్పుట

ద్వి. హనుమంతుఁ డాడిన యా శుభవార్త
విని రాముఁ డాదర మునఁగాంచె హనుమ 93

ద్వి. రవి సుత లక్ష్మణుల్ ప్రమదంబు తోడ
అవనీజ వార్తఁ గొండాడిరి హనుమ 94

ఉ. రాముఁడు సర్వలోకనుత రాముఁడు మారుతిఁ గోరెఁ దెల్ప సీ
తామణి, జానకీ రమణి దైత్యుల వాటి వసించురీతి, నా
ధీ మహితుండు వాయుజుఁడు దెల్పఁ గడంగె; నమస్కరించి, సీ
తామహితాత్మయున్న దిశ దక్షిణ దిక్కును గాంచి భక్తితో 95

తే.గీ.దక్షిణపు దిశ చెడుగను తలఁపు గలదు
కాని సీతమ్మ నాదిశఁ గనుట కతన
నది పవిత్రమ్ముగా మారె హనుమ దాన
దక్షిణాశకు మఱలి వందనము సల్పె 96

ఉ. చూచితి సీత జానకిని జూచితి రాఘవ ధర్మపత్నినిన్,
జూచితి భర్తనే తలఁచి స్రుక్కుచునున్న పతివ్రతామణిన్.
జూచితి దివ్యసుందరిని జూచితి నేల బరుండు దానినిన్
జూచితి భర్త వీడి మనుచుం బతిచింతఁ దపించు దీనమున్ 97

చం. జలనిధి దాటి దక్షిణ దిశంగల రావణు లంకఁజేరి లో
పల దనుజేశ్వరాంతిపురి పట్టున నాప్రమదావనంబునన్
విలపన మూని రక్కసులు పెట్టెడి బాధల మధ్య గుందుచుం
గల కడుదీన నశ్రువులఁ గార్చు పతివ్రతఁ గంటి రాఘవా 98

చం. పురిఁగల వీథులన్ని నిశఁబున్నమ వెన్నెలయందు రోయుచుం
త్వరితగతిం జరించితిని దైత్యులు గానఁగ లేమి రీతిగన్
బరిపరి కార్యసాధనము భావన సేయుచు నెట్టకేల కా
సురుని యశోక వాటిఁగనుచుంబలుకాడిన వాడ రాఘవా 99

ఉ. ముట్టక హారమున్ దరువు మూలమునందల యేకవేణిమై
కట్టిన చీర మాసియును గాయము డస్సి కళావిహీనమై
నెట్టుచు రక్కసుల్ బలుకు నిష్ఠుర భీతికర ప్రలాపముల్
పట్టుచు ప్రాణముల్ దనువుఁ బాయని జానకి గంటి రాఘవా 100

మ. తమి "రామా" యని రామ నామమను సంధానించుచున్నట్టి ఆ
విమలాత్మన్, సురవైరినిం దృణగతిన్ వీక్షించి మాటాడు నా
కమలాక్షిన్ గరుణామయన్ రఘువరుం గాంక్షించుచున్ రాము జూ
డమి, చావం దలపోయు జానకిని జూ డంగల్గితిన్ రాఘవా 101

తే.గీ.ఎట్టులో కష్టమున సీతఁ గట్టకడకుఁ
గాంచి యామె కెఱుకపడ నెంచి యెంచి

ప్రస్తుతించితి నిక్ష్వాకు వంశమెల్ల
ఆమె ననునమ్మ యొరులెవ్వ రరయ కుండ 102

ద్వి. రవినందనునిఁ దోడ రాముని మైత్రి
వివరింప సీతమ్మ విని సంతసించె 103

ద్వి. అంగుళీయకమీయ యాయమ్మ నమ్మి
పొంగెను రాముఁడే పొడచూపి నటుగ 104

ద్వి. కాకాసురుని గాధ లోకైక నాథ
నీకభిజ్ఞగఁ దెల్ప నాకామె చెప్పె 105

తే.గీ.విన్నయది చూచినది యథా విధము గాగ
రామునకుఁ దెల్పుమీ యని యామె పలికి
కొంగు ముడి విప్పి మఱియొండు గుఱుతు గాగ
శుభద చూడామణి నొసంగె శుద్ధచరిత 106

చం. పదిలము చేసియుంచిన శుభప్రదమౌ మణి యిద్ది నీకు గా
నిదికని యార్తి నూరడిల నెంతయొ యత్నము సేయుచుండు నీ
కిది గుఱుతింపఁ బంపితిని నింక సజీవగ నొక్క మాసముం
డెద గడువంతియే రఘు కులీనుఁడ వెంటనె వచ్చిప్రోవవే 107

కం. అని సుగ్రీవుఁడు విన రా
మున కెఱిగింపుమని భూమి పుత్రిక పల్కెన్
జనకజ మాటలఁ జెప్పితిఁ
గననగు మార్గంబు జలధిఁ గడచు విధంబున్ 108

ద్వి. అనుచుఁ జూడామణి హనుమ రామునకు
వినయంబుతో భక్తి విరియంగ నిచ్చె 109

రాముని పరితాపము

ఆ.వె.ధీర రాఘవుండు దేవి పంపిన మణి
గుండెపైన నదుముకొనుచు నేడ్చె

భానుపుత్రుఁ గాంచి పరమదుఃఖితుఁడయి
మణి తెఱంగుఁ దెల్పె మమత తోడ 110

తే.గీ.వత్సమును జూచి ధేనువు వత్సలతను
జేపు రీతిఁ జూడామణి చేత నాదు
మనసు స్రవియించుచున్నది జనక సుతకుఁ
బెండ్లి కాలానఁ దండ్రియే ప్రేమ నొసఁగె 111

చం. జలమున, బుట్టినట్టి మణి సజ్జన పూజితమైన దిద్ధి ము
న్నల సురనాథుఁడిచ్చె వర యజ్ఞమునన్ జనకక్షితీ శుకున్
దల.తును దండ్రినిన్ జనక ధాత్రివిభున్ సతినిన్ మణిం గనన్
దలనిది సీతదాల్చుఁ గన ధాత్రిజఁ జూచిన యట్లె యుండెగా 112

ఆ.వె.దప్పి గొనినవాడు తనివొందు జలమిడ
సీత వాక్యజలము చేత నన్ను,
దడుపఁ జెప్పె నెద్ది నుడువుమీ యెల్లయుఁ
జూడఁ జాల సీతఁ జూతు మణిని 113

తే.గీ.నన్నుఁ జూడక యొక నెల నన్నుతాంగి
జీవమును నిల్ప బహుకాల జీవిని యగు
నిశ్చయమ్ము క్షణమిక నే నిలువఁ జాల
లక్ష్మణా! సీతఁ జూడక బ్రదుకఁ జాల 114

ఆ.వె.సీత కడకు నన్నుఁ జేర్పుమీ లక్ష్మణా
ఆమెఁ జూడలేక యామె శిరోమణి
గాంచుచుంటి నింత కంటెను దుఃఖమ్ము
వేరుగలదె! సీత వేగఁ జూతు 115

తే.గీ.సుందరీమణి నా సీత స్రుక్కి స్రుక్కి
రాక్షసుల మధ్య భీకరాకారవతతుల
నడుమ నెటులున్నదో కద! యిడుమలఁ బడి
భయముఁ జెందెడి సహజస్వభావ మరయ 116

తే.గీ.హనుమ! పలుకాడుమీ సీత యనిన దెల్ల
మందుచే రోగి జీవించి మనెడి రీతి
సీత నుడువు లన్నియు నీవు చెప్ప వినుచు
జీవములనుండ వెంచెదఁ జెప్పు మెల్ల 117

సీత నుడువులు

ద్వి. అను రామునకు వాయు తనయుండు, దెలిపె
జనకజ నుడువుల వినయంబు తోడ 118

ఆ.వె.చిత్రకూటమందు సీతను గాకంబు
పొడిచి పొడిచి రుధిరము స్రవియింప
జేసె నిద్రలేచి సీతను గని నీవు
పొడిచి నట్టి కాకి ముందునఁ గని 119

తే.గీ.శాపవశమున రాక్షస రూప మెత్తి
కొండ కోనలఁ దిరుగాడు చుండ నితఁడు
వాసవుని సూనుఁడయ్యును వాయసంబు
గాగ మన సేవ వచ్చె రక్కసుఁడు వీడు 120

మ. అని దర్భాసనదర్భ నొండు గొని బ్రహ్మాస్త్రంబుఁ గా వాయసం
బును దాకన్ విడ, నద్ది మండిపడుచున్ ముల్లోకముల్ ద్రిప్పఁ గా
కిని రక్షించెడి వారి గానకది నీ కే మ్రొక్క రక్షింపఁగా,
ఘనశస్త్రాస్త్రవిదుండ! పద్మనయనా! కాకాసురుం గావవే 121

ఉ. అట్టి మహాస్త్రవేత్తయగు సంచిత శీలుఁడు దోర్బలుండు నే
డిట్టుగ నూరకుండ కతమేమొ? మహాస్త్రము వీడడాయె నీ
కట్టిడి రక్కసుల్ మడియఁగా దనుజుల్ సురలున్ మరెవ్వరేన్
గిట్టక యుందురే యనిని గీడ్పడ కుందురె రాము డీకొనన్ 122

తే.గీ.కొంచె మేనియు నాయందుఁ గూర్మియున్న
రావణునిఁ జంపగా రాడె రామ విభుఁడు
వీర్యవంతుండు వివిధాస్త్ర విదుఁడు శత్రు
సూదనుండగు రఘువంశజుండు నేడు 123

ఆ.వె.రావణేశుఁ జంపి రక్షింపఁగా నన్ను
లక్ష్మణుండు గూడ రాడ దేల?
అన్న యాజ్ఞ యైన యాపురుషుండు తా
క్షణములోన దైత్య సంహరించు 124

ఆ.వె.ఆడుదాన నగుట నాడ గూడని యట్లు
మాటలంటి వనినిఁ జేటు మూడె
వాని మరచి పొమ్ము దీనను లక్ష్మణా
గావ రమ్ము దైత్య కాంతు దునుమ 125

ఆ.వె.అన్నదమ్ములొక్క తెన్నున నున్నారె
వారి ననఁగ నేలఁ బాపకర్మ
మెప్పుడో యొనర్చి యెద్దియో యిటులుంటి
సంశయంబు లేదు సత్య మిదియె 126

ద్వి. అని సీత వచియించె నార్తి యందుండి
అనఘ! పల్కిన మాట నాలించి నేను 127

ద్వి. వినతిమై యోదార్చి విన్న వించితిని
జనకజా నినుఁ గంటిఁ జాలకష్టమున 128

హనుమ సమాధానపఱచుట

ఉ. రాముఁడు నిన్నెదం దలచి రాత్రిఁ బవల్లను దుఃఖితుండగున్
రామునిఁ గాంచి యార్తిఁబడు లక్ష్మణు డున్ సతతంబు నిన్నె సీ
తామహితా దలంచుచును దాల్మిని వీడుచు నుండు రాఘవుం
డా మహనీయ లక్ష్మణుఁడు నాసుర జంపగ వత్తు రమ్మరో 129

ఉ. రావణుఁ జంపి యుద్ధమున లంకను భస్మము గాగఁజేయను
గ్రీవుడు రామలక్ష్మణులు కేశవరేణ్యుల తోడ గూడఁ నిన్
బ్రోవఁగ వచ్చువార లిక భూసుత! క్లేశము వీడఁగా దగున్
దేవి! యయోధ్య కేగెదవు దేవరఁ గూడుచు నిశ్చయంబిదే 130

ద్వి. అనుచు నేఁ బల్కంగనాలించి యొసఁగఁ
గొని తెచ్చినాడ నీ గుఱుతుగా మణిని 131

చం. పయనము సేయుచున్న తఱిఁ బద్మదళాక్షి మరొక్క మాఱనెన్
రయమున రాముఁ డిచ్చటకు రాఁదగు యత్నము సేయువాఁడ వీ
వయని తలంచుచుంటి నటు వారలఁ దోడ్కొని వత్తువంచు నా
భయమును వాపగాఁగలుగు వాఁడవు నీవయటంచు నమ్మితిన్ 132

ఉ. రాముఁడు వీరరాఘవుఁడు లంక, రణంబొనరించి చంపి యా
కాముకు నన్ను వెంటఁ గొనగాఁదగు నయ్యదె కీర్తిహేతువౌ
రాముఁడు లేని కాలమున రావణ రాజు హరించి తెచ్చె న
న్నా మహితాత్ముఁడాజి విజయంబునఁ గొంట యశస్కరంబగున్

మ. హనుమా! తెల్పుము రామలక్ష్మణులకా ఆదిత్యసంభూతి కా
తని వారెల్లరకున్ సుమంత్రులకు సీతాదీన క్షేమంబుఁ గో
రిన దంచున్ దనుజేశునిన్ దునుమ వారిన్ లంకలో వెంటనే
కను విశ్వాసముతోడ నున్నదనుచుం గానున్న దేమైన నౌ 134

మ. అయితే వత్తురె రామలక్ష్మణులు? దీర్ఘాబ్ధిన్ వెసన్ దాటుచున్
రయమొప్పన్ రవిసూనుఁడున్ గపులునున్ లంఘింతురే వారిధిన్
భయమొక్కింత మనంబునంగలదహో! వారాశి లంఘించు వా
రయి యుండన్ వలె మీబలంబు, హనుమా రక్షింపనన్ లంకలో

ద్వి. అను నామె కేనంటి వినతి సల్పుచును
జనకజ భీతి సంశయములు దీర 136

తే.గీ. అమ్మ! వినుమమ్మ నాకంటె నధిక బలులె
గలరు సుగ్రీవ కపి వీర బలమునందు
స్వల్పుఁడను నేనె వానర సైన్యమందు
జలధి లంఘించి వత్తురు జయము మనదె 137

తే.గీ రామ లక్ష్మణు లేరీతి రాఁగలార
లనుచు శంకింతువేమొ వారలను దెత్తు
మూపుపై నిల్పి శ్రమలేక మోసికొనుచు
లంక కేతెంచువాఁడఁ గార్యము ఫలింప 138

తే.గీ.గగనమార్గంబునఁ జరింపఁ గలుగువారు
మూడు లోకాల నొకరీతిఁ బోవువారు
వానర శ్రేష్ఠులున్నారు వారిఁగూడఁ
గాంచ గలదానవీవు లంకను నిజంబు 139

మ. ధనువుం బూనుచు వీరరాముఁడు గుణ ధ్వానంబునన్ ద్వారమం
దున లంకాపురి నిల్వఁజూడగల వీదుర్మార్గునిన్ రావణున్
దునుమం జూచి యయోధ్యకేగి పతితోఁ దుష్టిన్ స్వరాజ్యంబు బొం
దను, గాలంబికవచ్చె మంగళమగున్ ధాత్రీసుతా శీఘ్రమే 140

ద్వి. కానన వాసంబు కడతేరు నంత
జానకీ రాములు చనెద రయోధ్య 141

ఉ. సీతను బాసి రాఘవుఁడు సెందె మహార్తి నటంచుఁ దెల్పఁగా
పూతచరిత్ర దుఃఖమును బొంది తపింపఁగ సాగె నంతఁ బ్రే
మాతిశయంబు సంఘటిల నంచిత వాక్కుల నూరడించి సం
ప్రీతినిగూర్చి శోకమును వీడఁగఁ జేసితి శాంతిఁ గూర్చితిన్ 142

తే.గీ.నీదు సంకల్పమున ధర్మ నెగడె మున్ను
మహిత శక్తివంతంబుగా మా విభుండ
చేతనుఁడ నీకృప లభింపఁ జేయఁ జాల
నట్టి పని యేదియుండునో యవని నాథ 143

ద్వి. తమిఁ బ్రణామమ్ము సీతమ్మకు సల్పి
విమలాత్మ నినుఁ జేర వే వచ్చినాడ 144

ఉ. మంగళమాదిదేవునకు మంగళమా రఘునాథ మూర్తికిన్
మంగళమా కృపానిధికి మంగళమా రఘురాము పత్నికిన్
మంగళమా ప్రసన్నునకు మారుతికిన్ గపికోటి నేతకున్
మంగళమౌత శ్రోతలకు మంగళమౌత పఠించువారికిన్ 145

ఫలశ్రుతి

ఉ. సుందరకాండమెవ్వరు విశుద్ధమనంబున విన్న వ్రాసినన్
బొందఁ గలారు సర్వసుఖముల్, భువి జీవిత యాత్రకష్టముల్

జెందరు రామభక్తుఁడగు ఆ హనుమంతుఁడు తోడు నీడయై
ముందుగ మార్గదర్శి యగు మోక్షము ప్రాప్తిల జన్మనాశమై 146

ఉ. యోగులు యోగసిద్ధులయి యొప్పి పరాత్మకృపావిశేషసం
యోగముఁ బొందఁగల్గుదు, రయోగులు జీవులు నిత్యసౌఖ్యసం
యోగము నొందు చుందురు యథోచిత రీతి, నదృష్టహీనులౌ
రోగులు రోగముల్ జనఁ బరోగమునం బొనరింతు రెల్లరున్ 147

కం. బీజాక్షర సంయుతమై
రాజిల్లెడి కాండమిద్ది వ్రాయం జదువన్
దేజంబిడుచున్ హరి య
వ్యాజంబుగఁ గృప వహించు భక్తులయెడలన్ 148

కం. సీతాదుఃఖ వినాశన
పూతుం డరికర్శనుండు మోక్షప్రదు డా
సీతాపతి భక్తుండిడుఁ
జేతనులగు పాఠకులకు స్థిరసౌఖ్యంబుల్ 149

ఆశ్వాసాంత పద్యములు

ఉ. రాముని గొల్చునంచె రఘు రాముని దాసజనంబుఁ గొల్వ ఆ
రాముఁడు సత్కృపంగను సరాసరియంచని పెద్దలాడఁగా
నే మును విన్నవాడ నది నేటికి సంభవమయ్యె నేను ని
ష్కాముఁడనై రచించి తుదిఁ గాంచితి సుందరకాండ నీ కృపన్

సీ. శతయోజనంబుల సంద్రంబు దాటిన
పటుయోగ శక్తి లవంబ యేని
రావణాంతఃపురి రమణులఁ గని చలిం
పని శుద్ధబుద్ధి రవంత యేని
వనలేత సీతమ్మఁ గన రోయ విడువక
శ్రమఁ గన్న దీక్ష లేశంబ యేని
కమలాక్షిఁ గని పల్కు కార్యసాధనయుక్తి
జయరామ భక్తి కొ సంత యేని

తే.గీ.ప్రాపిలవె భక్తి నీకథ వ్రాసి వినిన
సుందరము సప్తకాండల సుందరంబె
కాక మహిమాన్వితంబుఁగా గ్రాలునిద్ది
మ్రొక్కెద హనుమ దీవించి దిక్కుగమ్ము 151

ఉ. అండగఁ జూచి రామవిభు నాతని దాసుని, రోగినయ్యు నీ
కాండము వ్రాయఁ బూనితి నఖండముదంబునఁ గాని మధ్య ను
ద్దండగతిన్ రుజంగనితి దాటగ గండము ప్రేమమీర రా
ముండె ధరాత్మజాప్రియుఁడె పూర్తిగ వ్రాయఁగఁ జేసె
సత్కృపన్ 152

తే.గీ.భక్తభక్తుండు రామయ్య భక్త సీత
హనుమలను గూర్చియుండిన ఆత్మకథను
వ్రాయఁగాఁ జేయఁడే యింక వ్రాయవలయు
నతని పట్టాభిషేకంబు నమిత భక్తి 153

ఉ. ఆయువొసంగి రామకథ నంతయుఁ బూర్తిగ వ్రాయఁ జేయడే
ప్రేయసిఁ గూడి రాజ్యరమఁ బ్రీతివహించెడి యుద్ధకాండ మా
ప్యాయముతోడ వ్రాయఁగల పాటవముం గృపసేయు,వాడె రా
మాయనమో యటంచు సత మాత్మఁ దలంచెడి వాని కండయై 154

ఆ.వె.అవధి లేదొకండు నారోగ్యమొక్కటే
కొదువయయ్యె వేరు కోర్కిలేదు
అబ్బ! ముసలివాఁడ దెబ్బది వచ్చెను
రామకార్య మెంచి బ్రదుకఁ దలఁతు 155

తే.గీ.రామ! సద్భక్తజనవత్సలా! నమామి
ధాత్రిజాదేవి! జనకసుతా! నమామి
అఖిల గుణవిలక్షణలక్ష్మణా! నమామి
రామదాసుండ వాయుపుత్రా! నమామి! 156

తే.గీ.నా కనారోగ్యముం బాపి సాకు మేప
నీకు పట్టాభిషేకంబు నే నొనర్ప

సీత కవఁ గూడి పట్టాభిషిక్తుగరాము
కనుల విందుగ నను(జూడఁ గలుగ నిమ్మ 157

తే.గీ. యుద్ధకాండంబు వ్రాతుఁ బ్రసిద్ధిఁ గనఁగ
త్రిపురసుందరి కవితను దీర్చిదిద్ద
మంగళము జానకీరామ మంగళమని
పాడ నీరాజనమ్మిడి భక్తతతులు 158

సమాప్తము

ఇది

శ్రీవసిష్ట - శక్తి - పరాశర - త్ర్యార్షేయ-పరాశరగోత్ర పవిత్ర సుభద్రా వేంకట కృష్ణమాచార్య పుత్రుండును మహాత్మగాంధి చరిత్ర-భారతదేశ ఆర్థికచరిత్ర - భారతీయ రాజ్యాంగచరిత్ర-పాహిమాంశతక-ఇత్యాది గ్రంథకర్త ఆత్మకూరి గోవిందాచార్య విరచిత శ్రీ గోవింద రామాయణ కావ్యంబున, సుందరరాముఁడను, సుందరకాండము సర్వము సంపూర్ణము.

శ్రీ సీతారామార్పణమస్తు

మంగళమ్. మహత్.

శ్రీ శ్రీ శ్రీ

# రామాయణ కాలక్రమము

| | | సం.మా.ది. |
|---|---|---|
| అరణ్యకాండ మొత్తం కాలం | ... | 13–1–0 |
| దుందుభి సం॥ చైత్ర శుద్ధ 5 మొదలు, ధాతృ సం॥ | | |
| చైత్ర శుద్ధ 5 వరకు | | |
| వైశాఖశుద్ధ 14 వఱకు చిత్రకూట వాసము | | |
| వైశాఖ శుద్ధ 14 ఉదయం అత్ర్యాశ్రమమునకు బోవుట | | |
| వైశాఖ శుద్ధ 15 దండకారణ్య ప్రవేశము | ... | 0–1–10 |
| వనవాసమునందయోధ్యకాండలో జరిగిన దినములు, | | |
| చిత్రకూటము నుండి దండకారణ్యము ప్రవేశించు వఱకు | | |
| దుందుభి సంవత్సర వైశాఖ శుద్ధ 15 లు | ... | 0–1–10 |
| రుధిరోద్గారి సం॥ మార్గశిర శుద్ధ 5 వఱకు అచ్చటచ్చట | ... | 1–6–20 |
| అక్షయ సంవత్సర చైత్ర శుద్ధ 5 వఱకు అచ్చటచ్చట | ... | 1–4–0 |
| విభవ సం॥ ఆశ్వయుజ శుద్ధ 5 వఱకు అచ్చటచ్చట | ... | 2–6–0 |
| శుక్ల సం॥ కార్తిక శుద్ధ 5 వఱకు అచ్చటచ్చట | ... | 1–1–0 |
| ప్రజోత్పత్తి సం॥ వైశాఖ శుద్ధ 5 వఱకు అచ్చటచ్చట | ... | 1–6–0 |
| ప్రజోత్పత్తి సం॥ శ్రావణ శుద్ధ 5 వఱకు అచ్చటచ్చట | ... | 0–3–0 |
| అంగీరస సం॥ చైత్ర శుద్ధ 5 వఱకు అచ్చటచ్చట | ... | 0–8–0 |
| భావ సంవత్సర చైత్ర శుద్ధ 5 వఱకు సుతీక్ష్ణాశ్రమము | ... | 2–0–0 |
| భావ సంవత్సర చైత్ర శుద్ధ 6 వఱకు అగస్త్యాశ్రమము | ... | 0–0–1 |
| భావ సంవత్సర చైత్ర శుద్ధ 7 మొదలు యువ సం॥ | | |
| వైశాఖ బహుళ 30 అంతము పంచవటీ తీరవాసము | ... | 1–1–23 |
| యువ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ 1 సీతాపహరణం | | |
| జ్యేష్ఠ శుద్ధ 15 శబరీ దర్శనము | ... | 0–0–15 |
| యువ సంవత్సర జ్యేష్ఠ బ 1 హనుమద్దర్శనము | | |
| వనవాసము గతించిన కాలము | ... | 13–2–10 |

## కిష్కింధా కాండము కాలక్రమము

| | | సం.మా.ది. |
|---|---|---|
| | | 0-8-27 |
| యువ సం॥ జ్యేష్ఠ బ 1 మొదలు జ్యేష్ఠ బ 30 వఱకు | | |
| సుగ్రీవ సఖ్యము-సాలఖండనాదులు | ... | 0-0-15 |
| ఆషాఢ శుద్ధ 15 వాలివధ | ... | 0-0-15 |
| ఆషాఢ శుద్ధ 30 వఱకు-సుగ్రీవుని పట్టాభిషేకము- | | |
| అంగదునియౌవరాజ్య పట్టాభిషేకము | ... | 0-0-5 |
| యువ సం॥ శ్రావణము మొదలు, కార్తీక మాసాంతము | | |
| గుహావాసము | ... | 0-4-0 |
| మార్గశిరమున లక్ష్మణుని కోపము-సర్వవానర | | |
| సమ్మేళనము-సీతాన్వేషణమునకు వానరులను పంపుట | ... | 0-1-0 |
| దక్షిణ దిశకు బోయిన వానరులకు జరిగిన కాలవివరము | | |
| అచటనచట | ... | 0-0-12 |
| వింధ్యపర్వతమున | ... | 0-1-0 |
| బిలమున | ... | 0-1-0 |
| మొత్తము | ... | 10-2-12 |
| యువ సంవత్సర ఫాల్గుణ శుద్ధ 12 దినమున | ... | 0-8-27 |
| సముద్రతీర గమనము-సంపాతి దర్శనము మొదలగునవి | | |
| ఇప్పటికి వనవాసమున గతించిన కాలము | ... | 13-11-7 |

## సుందరకాండము కాలక్రమము

| | | సం.మా.ది.గ. |
|---|---|---|
| | | 0-0-1½-0 |
| యువ సంవత్సర ఫాల్గున శుద్ధ త్రయోదశి ఉదయమున | | |
| మహేంద్రాగ్రము నుండి హనుమ సముద్రలంఘనము- | | |
| అస్తమయాత్పూర్వము | | |
| లంకాగమనము-అస్తమయ పర్యంతము లంకకు | ... | 0-0-0-30 |

| | | |
|---|---|---|
| వెలుపల నుండుట-ప్రదోష కాలమునలంకలో ప్రవేశించి లంకిణిని మర్దించుట | ... | 0-0-0-4 |
| రావణ ప్రహస్తాది గృహములు వెదకుట శింశుపా వృక్ష సమీపమునకు వచ్చుట తెల్లవారుఝాము | ... | 0-0-0-18 |
| సీతతో సంభాషణ-వనమును, కింకరులను కాల్చుట-ప్రాసాదభంజన సమయము-చతుర్దశి ఉదయము | ... | 0-0-0-7½ |
| జంబు అక్షయకుమారులవధ-ఉదయానంతరం | ... | 0-0-0-7½ |
| ఇంద్రజిత్తుచే హనుమంతుకు పట్టుబడుట రావణ సౌధమున సంభాషణ | ... | 0-0-0-2 |
| లంకాదహన కాలము-సుమారు | ... | 0-0-0-2 |
| సముద్రమును దాటుట-వానరులతో గలియుట | ... | 0-0-0-4 |
| వానరులందఱు గలియుట-కిష్కింధ చేరుట-చతుర్దశి సాయంకాలము | ... | 0-0-0-15 |
| | | 0-0-1-30 |



# శ్రీ గోవింద రామాయణము

## "సుందర రాముడు" తప్పొప్పుల పట్టిక

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 2 | 6 | 1 | దరింబి | దరించి |
| 17 | 98 | 3 | శత్రుకర్మన | కర్మన |
| 21 | 4 | 4 | నేనాకో? | నానాకో! |
| 23 | 22 | 1 | కలవియేను | కలవియాను |
| 25 | 33 | 4 | దీనమై | దీనయై |
| 25 | 34 | 1 | బల్మియై | బల్మిమై |

197వ పద్యము 198 పద్యముగ సరిదిద్దుకోవలెను అట్లే 197 పద్యము నుండి 210 పద్యము వరకు.

| పుట | పద్య సంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 53 | 23 | 3 | సరహ | సర్వ |
| 61 | 71 | 1 | కరాకృతులు | భీకరాకృతులు |
| 63 | 84 | పద్యము | మాలిని | మానిని |
| 66 | 98 | 2 | లేకయే | లేకయె |
| 68 | 110 | 2 | గానేల | గానేల శ్రీ |
| 69 | 114 | 2 | సజీవియై | సజీవి |
| 69 | 119 | 4 | దుఃఖము | దుఃఖము |
| 74 | 149 | 4 | వృత్రి | వృత్రు |
| 75 | 154 | 2 | హయిములు | హయములు |
| 76 | గీత క్రింద | 3 | 8,9 శ్లోములకు | శ్లోకములకు |
| 77 | 166 | 3 | మత్తజ | మత్తగజ |
| 80 | 189 | 3 | రీగా | రీతిఁగా |
| 80 | 185 | 4 | ర్యపై | భార్యపై |
| 81 | 190 | 4 | బొదగ | బొందగ |
| 81 | 192 | 2 | (దే)వాతక | (దే)వాంతక |
| 125 | 545 | 3 | సగ్గుణ | సద్గుణ |
| 135 | 608 | 2 | విడము | విడుము |
| 136 | 116 | 4 | జెప్పుమమ్మా | జెప్పుమాను |
| 142 | 661 | 2 | వేలేరు | వేరేరు |
| 144 | 3 | 4 | సిద్ధియే | సిద్ధియో |
| 161 | 118 | 1 | వారుతముల | వాదువముల |
| 164 | 138 | 1 | కార్యమేనె | కార్యమానె |
| 166 | 149 | 2 | వుడురాకా | వునురాకా |
| 168 | 160 | 4 | దశకంథునిన్ | దశకంతునిన్ |
| 50 | 204 | 3,9 | నిల్వువాడునుగూడ | నిల్వుచుండెడివాడు |
| 50 | 204 | 4 | పొందుచు | పొందక |